# మీ పంటలకు కావలసిన పోషణ అందుతోందా?

## జై కిసాన్ సంపూర్ణ 19:19:19

## జై కిసాన్ యూరియా 46.4% నత్రజని

JAI KISAAN
SAMPURNA
19 : 19 : 19
GRS 50.5KG NET 50KG
ZUARI AGRO CHEMICALS LTD
GOA

JAI KISAAN
UREA
46.4% N
GRS 50.6KG NET 50KG
ZUARI AGRO CHEMICALS LTD
GOA

## పూర్తిగా నీటిలో కరుగుతాయి, అంచేత మొక్కలు మరింత ఎక్కువ పోషక పదార్థాలను పీల్చుకుంటాయి.

- జై కిసాన్ సంపూర్ణ 19:19:19
  పోషక పదార్థములు 1:1:1 పాళ్లలో గల సంకీర్ణ ఎరువులలోకెల్లా మిన్నయైనది.
- నైట్రేట్-నత్రజని గల ఎరువులతో పోల్చితే, సంపూర్ణలోని నత్రజని ఏమీ వృథాపోదు.
- సంపూర్ణలోని పోషక పదార్థములన్నీ నీటిలో కరుగుతాయి.
- అందువలన పంటలపై దీని పనితనం తొందరగా కనబడుతుంది.
- జై కిసాన్ యూరియా 46.4%లో నత్రజని ఎంతో ఎక్కువ. బైయూరెట్ తక్కువ.
  అందుచేత ఇది అన్ని రకాలుగా వేయడానికీ, పంటపై పిచికారి చేయడానికి సురక్షితమైనది
- అతి తెల్లనిది, అతి శుద్ధమైనది, అతి శక్తివంతమైనది




# జై కిసాన్ ఎరువులు

## అత్యధిక దిగుబడి కోసం అత్యధిక పోషణ.




జువారి అగ్రో కెమికల్స్ లిమిటెడ్, గోవా
ప్రాంతీయ విక్రయ కార్యాలయాలు: సికింద్రాబాద్, విజయవాడ, బెంగుళూరు, హుబ్లి, నాగపూర్, పూనా, జువారినగర్.

LINTAS ZUA 1102315 TL

## మ న వి

సకాలానికి అందకపోవడంవల్ల ఈ వారం 'మ్యాడిల్లీలేఖ' వెయ్యలేక పోతున్నాము—సం.

## ముఖచిత్రం

25–5–84 సంచిక ముఖచిత్రం గురించి అబ్బ, ఏం చెప్పమంటారు! వనజ కుమారిని నేను బాగా ఎరుగుదును. సినిమా తాగల పాత (రోత) ఫొటోల్తో విసుగెత్తిన మాకు కొత్త ఫొటోగ్రాఫర్ ఇచ్చిన అందమైన కొత్త ముఖచిత్రం!...

కొత్త ముఖాల్నీ, కొత్త ఫొటోగ్రాఫర్స్ నీ సమయం వచ్చినప్పుడు ప్రోత్సహిస్తున్న విషయం, 25–5–84 సంచిక ముఖచిత్రం చూసి మేం గుర్తించాం.

ఇలాగే మరికొన్ని అందజైరూ ?

ఎస్. సురేష్‌కుమార్, కైకలూరు.

* * *

అంబిక ముఖచిత్రం చాలా బావుంది. థాంక్స్ + అభినందనలు + ధన్యవాదాలు = ఆనందము.

కె. శివరామకృష్ణప్రసాద్, రావికంపాడు.

## మిస్ ఆంధ్రప్రదేశ్

25–5–84 తేదీ సంచిక మిస్ ఆంధ్ర ప్రదేశ్ (1984)గా ఎన్నికైన కె. వనజ కుమారి ముఖచిత్రం చాలా అందంగా, అత్యంత ఆకర్షణీయముగా ఉంది. మిస్ ఆంధ్రప్రదేశ్‌గా ఎన్నికైన వీరికి మా అభినందనలు.

బి. లక్ష్మణశాస్త్రి, భీమవరం.

## అభినందనలు

25–5-84 వారపత్రిక ముఖచిత్రం 1984 "మిస్ ఆంధ్రప్రదేశ్"గా ఎన్నికైన శ్రీ కె. వనజకుమారి ముఖచిత్రంగా వేసినందులకు మీకు, ఎన్నికైన కుమారిగార్కి మా అభినందనలు. బ్యాలట్ పోటీలో ఎన్నికైన ఉత్తమ నటుడు మా అభిమాని అక్కినేనిగారి ముఖచిత్రం వేయమని మనవి. శ్రీ కె. వనజ కుమారి జీవిత విశేషాలు, వారి అభిరుచులు, మొదలగునవి పత్రికలో ప్రచురించమని విన్నపము.

ద్విభాష్యం కృష్ణమూర్తి, మొగల్తూరు.

## వి శే ష ం

"ఇంద్రజాలం–గ్రేట్ ఎస్కేపిస్ట్ హూడినీ" గురించిన వ్యాసం చాలా బాగుంది. అద్భుత వ్యక్తులు గురించిన శీర్షిక మమ్మలందరినీ విజ్ఞాన డోలికలలో ముంచేస్తోంది. నిజంగా 11–5–84 సంచికలో విశేషం ఏదంటే... అద్భుతమైన సాహసకృత్యాలు గల శీర్షికే అని చెప్పక తప్పదు. కళావతి, పాండు, వెల్లండ.




## అద్భుత వ్యక్తులు

మీరు ప్రచురించిన "అద్భుత వ్యక్తులు" అన్న శీర్షికలో "డా॥ రైన్"గారి గురించిన వ్యాసం చాల బాగుంది. ఒక మహామనిషి గురించి సవివరంగా వివరింపచేసే ఇలాంటి విజ్ఞాన విషయాలు మీరు ప్రచురించ నారంభించినందుకు అభినందిస్తున్నాను.

కిరణ్మయి, హైదరాబాద్.

* * *

టెలిపతి, క్లియర్‌వాయన్సు, సైకో సైనసిస్ ఇ. ఎస్. పి.ల ద్వారా ఎదుటి వ్యక్తి తన మనస్సులో అనుకున్నవి, దూరంగానున్న ఒక వ్యక్తి చేసే పనులను గమనించగల శక్తి పొందగలడంటే నమ్మలేకున్నాను. కాని మా పత్రికలో ప్రచురించబడింది కాబట్టి నమ్ముతున్నాం. ఏఏ వ్యక్తికి ఏఏ వింత శక్తులున్నాయో విశదపరిచే ఈ శీర్షిక నిర్వహించే పట్టాభి రామ్‌గార్కి థాంక్స్. పురుషోత్తం, మలక్‌పేట.

* * *

4–5–84 సంచికలోని "అద్భుత వ్యక్తులు" అన్న శీర్షికతో బి.వి. పట్టాభిరాంగారి శీర్షిక చాల విజ్ఞానవంతంగానున్నది. డా॥ రైన్ చరిత్ర చదివాక కొన్ని అతీంద్రియ శక్తులున్నట్లు తెల్సికొన్నాం. పట్టాభిగార్కి మా అభినందనలు.

ఎన్. శివప్రసాద్, నాగులపల్లి జయశ్రీ, హైదరాబాదు.

* * *

హిప్నాటిజం డా॥ జేమ్స్ బ్రయిడ్ (అద్భుత వ్యక్తులు) అద్భుతముగా వుంది. హిప్నాటిజము పుట్టుక గూర్చి చాలా విపులంగా వ్రాసారు. చాలా బాగుంది. బండారు చంద్రమౌళి, చర్ల.

## స ం తో ష ం

ప్రపంచంలో ఎంతోమంది వ్యక్తులుంటారు కాని వారిలో ఎవరెవరు ఏ సాహసాలు చేశారు? మనకి సంబంధించిన దైనిక కలాపాలలో, ప్రతి వ్యక్తికీగల ఏకాగ్రత, ఆత్మవిశ్వాసం మొ॥నవి ఎంతో ప్రశంసనీయమైనవి. కేవలం ఒక వ్యక్తికి గల అతీంద్రియశక్తులు, సైకో సైనసిస్, ప్రీకాగ్నిషన్, మొదలయినవన్నీ క్షుణ్ణంగా మాకు అందించే అవకాశం [అద్భుత వ్యక్తులు] కల్గించుచున్నందుకు చాల సంతోషంగా వుంది.

గులాం మహ్మద్, పాలమూర్.

## శూర్పణఖ శోకం

శ్రీ కవనశర్మగారి "శూర్పణఖ శోకం" కథ మమ్మలనమితముగా ఆకర్షించినది. రామాయణ గాథలోని ముఖ్య పాత్రలను నేటి భారతానికి, వాస్తవ పరిస్థితులకు అనుగుణముగా మలచి రచించిన తీరు చాలా బాగుంది. కథ చివర రావణరావు భార్య శూర్పణఖతో అన్నమాటలు అన్ని కాలాలకు అనువర్తించే అక్షర సత్యాలు. అవి "అంతే నమ్మా మన ఆడజీవితాలు." కొత్త శీర్షిక "అద్భుత వక్తులు"లో చాలా ఆసక్తి కరమైన విశేషాలను తెలియ చేస్తున్నారు.

స్వరాజ్యలక్ష్మి, ఆనందగజపతిరావు, తెట్టంగి.

* * *

11–5–84 ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ప్రచురించిన "శూర్పణఖ శోకం" చదివితిని. దానిని వ్రాసిన "కవనశర్మ"గారి ఉద్దేశ్యము ఏమయినప్పటికి, యావత్ భారతదేశములోగల 80 శాతం హిందువులను, వారు గౌరవించే రామాయణమును కించపరచునట్లు ఉన్నది. స్వల్పజ్ఞానముతో వ్రాయువారు పంపినప్పటికి, పదిమందికి కావలసినవారు అట్టి ప్రచురణలు స్వీకరించకుండుట శ్రేయోదాయకము.

నే॥ రాధాకృష్ణమూర్తి, గుంటూరు.

## ఓ పెళ్లి కథ

'ఓ పెళ్లికథ' చదివిన ఒకావిడకి బ్లడ్ ప్రెషరు వున్నట్టు కొత్తగా కనగొనబడింది మరొకతనికి రక్తపుపోటు ఎక్కువైనట్టు డాక్టరు అన్నారు ఆ కథని డాక్టరుగారు చదివారుకూడ. ఆ కథ చాలమందిని ఉత్తేజ పరిచింది. వేలాదిమంది కన్యాదాతల చేదు అనుభవం కళ్లకు కట్టేటట్టు మలచారు రచయిత్రి, ఆమెకు అభినందనలు. ఇలాటివి చదివేనా యువత, పెళ్లి తంతు పెద్దల ప్రేమేయం లేకుండా, తమ చేతులమీదుగా జరిపించడం అంతా మేలు.

జి. వి. ఎల్. ఎన్. స్వామి, బరంపురం.

## వ్యా సా లు

1952 అక్టోబరు 8 సంచిక నుంచి ప్రచురించిన 'బాపిరాజు స్మృతి' చదివి అడవి బాపిరాజుగారి జీవిత సంగ్రహాన్ని తెలిసికొనగలిగేము. కథకుడుగా, గాయకుడుగా, నవలా కారుడుగా, చిత్రకారుడుగా ఆంధ్రదేశాన్ని ఉర్రూతలూగించిన మహా మనీషి బాపిరాజుగారు. 'నారాయణరావు' నవల; చిత్రాలలోని 'శశికళ' ఎన్నటికీ మరపురానివి, మరువలేనివీను. "ఏ లోకాలకో ఎగసిన ఎక్కిరాల పవిత్రాత్మకు శ్రద్ధాంజలి" ఘటించిన మండపాక నాగమణిగారు పాఠకుల చేత కూడ ప్రణమిల్లచేయించేరు.

స్వరాజ్యలక్ష్మి, ఆనందగజపతిరావు, ఇతరులు, తెట్టంగి.

[66వ పేజీ చూడండి]

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :

**దేశోద్ధారక కాశీనాథుని**

**నాగేశ్వరరావు పంతులుగారు**

స్థాపితం : 1908

***శివలెంక శంభుప్రసాద్***

**సంపాదకుడు :**

[1938–1972]

శుక్రవారం : 22–6–'84

శ్రీ రక్తాక్షినామ సం. జ్యేష్ఠ బ. నవమి

**సంపుటము 76 : సంచిక 41**

**సంపాదకుడు :**

***శివలెంక రాధాకృష్ణ***

విడి ప్రతి వెల రు. 1-80

ఆరు మాసాల చందా రు. 46-80

పోస్టులో ఏడాదిచందా రు. 101-40

**ఆంధ్రపత్రిక కార్యాలయము,**

గాంధీనగరం, విజయవాడ-520 003.


## విషయానుక్రమణిక

**ముఖచిత్రం :**

జయలలిత

(ఫోటో: కె. ఆర్. వి. భక్త)

***కథలు :***



***సీరియల్ నవలలు :***



***వ్యాసాలు, శీర్షికలు :***





# వ్యక్తిగతం



ప్రొఫెసర్ జూలియస్ హక్కెతాల్ ఒక పశ్చిమ జర్మనీ ఆసుపత్రిలో వైద్యుడు ఒక 69 సంవత్సరాల కాన్సరు రోగి బాధ భరించలేక విషం ఇవ్వమని అడిగితే ఆమె బంధువుల అనుమతితో పొటాషియం సయనయిడ్ ఇచ్చారు. ''జాలిపడి చంపటం'' నేరం కారాదని కొందరు అంటున్నారు. ఇలాగ చంపటం ఏదేశంలోనూ చట్ట సమ్మతం కాలేదని తెలుస్తోంది ...



ప్రాణవాయువు సహాయం లేకుండా ఎవరెస్టు శిఖరాన్ని అధిరోహించిన మొట్టమొదటి భారతీయుడు ఫూదోర్జీ. ఈయన గాంగ్‌టక్(సిక్కిం) లోని పర్వతారోహణ సంస్థలో శిక్షకుడిగా పనిచేస్తున్నారు. ప్రాణవాయువు లేకుండా అంత ఎత్తు(8848 మీటర్లు)ఒంటరిగా ఎక్కడం నిజంగా గొప్ప సాహస కృత్యం...



కుమారి బాచేంద్రి పాల్ ఎవరెస్టు శిఖరాన్ని జయించిన మొట్టమొదటి భారత మహిళ. ఉత్తర కాశీలో ఆర్థిక శాస్త్ర ఉపన్యాసకు రాలిగా పనిచేస్తున్న ఈమె వయస్సు 28 సంవత్సరాలు. ఇంత వరకు ఎవరెస్టు శిఖరారోహణ చేసిన మహిళలు అయిదుగురిలో ఈమె చిన్నది. హిమాలయ శిఖరారోహణలో గతానుభవం ఉన్న ఈమె ఒకసారి పెద్ద హిమపాత ప్రమాదం నించి తప్పించుకుని ఆశ్చర్యకరంగా ప్రాణాలతో బయటపడిన సాహసవంతురాలు ...




22-6-1984 శుక్రవారం మొదలు 28-6-1984 గురువారం వరకు

♈ మేషం: నూతనాంశాలు గ్రహిస్తారు. అవసరాలకు ధనం అందటం గమనించగలుగుతారు. మీ ఆదాయమందు అభివృద్ధి కనిపిస్తుంది. నూతనమిత్రుల కలయిక ఏర్పడుతుంది. స్త్రీలకు: రావలసిన ధనం అందటం, అవసరాలు తీరటం గమనించదగిన అంశం.

♉ వృషభం: ఉద్యోగ వృత్తులందు సదవకాశాలు లభించ గలవు. ప్రజా రంగంలో పేరు ప్రతిష్ఠలు ఆర్జింప గలరు. పదిమందిలో పేరు తెచ్చి కొంటారు. గృహం కొనే యత్నం కొనసాగుతుంది. రాజ్యాంగ రీత్యా రావలసిన డబ్బు ఉంటే అందే అవకాశ మున్నది. స్త్రీలకు: ధనలబ్ధి, నూతనంగా నగలు కొనుగోలు చేయ గలరు.

♊ మిధునం: వ్యవహార రీత్యా యిది ఉత్తమ ఫలదాయకమైన వారం. నూతనాంశాలు గ్రహింపునకు రాగలవు. గ్రామంలో పెద్దరికం ఏర్పడుతుంది. పెద్దల పరిచయం చెప్పదగిన అంశం. స్త్రీలకు. వస్తు సేకరణకు రాక నిలచిన ధనం చేతి కందటం గ్రహింపదగిన అంశం, శ్రమించండి.

♋ కర్కాటకం. బంధు విరోధం తెచ్చి కో గలరు. జాగ్రత్త అవసరం. విరోధి వర్గాన్ని ఒక కంట కని పెట్టి ఉండాలి. విద్యార్జనకు అవకాశం ఏర్పడుతుంది. నాలుగు విధాల శక్తి వంచన లేక పాటు పడటం అవసరం. దీర్ఘ రోగులు జాగ్రత్త పడటం ఎంతైనా అవసరం. స్త్రీలకు: నాలుగు మార్గాల సదవకాశాలు లభిస్తాయి.

♌ సింహం: పదిమందిలో మాట చెలామణి కాగలదు. రాజకీయంగా మీకు ధన లబ్ధికి అవకాశం గల వారం. వ్యవహారం ఏదయినా ఉంటే స్నేహ పూర్వకంగా పరిష్కరింప బడ గలదు. పరిచితుల మూలాన మేలు సంభవం. దూర బంధువులు యింటికి రానున్నారు. స్త్రీలకు: సర్వత్రా అనుకూలమే

♍ కన్య: రాజకియంగా అనుకూలత గలదు. శ్రమించటం అవసరం గదా! చాల కాలంగా వసూలు కాని ద్రవ్యం అందటం విశేషం గదా! అవసరాలు తీర్చి కొనుటకు సర్వానుకూలత గల వారం. బంధు విరోధం రాకుండా చూచుకోండి. స్త్రీలకు: శుభ కార్యం నిమిత్తం ఘర్షణకు అవకాశం, ఆదాయమందు విలంబన, అధిక ఖర్చులు తగిలే వారం, గమనించాలి.

♎ తుల: మిత్రులతో ఘర్షణకు అవకాశ మున్నది. ప్రయాణ సమయంలో విలువ గల వస్తువులు గాని, ముఖ్యమైన కాగితాలు గాని పోగొట్టుకొన గలరు అందు చేత ఎంతో జాగ్రత్త అవసరం గదా! స్త్రీలకు. ఉద్యోగ రీత్యా మేలున్నది, ఆదా మున్నది.

♏ వృశ్చికం: అవకాశ వాదులు, స్తోత్ర ప్రియులు దాపునకు రానున్నారు, వారి చర్యలను సాగరానీయకండి సభా మర్యాదకు, సత్కారం లభించుటకు కొందరకు అవకాశ మున్నది. ఆరోగ్య రీత్యా జాగ్రత్త పడ వలసిన అవసర మెంతైనా ఉన్నది. స్త్రీలకు: బంధు కలయిక వ్యవహారానుకూలత గల వారం.

♐ ధనుస్సు. పుణ్య కార్యాచరణకు అవకాశ మున్నది. విరోధి వర్గాన్ని ఒకకంట కని పెట్ట వలసిన అవసరం ఎంతైనా ఉన్నది. ఏవో విలువ గల వస్తువుల కొనుగోలు చేయగలుగుతారు. చాల మందికి ఆరోగ్య రీత్యా జాగ్రత్త పడ వలసిన సమయం. స్త్రీలకు: వస్తు సేకరణ, శుభ కార్య తత్పరతకు అవకాశం, మిత్ర సమాగమం.

♑ మకరం: వ్యవహార రీత్యా సత్ఫలితం అందుకో గలుగుతారు. మిత్ర సహాయం లభిస్తుంది. పెద్దల పరిచయం ఏర్పడ గల వారం. ఆశించిన డబ్బు చేతికి అంది అవసరాలు తీరుతాయి. ప్రజా సమూహంలో పేరు ప్రతిష్ఠలు లభించగలవు. స్త్రీలకు: బంధు విరోధం, ఉద్యోగ వృత్తులందు యిబ్బంది రావచ్చు.

♒ కుంభం: అన్ని రంగాలలో అభివృద్ధి కనిపిస్తుంది. రాజకియంగా అధిక లాభం పొంద నున్నారు. నటనా విధానం రాణింపునకు రా గలదు. చలనచిత్ర రంగానుభవం గల వారికి సదవకాశాలు లభ్యం కాగలవు. స్త్రీలకు: అధిక శ్రమ, వృత్తియందు పెంపు, కించిత్తు ఆదాయం సంభవం.

♓ మీనం. విశేషాదరణకు అవకాశ విరోధి వర్గం లొంగియుండటం, విస్తారంగా వ్యాపారం సాగి రావటం, విశేషాదాయం, వింత వస్తు సేకరణ మున్నగు అంశాలలో అనుకూలత చేకూరుతుంది స్త్రీలకు ధనాదాయం, కొందరకు నూతనోద్యోగ ప్రాప్తి, శుభ కార్యానుకూలత, సుఖ సంతోషాలకు అవకాశం గల వారం, గ్రహించాలి.

— విద్వాన్ కోట సత్యరంగయ్య శాస్త్రి

# సంపూర్ణ పోషకాహారంలో
# అన్ని పోషక పదార్థాలు
# సరియైన పాళ్లలో వుండాలి...



ప్రొటీనులు
పెరుగుదలకి ముఖ్యం
పిండి పదార్థాలు మరియు క్రొవ్వు పదార్థాలు
శక్తికి
విటమిన్ ఎ
కళ్ళలో కాంతులకి
విటమిన్లు బి గ్రూప్
అన్ని ఇతర పోషక పదార్థాలని జీర్ణించుకోడానికి
విటమిన్ సి
రోగ నిరోధక శక్తి పెంపొందించడానికి
విటమిన్ డి
కాల్షియం మరియు ఫాస్ఫరస్‌లని గ్రహించేటట్లు చేయడానికి
ఐరన్
ఆరోగ్యవంతమైన రక్తానికి
కాల్షియమ్ మరియు ఫాస్ఫరస్
దృఢమైన ఎముకలు మరియు పండ్ల కోసం

# సిరిలాక్ సంపూర్ణ పోషకాహారాన్ని రుచికరమైన విధంగా అందజేస్తుంది

సిరిలాక్‌లో అయిదు రకాల పోషకాలు అన్నీ వున్నాయి—ప్రొటీన్లు, క్రొవ్వు పదార్థాలు, పిండి పదార్థాలు, ఖనిజాలు మరియు విటమిన్లు. మీ పాపకి ప్రతి పర్యాయమూ సిరిలాక్‌తో తయారు చేసిన ఆహారం మీరు యిచ్చినప్పుడు ఈ పోషకాలన్నీ సరియైన పాళ్ళలో చేరి వుంటాయి.




కలసికట్టుగా పని చేయడం వలన ఈ పోషకాలన్నీ హెచ్చు తగ్గులు లేకుండా ముఖ్యమైనవే. అందుకే అన్ని పోషకాలు 'సంపూర్ణం'గా వున్న సిరియల్ ఆహారం మీ పాప ఆరోగ్యానికి అత్యవసరం. ప్రతి సిరిలాక్ ఆహారం మీ పాపకి ఒక రోజుకి కావలసిన పోషక పదార్థాలలో నాల్గవ వంతుని అందచేస్తుంది ఈ ఆహారం యిస్తున్నప్పుడు పోషక పదార్థాల కోసం మరొకటి మీరు యివ్వవలసిన అవసరం లేదు.

మీ పాపకి చనుపాలే తగినవి. అయితే పాపకి నాలుగు నెలలు వచ్చి ఘన పదార్థాలు తీసుకోడానికి సిద్ధంగా వున్నప్పుడు, మీ డాక్టర్‌ని సంప్రదించి సిరిలాక్ యివ్వడం ప్రారంభించండి.

# సిరిలాక్®
పాలు వుండనే వున్నాయి



సిరిలాక్ తయారు చేయడం ఎంతో సులభం దీనిని ముందుగా మరగ బెట్టిన, గోరు వెచ్చటి నీటికి చేర్చండి కలపండి వడ్డించండి

**ఉచితం!** సిరిలాక్ పిల్లల పెరుగుదల చార్ట్

ఇందులో బరువు చార్టు, రోగనిరోధక మందుల రికార్డు, గట్టిగా ఉండే ఆహారం అలవాటు చేసేందుకు సూచనలు, యింకా ఎన్నో విషయాలు ఉంటాయి
మీ కాపీ కోసం ఈ చిరునామాకు వ్రాయండి
సిరిలాక్
పోస్ట్ బాక్స్ నం 3 న్యూ ఢిల్లీ-110 008

SAA/FSL/C/3151 TEL

NESTLÉ.

"ఆ చక్కని అమ్మాయి ధనవంతురాలే కాదు, చాలా విశాల హృదయం కలది కూడా. హీరో గ్రాడ్యుయేట్. పరిస్థితుల ప్రాబల్యంవల్ల హోటల్ సర్వర్‌గా చేస్తున్నాడు ఐనా అతని సంస్కారానికీ సభ్యతకీ చక్కని మాటలకీ ఆమె ముగ్ధురాలై, తొలి పరిచయంలోనే అతన్ని ప్రేమించింది. తల్లి తండ్రులనీ, సంఘాన్ని ఎదిరించి ఆదర్శ వివాహం చేసుకున్నారు వాళ్లిద్దరూ. హాయిగా—ప్రేమగా జీవించారు.'' అప్పుడే చూసి వొచ్చిన సినిమా కథ చెప్పాదు శ్రీకాంత్.

''ఐతే—కొంతవరకూ నీ కధే అన్నమాట. నువ్వూ హీరోలాగే ఉంటావు. గ్రాడ్యుయేటు వయినా విధిలేక సర్వర్‌గా చేస్తున్నావు. నీ అదృష్టం బాగుంటే—నీకూ అలాటి అవకాశం వొచ్చి—అందమయిన ధనవంతురాలు ప్రేమించి... పెళ్లి చేసుకోవచ్చు. నువ్వు అందంగా ఉంటావు. చక్కగా మాట్లాడగలవు. సభ్యతా సంస్కారాలు తెలుసు. స్పెషల్ రూమ్‌లో డ్యూటీ కనుక అలాటి అవకాశాలు ఎక్కువే కూడా. ఏ చక్కని అమ్మాయో నిన్ను ప్రేమించి పెళ్లి చేసుకున్నా



నేనేమి ఆశ్చర్యపోను. నీకా అర్హతలున్నాయి...'' ప్రోత్సాహం యిస్తున్నట్లన్నాడు హరి.

బెల్ మ్రోగింది.

''జయం !... వెళ్లు... ఎవరో వచ్చినట్లుంది.'' నవ్వాడు హరి

శ్రీకాంత్ అద్దం ముందుకు వెళ్లి — ముఖం చూసుకుని — క్రాఫ్ సవరించుకుని — స్పెషల్ రూమ్‌వేపు నడిచాడు.

తలుపు తోసి — గదిలోకి ప్రవేశించేసరికి... ఓ అందమయిన అమ్మాయి.. నిశ్చయంగా ఆమె తను ఉదయం చూసిన 'ప్రేమ పతులు' సినిమా




లోని హీరోయిన్‌లాగే ఉంది. ఆమె ప్రక్కన — సోఫాలో... చిన్నపాప.

''యస్ మేడమ్... మీకేం కావాలి ?'' కంఠంలో అభిమానమూ, ఆప్యాయతా, ఆదరమూ నింపి అడిగాడు.

ఆమె — అతని ముఖంమీంచి చూపు మరల్చుకోలేనట్లు ఒకటి రెండు క్షణా లలాగే ఉండిపోయి —

''చూడండి... మీ పేరు ?'' అడిగింది కొంచెం సిగ్గుపడుతున్నట్లు.

''శ్రీకాంత్'' అన్నాడతను ఆశ్చర్యాన్నణచుకుంటూ.

''నా పేరు మధురిమ...ఈమె నా చెల్లెలు ఉష. మేము సినిమానుంచి వొస్తున్నాం. చాలా అలసిపోయి... చిరాకుగా ఉంది. దయచేసి — మాకు — మంచి... చల్లని పానీయం యివ్వగలరా? శ్రీకాంత్ ! మిమ్మల్ని కలుసుకోడం చాలా ఆనందంగా ఉంది...'' అంటూ నమస్కరించిందామె.

అతనికి ఒక్కసారి మతిపోయినట్లయింది. అంతలోనే తేరుకుని — ''నమస్కారం మధురిమ గారూ, మీ పరిచయ భాగ్యం లభించడం నా అదృష్టం.'' అన్నాడు చేతులు జోడించి.

''ప్లీజ్. నన్ను... మధురిమ అంటే చాలు. గారూ అవీ వొద్దు...'' నవ్విందామె — పేరుకి తగ్గట్లు మధురంగా.

''అలాగే... మరి... మీకేం తెమ్మంటారు? కోక్ లేదు కానీ... బాదంఖీర్ ... గ్రేప్స్... ఆరంజ్...''

''మీ యిష్టం .'' అనేసిందామె — అతని యిష్టమే తన యిష్టమన్నట్లు. అది— అతనికి చాలా సంతోషం కలిగించింది. ఆమె ముందు మంచి కదలడం అతనికెంత మాత్రమూ యిష్టం లేదు. ఆమెను చూస్తూ అలాగ యుగ యుగా లుండిపోవాలనుంది. ఇంకా యింకా చూడాలని ఉంది. కాని... క్రూర విధి... సర్వర్ డ్యూటీ.

అతను మెల్లగా అడుగులు వేయసాగాడు.

''అక్కా ! అతను — మనం చూసిన సినిమాలో హీరోలా లేడూ ?''

''అచ్చంగా అలాగే ఉన్నారు శ్రీకాంత్. కాని... చూడు... ఆయన గురించి గౌరవంగా మాట్లాడ్డం నేర్చుకో. ఏకవచన ప్రయోగం మంచిదికాదు.'' మందలించింది మధురిమ — చెల్లెల్ని.

ఆమె మాటలు కతని హృదయం పొంగిపోయింది. మధురిమ తనని హోటల్ సర్వరుగాగాక ఎంతో గౌరవంగా... స్నేహంగా చూస్తోంది!.. నిజానికి — ప్రేమగా. ఔను. తనని అండీ, గారూ అనవొద్దంది. మధురిమ అనే అనమంది. డ్రింక్ ఛాయస్ తనకే వొదిలేసింది. పరిచయం చేసుకుంది... వీటన్నిటికీ అర్థమేమిటి ?

ఆమెకోసం అతను ప్రత్యేకమయిన చల్లని రుచికరమయిన పానీయాన్ని తయారు చేయించాడు దగ్గరుండి. అందమైన — పరిశుభ్రమయిన గ్లాసుల్లో పోయించాడు. చక్కని ట్రేలో ఆ గ్లాసులమర్చి — అద్దంలో జుత్తు సవరించుకుని — ప్రేమ పక్షులు హీరో ననుకరిస్తూ — స్పెషల్ రూమ్‌లోకి నడుస్తూ — ఆ సినిమా సంభాషణలను జ్ఞాపకం తెచ్చుకోసాగాడు.

''ఈ డ్రింక్ మీ అలసటను పోగొట్టి ఆహ్లాదం కలిగించాలని ప్రత్యేకంగా — నేనే తయారుచేసి తెచ్చాను మధురిమా—జీ'' అన్నాడు గ్లాసులను సున్నితంగా టేబులు మీద పెడుతూ.

''మీ అభిమానానికి చాలా సంతోషమూ, కృతజ్ఞతలూ శ్రీకాంత్ ! మీ రుణం ఎలా తీర్చుకోగలను ? '' కొంచెం సిప్‌చేసి — ''ఎంత బాగుందో మాటలలో చెప్పలేను. నా జీవితంలో యింతవరకూ యింత మధురమయిన పానీయం రుచి చూడలేదంటే నమ్మండి. ఇదంతా మీకు నామీద ఏర్పడిన అభిమానం కాక మరేమిటి ? '' అంది మధురిమ.

ఆ మాటలకు శ్రీకాంత్ ఊహాలోకాల్లోకి వెళ్లిపోయాడు. ఈ రెండేళ్ల సర్వరు బ్రతుకులోనూ — తననిలా గౌరవించిన వాళ్లు కానీ, తియ్యగా మాట్లాడినవారు కానీ ఏ కష్టమరూ లేరు.

ఈమె — మధురిమ .. కస్టమర్ కాదు. ప్రత్యేకమయిన అమ్మాయి. తన అందాల అతిథి. అనురాగదేవత. అంతే.

''నేను— నా హృదయాన్ని మనసుని నింపి తయారుచేశాను...''

''అందుకా యిదంత మధురంగా ఉంది ! థాంక్యూ శ్రీకాంత్..మెనీమెనీ థాంక్స్. ఔనూ... మీరూ మాతోకలసి శీతల పానీయం తీసుకోరాదూ ? అలా ఐతే చాలా బాగుంటుంది ''

''మీ ఆహ్వానానికీ అభిమానానికీ చాలా కృతజ్ఞతలు మధురిమా ! కాని...నేను...హోటలు నియమాలకు బందీని, బానిసని...'' అన్నాడామె యిచ్చిన మహదవకాశాన్నందుకోలేని తన నిస్సహాయతకు చాలా చింతిస్తూ.

ఆమె ఒక దీర్ఘమయిన నిట్టూర్పు విడిచి —మళ్లీ పానీయం సిప్‌చేసి— ''శ్రీకాంత్ ! నేనొక మాట — మనసులో దాచుకోలేక — బయటకు చెబితే - మీకు కోపం రాదుకద ? '' అడిగింది మెల్లగా.

''మీ మాటలకు నాకు కోపం రావడమా! బలేవారే ... చెప్పండి...తప్పకుండా చెప్పండి. మీరేం చెప్పినా నాకు చాలా సంతోషమే.'' అన్నాడతను ఆత్రతతో గుండె ఆగిపోయేలా ఔతూంటే. ఆ క్షణంలోనే అతనికి—ప్రేమ పక్షులు సినిమాలో నాయికా నాయకుల మధ్య ప్రేమ యిలాగే ప్రారంభం ఔతుందని జ్ఞాపకంవొచ్చి—గుండె మరింత వేగం పెంచుకుంది.

''మీరు — నా అభిమాన హీరోలాగే ఉంటారు...ప్రేమపక్షులు చూసి వొస్తున్నాం. . అందులో...అచ్చంగా...''

శ్రీకాంత్ చిరునవ్వు నవ్వి...''అతి చక్కని అభినందన యిది. ఇది చెప్పడంలో మీకు నాపట్ల ఏర్పడిన అభిమానమే ప్రతి ఫలిస్తుంది మధురిమా! ... మరి—నేనూ—ఒక మాట ... హృదయంలో మాట . చెప్పేందుకనుమతిస్తారా, ప్లీజ్?'' అన్నాడు ఆమె వంక ఆశగా చూస్తూ.

''మనం — చాలా సన్నిహితులం కాలేదూ యిప్పటికే? చెప్పండి శ్రీకాంత్. .మీ మనసు విప్పి చెప్పండి. నా దగ్గర సంకోచం అవసరం లేదు మీకు.'' అభయమిస్తున్నట్లే అంది.

''ప్రేమ పక్షులు—నేనూ చూశాను. ఆ హీరోయిన్ అభిమానిని నేను. కాని...యిప్పుడు... హృదయ పూర్వకంగా నిజం చెప్పెయ్యాలంటే. . మధురిమా! ...మీరు ఆమెకంటె కూడా చాలా అందమయినవారు. ఇప్పుడు . యిక...నేను...మీ అభిమానినైపోయాను. మీకు—నేనిలా అనేశానని— కోపం రాలేదు కద—'' భయపడుతున్నట్లు చూశాడతను. ఆమెకి కోపం వస్తే—మానేజ్‌మెంట్‌కి ఫిర్యాదు చేస్తుంది. వాళ్లు నిజానిజాలు ఆలోచించకుండా — కష్టమరీజ్ ఆల్వేస్ రైట్ అన్న సిద్ధాంతాన్ని అక్షరాలాఅమలు జరుపుతూ— నిజానికి తప్పు ఆమెదయినా — తన ఉద్యోగం పీకేస్తారు. అప్పుడు తన బ్రతుకు ?

ఉహూ. . అలా జరగదు. మధురిమ అటువంటిదికాదు.

"కోపమా!.. మీరు తమాషాగా మాట్లాడు తారు శ్రీ! మీరు నాకెంత మంచి కాంప్లిమెంట్ యిచ్చారని! నాకెంత ఆనందంగా ఉందో తెలుసా? నిజంగా యీ రోజు... జీవితంలో మరచిపోలేను. మీ పరిచయం... ఓహ్!... స్ప్లెండిడ్! మీరు హోటల్ సర్వరుగాఉండదగినవారెంత మాత్రమూ కారు. మీ మాటలు – ఎంత బాగుంటాయని!"

"థాంక్యూ మధురిమా... థాంక్యూ..."

అతను నిలబడే కలలు కనేస్తున్నాడు.

"శ్రీ!... దయచేసి – బిల్లిస్తారా?" అడిగిందామె. అంతవరకూ విసుగ్గా కూర్చున్న ఆమె చెల్లి ఉషలోకి ఒక్కసారుత్సాహంవచ్చింది.

శ్రీకాంత్‌లోకి అద్భుతమయిన ఆలోచన వొచ్చింది – యీ పరిచయాన్ని – ప్రేమగా – పెళ్లిగా – సాగదీసేందుకు.

"మధురిమా! నాదో చిన్న అభ్యర్థన... మీరు మరోలా భావించనంటే.. నా అతిథులుగా" ప్రార్థిస్తున్నట్లే అన్నాడు.

"ప్లీజ్... అలాగ వొద్దు. కనీసం యీ సారికి... మరెప్పుడయినా..." అంది మొహమాట పడుతున్నట్లూ, మరోసారి అంగీకరిస్తానని వాగ్దానం చేస్తున్నట్లూ. ఆ మాత్రానికే అతను చాలా సంతోషించాడు. మరెప్పుడయినా అన్న మధురిమ మాట అతనిలో తక్కువ ఊహలను రేపలేదు.

లోపలకు వెళ్లి బిల్లు తెచ్చాడు ప్లేటుతో. ఆమె ఓ పది రూపాయల నోటుని విలాసంగా వేసింది బిల్లుమీద.

"వొస్తాను. మళ్లీ కలుద్దాం..." అని ఒక అందమయిన చిరునవ్వు చిందించి – చకచక వెళ్లి కారులో కూర్చుంది.

ఆరు రూపాయల బిల్లుకి నాలుగు రూపాయల టిప్! అంత ఉదారమయిన టిప్‌కి సంతోషించాలో... ఆమె తనకు టిప్ యివ్వడం అవమానంగా భావించి విచారించాలో తేల్చుకోలేక తెల్లమొహంవేసి ఉండిపోయాడు శ్రీకాంత్ కొంతసేపు. అప్పుడతని దృష్టిలో —

ఆమె కూర్చుని వెళ్లిన సోఫాలో మూలగా పడున్న ఆ వస్తువుమీద పడింది. అతను ఆత్రంగా దాన్నందుకున్నాడు. అది – విజిటింగ్ కార్డ్. ఆమెదే. ఐతే – దానిమీద తేదీ – టైమూ నోట్ చేసి ఉన్నాయి – బాల్‌పాయింట్ పెన్‌తో. శ్రీకాంత్ దాన్ని హృదయానికి హత్తుకుని... ముద్దు పెట్టుకుని – త్వరత్వరగా రిటైరింగ్ రూమ్‌వేపు నడవసాగాడు ఆనందంగా. మిత్రుడు హరికి – జరిగినదంతా చెప్పి– ఆ విజిటింగ్ కార్డు చూపేవరకూ అతనికి తోచలేదు.

"కథ అర్థమైపోయింది... శ్రీకాంత్!. నేను చెప్పినట్లే జరుగుతూందన్నమాట! గుడ్‌లక్..." అన్నాడు హరి.

"ఏమిటి?"

# ప్రేమ పక్షులు

"ఆమె – మధురిమ – నిన్ను ప్రేమిస్తోంది."

"ఊఁ." అన్నాడు శ్రీకాంత్ సిగ్గు నటిస్తూ – ఆ విషయం తను గ్రహించినదే అన్నట్లు.

"ప్రేమలేఖకూడా వ్రాసింది – నిన్ను ఆహ్వానిస్తూ ..."

"ప్రేమలేఖా! ఏదీ?" ఆరాటంగా చూశాడు.

"ఇదే ... యీ విజిటింగ్ కార్డే ... గ్రహించాలేకాని దీనిలో ఎన్ని సందేశాలున్నాయని! దీనిమీద వేసిన తేదీ యీ నాటిది ... సమయం— సాయంత్రం ఆరుగంటలు ... అంటే – ఇవాళ సాయంత్రం – ఆరుగంటలకి – విజిటింగ్ కార్డ్‌లోని అడ్రస్‌కి వొచ్చి కలుసుకోమని."

"ఆ విషయం— ముఖతః చెప్పవొచ్చుగా?"

"అలా చెప్పేస్తే ప్రేమలో తమాషా ఏముంటుంది? శ్రీకాంత్ ... ఈ ఆహ్వానాన్నందుకో. నాలుగుకి డ్యూటీ దిగి పోతావుగా... ఆమె వద్దకు వెళ్లి...మాట్లాడి... శుభవార్త తీసుకురా. మధురిమను వివాహం చేసుకుని గొప్పవాడివైపోయాక మాలాటి సామాన్యులు నీకు గుర్తుంటారో ఉండరో?"

నవ్వేసి— తలవంచుకున్నాడు శ్రీకాంత్. తరువాత అతనికి సమయం చాలా మెల్లగా గడుస్తున్నట్లనిపించింది. నాలుగుకాగానే డ్యూటీ దిగి – తయారవడం ప్రారంభించాడు. అతని ధ్యేయం – మధురిమ అభిమాన నటుడు ప్రేమ పక్షులు హీరో...తన పోలికలు కలవాడూ ఐన ఆ హీరోలా తయారుకావాలని. అచ్చంగా ఆ హీరోలా తయారు కాగలిగానన్న తృప్తి లభించాక – ఐదున్నర ఔతూంటే ఆటోలో బయలుదేరాడు మధురిమ యింటికి.

ఆ యింటిని చూస్తూనే అతను—మధురిమ తను ఊహించిన దానికంటె ఎక్కువ ధనవంతు రాలని అర్థం చేసుకున్నాడు అది అతనికి ఆనందాన్నే కలిగించింది. దర్వాన్‌కి విజిటింగ్ కార్డందించి దర్జాగా ... ఠీమాగా డ్రాయింగ్ రూమ్‌లో కూర్చున్నాడు. నిజానికది అతనను కున్నట్లు డ్రాయింగ్ రూమ్‌కానేకాదు. విజిటర్స్ రూమ్ మాత్రమే.

పది నిముషాలు గడిచాక వొచ్చింది మధురిమ. శ్రీకాంత్‌ని చూస్తూ– "మీరు?" ఎవరన్నట్లడిగింది.

శ్రీకాంత్‌కి హరి మాటలు గుర్తు వచ్చాయి. 'ప్రేమంటేనే తమాషా...మధురిమ చాలా చిలిపిదానిలా ఉంది. జాగ్రత్తగా వ్యవహరిస్తే గెలుపు నీదే!'

"నేను—మీ అభిమాన సినీ హీరోని." అన్నాడు నవ్వుతూ—ఆమె తనని ఆటలు పట్టిస్తున్నందుకు తనూ బదులు చెప్పాలని.

"మీ పేరు?" కొంచెం చిరాకూ, కోపమూ ఆమె కంఠంలో.

"శ్రీకాంత్ ... మధ్యాహ్నం . హోటల్లో పరిచయం..."

"ఓ!...మీరా! ఎందుకొచ్చారు?" సూటిగా అడిగేసింది.

"మీరే రమ్మన్నారు—" అన్నాడు ధీమాగా.

"నేనా!"

"ఊఁ. విజిటింగ్ కార్డు వొదిలి."

"అది మీకు దొరికిందా! ఐతే – వాలెట్ లోంచి ఏవో తీస్తున్నప్పుడు జారిపడిపోయిందన్న మాట. చూడండి...లోపల హేమంత్ ఒక్కణ్ణీ వొదిలి వచ్చాను. త్వరగా ... వెళ్లకపోతే బాగుండదు."

"హేమంత్ ఎవరు?"

"నా వుడ్ బి"

"మధురిమా! నేను మీ అబద్ధాలేవీ నమ్మను. నాకు తెలుసు, మీరు నన్ను ప్రేమిస్తున్నారు. నేనూ మిమ్మల్ని ప్రేమిస్తున్నాను." మనసులో – ధైర్యే సాహసే మధురిమా అనుకున్నాడు.

"షటప్ ... నేను నిన్ను ప్రేమించడ మేమిటి?" కోపంగా చూసింది అతనివంక.

"మరి – మధ్యాహ్నం హోటల్లో నాతో మీ చక్కని మాటలు ... ప్రియమయిన సంభాషణలు ..." కథ అడ్డం తిరుగుతూందేమో అనుకుని—జ్ఞాపకం చేశాడు.

"అదా!" ఒక్కసారి నవ్విందామె. "అది— ప్రేమ పక్షుల సినిమా ప్రభావం."

"అంటే?"

"సర్వర్ మాత్రం మనిషి కాదూ?... అతనితో తీయగా మాట్లాడితే నష్టమేముంది? అసలు—మనిషి – సాధ్యమైనంతవరకూ స్నేహ పూరితంగానే మాట్లాడాలి... అదే మంచిది."—

"మధురిమా!" నివ్వెరపోయాడు శ్రీకాంత్.

"ప్లీజ్. .వెళ్లండి. నేను త్వరగా వెళ్లక పోతే హేమంత్‌కి బాగుండదు." అని – యింక క్షణమయినా అక్కడ ఉండకుండా లోపలికి వెళ్లి పోయిందామె.

రోడ్డుమీదకు వొచ్చి – ఆ యింటి వేపు చూస్తూ నిశ్చేష్టుడై నిలబడిపోయాడు శ్రీకాంత్.

ఒక్కసారతనికి – సినిమా వేరు, జీవితం వేరు—అనిపించింది చేదుగా.



# హస్తసాముద్రిక, జ్యోతిష్య, సంఖ్యా శాస్త్రాల హీరో—కీరో

**అద్భుత వ్యక్తులు**

**బి.వి. పట్టాభిరామ్**
మెజీషియన్—హిప్నాటిస్ట్



Count-Louis Hamon

CHEIRO

**మా**నవ శరీర నిర్మాణంలో మెదడు తరువాత ఎక్కువ నరాలున్న అవయవం హస్తం మెదడు మనం ఊహించలేనంత అద్భుత కార్యాలను ఎలా నిర్వర్తించగలదో, హస్తంలో నమ్మశక్యం కానంతగా మన భూత, వర్తమాన, భవిష్యత్ కాలాల వివరాలు లిఖించబడి ఉన్నాయి అంటారు ప్రపంచ ప్రఖ్యాత హస్తసాముద్రిక శాస్త్రవేత్త కీరో చెయ్యి చూపించుకుని జాతకం చెప్పించుకుంటున్న వ్యక్తులను ఆత్మ విశ్వాసం లేనివాళ్ళుగా పరిగణింపబడుతున్న రోజులలో కీరో ఆ రంగంలో ప్రవేశించి ఆ విద్యకు ఒక గుర్తింపు తీసుకువచ్చారు

కోట్లాది ప్రజలకు కీరోగా తెలిసిన కౌంట్ లూయిస్ హేమన్ 1866 లో జన్మించారు భగవంతుడి మీద అపార విశ్వాసంగల కీరోకు చిన్నతనంనుంచి ఒక నమ్మకం ఉండేది మనం చేస్తున్న ప్రతీకర్మ మనకు మనంగా చేయటం లేదు అది మనం చేయాలని ఎప్పుడో రాసి ఉంది సమయం ఆసన్నమయినపుడు అది చేస్తున్నాము అని గాఢంగా విశ్వసించేవారు ఆ విశ్వాసమే కీరోను సుప్రసిద్ధ హస్తసాముద్రిక, జ్యోతిష్య, సంఖ్యాశాస్త్రవేత్తగా చేసింది హస్తసాముద్రికంలో ముఖ్య శాస్త్రాలయిన కీరోగ్నమీ, (చేతులు, వేళ్ళ ఆకారాలనుబట్టి మనిషి స్వభావం చెప్పే శాస్త్రం) కీరోమేన్సీ (చేతులలోని రేఖలనుబట్టి భవిష్యత్తు తెలిపే శాస్త్రం) శాస్త్రాలలో ప్రావీణ్యత సంపాదించిన కారణంగా లూయిస్ హేమన్‌ను "కీరో" అనే పేరుతో వ్యవహరించేవారు కొన్నాళ్ళకు కీరో సార్థక నామధేయుడయ్యాడు గ్రీకు భాషలో కీర్ అంటే హస్తం, కీరో అంటే హస్తం చూసేవాడు అని అర్థం

హస్తసాముద్రిక శాస్త్రంపై అప్పటికే కొన్ని గ్రంథాలున్నా ఈ శాస్త్రానికి జన్మస్థానమైన భారతదేశంలో ఇంకా కొత్త విషయాలు తెలుసుకోవచ్చుననే ఉద్దేశ్యంతో, ఎటువంటి భేషజాలు లేకుండా కీరో భారతదేశం వచ్చి లబ్ధప్రతిష్ఠులైన ప్రముఖులనెందరినో కలిసి తనకు తెలియని విషయాలనెన్నో తెలుసుకున్నాడు ముఖ్యంగా శ్రీ జోషి అనే పండితుడి వద్ద అతి భద్రంగా దాచబడిన అత్యంత పురాతనమైన హస్తసాముద్రిక గ్రంథాన్ని పూర్తిగా కంఠస్థం చేసాడు ఆ గ్రంథంలోని పేజీలు మనిషి చర్మంతో చేసినవట దాని మీద ఉపయోగించిన ఇంకులోని మహత్యమేమో తెలియదు కానీ, ఆ అక్షరాలు ఇప్పటివరకు స్పష్టంగా ఉన్నాయి

కాలేజీలో లెక్చరరుగా జీవితం ప్రారంభించి యుద్ధ సమయంలో పత్రికా రచయితగానూ రిపోర్టరుగానూ వ్యవహరించి చివరకు హస్త సాముద్రికుడిగా స్థిరపడిపోయిన కీరో దాదాపు ప్రపంచంలోని అన్ని ముఖ్యమైన నగరాలు పర్యటించి, ప్రముఖ వ్యక్తులెందరికో భవిష్యత్తు చెప్పి ప్రశంసలు అందుకున్నాడు

ఆ కాలంలో దేశాధినేతలు, చక్రవర్తులు, మహారాజులు, "కీరోను" ప్రత్యేకంగా తమ తమ దేశాలకు ఆహ్వానించి జాతకం చెప్పించుకునేవారు అంతటి మహర్దశ ఈనాటివరకు మరి ఏ ఇతర వ్యక్తికీ పట్టలేదు విక్టోరియా మహారాణి ఏరోజున మరణిస్తుందో, ఇటలీ రాజు ఏ రోజు ఏ విధంగా వధింపబడుతాడో ఏడవ ఎడ్వర్డ్ రాజు ఎప్పుడు మరణిస్తాడో అన్నీ ఖచ్చితమైన సమయాలతో "కీరో" చెప్పగలిగాడు అంతేకాక ఎవరెవరు దేశాధినేతలు కాగలరో, ఏ చక్రవర్తులు ఎప్పుడు మట్టి కరుస్తారో వంటి విషయాలనే కాకుండా, వారి ఆరోగ్య, అనారోగ్య విషయాలలో ఎప్పటికప్పుడు సలహాలిచ్చి ప్రతీవారికీ అత్యంత సన్నిహితుడయిపోయాడు •

కీరో తన ఇంటికి విచ్చేసిన ప్రతీ వ్యక్తి జాతకం చెప్పినపిమ్మట వారి అభిప్రాయాన్ని "అతిథుల పుస్తకం"లో రాయించేవాడు సుప్రసిద్ధ రచయిత మార్క్‌ట్వైన్ ఆ పుస్తకంలో ఇలా రాసాడు "మన జాతకం అరచేతిలో ఉంటుందంటే నాకు ఏమాత్రమూ నమ్మకం ఉండేదికాదు కానీ కీరోను సంప్రదించిన తరువాత ఆ అభిప్రాయాన్ని మార్చుకుంటున్నాను కీరో మహాద్భుతమైన వ్యక్తి — అంతకన్నా నేనేం చెప్పలేను" అని రాసారు అలాగే అమెరికా, ఆస్ట్రేలియా, ఇంగ్లండు, పారిస్, ఇండియా దేశాలకు చెందిన ప్రముఖులెందరో "కీరో" అతిథి పుస్తకంలో వారి అభిప్రాయాలు రాస్తూ "తమలో ఉన్న గుణగణాలను కీరో ఖచ్చితంగా చెప్పగలిగాడనీ, తమకు తప్ప మరెవరికీ తెలియని ఎన్నో రహస్యమైన సంఘటనలను కూడా కీరో చూసినట్లుగా చెప్పాడనీ, తమకు ఈ శాస్త్రంపై సంపూర్ణ విశ్వాసం కలిగిందని" వివరించారు అంతేకాక "కీరో" తాను కలిసిన ప్రముఖులందరి హస్తముద్రలను సేకరించి ఆల్బమ్ తయారు చేసారు

ప్రపంచంలో మనిషిని పోలిన మనుషులు ఏడుగురుంటారని శాస్త్రజ్ఞుల అభిప్రాయం, కానీ

# అద్భుత వ్యక్తులు

ఒక చేతిలో ఉన్నట్లుగా రేఖలు ప్రపంచంలో మరింకే చేతిలోనూ ఉండవు. ఏ రెండు చేతుల లోని రేఖలు ఒక్కలా ఉండవు అని అంటారు ''కీరో''. తనకు తెలిసిన విజ్ఞానాన్ని ఔత్సాహికులైన యువతీ యువకులకు తెలియజేసి ఈ శాస్త్రానికి ఇంకా గుర్తింపు తీసుకురావాలనే సత్సంకల్పంతో నెలకొక రోజు వారికి కేటాయించి ఉచితంగా శిక్షణ ఇచ్చేవారు. అంతేకాక హస్త సాముద్రికము, సంఖ్యా శాస్త్రము(న్యూమరాలజీ) జ్యోతిష్య శాస్త్రాలపై అద్భుతమైన గ్రంథాలు రాసి, అవి ప్రజలచేత చదివింపచేసి అవి ప్రజల దినచర్యలలో ఒక భాగం అయిపోయేలాగ చేయ డానికి అవిరామ కృషి చేసారు. ఆ కృషి ఫలించింది. ఈనాటివరకు ప్రజలకు ఆ శక్తులపై విశ్వాసం సడలలేదు. ఆ గ్రంథాలలో శాస్త్ర వివరాలే కాకుండా శాస్త్రాన్ని అభ్యసించేవారికి కొన్ని నియమాలుకూడా విధించారు. అందులో ఎనిమిది ముఖ్యమైనవి ఉన్నాయి. అందులో ముఖ్యమైనవి ''ఒక వ్యక్తియొక్క చెయ్యి చూడగానే, అతని భవిష్యత్తు పూర్తిగా తెలుసుకోవచ్చు – చివరకు ఎప్పుడు మరణిస్తాడోకూడా తెలుసుకోవచ్చు – కానీ ఎట్టి పరిస్థితిల్లోనూ ఆ వ్యక్తికి ప్రమాదాల గురించిగానీ మరణం గురించిగానీ చెప్పరాదు'' ఇలా నియమాలను పాటించి, దైవభక్తితో, న్యాయంగా శాస్త్ర అధ్యయనంచేస్తే తప్పక విజయం చేకూరుతుంది అన్నారు కీరో.

న్యూమరాలజీలో ఒక వ్యక్తియొక్క ఖచ్చితమైన జన్మదినం, మాసం, సంవత్సరం తెలిస్తే ఆ వ్యక్తి భవిష్యత్తు ప్రతీ నిమిషం ఎలా ఉంటుందో చెప్పవచ్చునని ఆయన గాఢంగా విశ్వసించేవారు. అదే ప్రకారంగా జన్మదినాన్నిబట్టి జ్యోతిష్యశాస్త్రంలోకూడా భవిష్యత్తును ఖచ్చితంగా చెప్పవచ్చుననీ, రాబోయే ప్రమాదాలను కూడా తప్పించుకోవచ్చుననీ ఆయన ఋజువు చేసి చూపారు.

హస్తసాముద్రిక, జ్యోతిష్య, సంఖ్యా శాస్త్రాలు ఈ ప్రపంచంలో ఉన్నంతకాలమూ కీరో పేరు చిరస్థాయిగా ఉంటుంది. ఒక ఫెనోమినాగా ఉండిపోయిన కీరో 1936 వ సంవత్సరం అక్టోబరు 8 వ తేదీన మరణించారు. 7 వ తేదీ రాత్రి తన భార్యతో ''నాకు ఇదే ఆఖరు రాత్రి'' అని కూడా చెప్పారు. ★

పై వారం:

తలలు తల్లులు కావని నిరూపించిన మార్క్ ట్వైన్.

ఐశ్వర్యానికి-
వైశ్యాబ్యాంక్
పథం

# మా సేవింగ్సుఖాతాలో "ఖాతాదారే మహారాజు" అందుకు నాలుగు మార్గాలు



మా సేవింగ్సు ఖాతాలో మీదే అగ్రస్థానము

మా బ్యాంక్‌లో మీరు సేవింగ్సు ఖాతా తెరుస్తే మామూలుగా లభించే ఇతర సదుపాయాలు కాక మరో నాలుగు అదనపు సౌకర్యాలు మీకు లభిస్తా యి.

- నెలకు 5,000 రూ. వరకూ 'ఉచిత జమ' సౌకర్యం
- నెలకు 5,000 రూ పరిమితి వరకూ గల పొరుగూరి చెక్కుల వసూలు
- ఖాతాదారుల పేరు మీదున్న ఆమోదం పొందిన చెక్కులకు డిస్కౌంటింగు/కొనుగోలు సౌకర్యం
- సందర్భోచితంగా తాత్కాలిక ఓవర్ డ్రాఫ్ట్ సౌకర్యం.

వివరాలకు మీ దగ్గరలోని బ్రాంచితో సంప్రదించండి.

మా ఖాతాదారులకు మేము ప్రత్యేకంగా అందించే సేవలకు ఈ సౌకర్యాలే ప్రత్యక్ష సాక్ష్యాలు మీ అవసరాలన్నిటికీ అనువైన ఇతర పథకాల విషయంలో కూడా మా సేవలు యథాతథంగా అందుతూనే వుంటై.

మా బ్యాంకుకు విచ్చేయండి — వ్యత్యాసం గమనించండి!

— కలిసి పెరుగుదాం.





## ది వైశ్యా బ్యాంక్ లిమిటెడ్

రిజిష్టర్డ్ ఆఫీసు అవెన్యూరోడ్, బెంగుళూరు-560 002
అడ్మినిస్ట్రేటివ్ ఆఫీసు.72 సెయింట్ మార్క్సరోడ్, బెంగుళూరు-560 001
ఛైర్మన్ : రమేశ్ గెల్లి

KIRON/VBL/841




(గత సంచిక తరువాయి)

అంతలో ఆమె పక్కనే టేబుల్ మీదున్న ఫోన్ మోగింది.

రిసీవర్ తీసుకుందామె.

''హలో...''

''డాక్టరుగారున్నారా ? ''

''జస్టేమినిట్...'' అంటూ ఫోన్ పక్కన పెట్టి తాను లేచి డైనింగ్‌రూమ్ వేపు నడిచిందామె.

కృష్ణ అప్పుడే స్టౌవ్ మీద నుంచి పాలు దించి గ్లాసుల్లో పోస్తున్నాడు.

''మీకు ఫోన్ వచ్చింది...'' అందామె గడప దగ్గర నిలబడి.

అతను పరుగుతో వెళ్లి ఫోన్ అందుకున్నాడు

''హలో...''

''... ''

''ఆ ! నేనే – ఇప్పుడే ఆ నర్స్ వచ్చారు. ఇద్దరం కలసి ఓ పావుగంటలో బయల్దేరి వస్తున్నాం...''

''...''

''ఏమిటి ! ఆమె బొంబే వెళ్లిపోయిందా?''

''...''

''ఊహు ! అలాగా ..''

''...''

''ఓకే–పోనీండి ! దట్సాల్‌రైట్...''

''...''

''నోనో – నాటెటాల్ ! షి ఈజ్ మై ఫ్రెండ్ – అయ్ కెన్ ఎక్స్‌ప్లెయిన్ దిస్ టు హర్...''

ఫోన్ పెట్టేశాడతను.

అతను మాట్లాడుతూంటే విషయం చాలావరకూ అర్థమయింది ఆమెకు.

''ఆ ! చూడండి– మీ పేరు మర్చిపోయాను...''

''మార్గరెట్...''

''మార్గరెట్‌గారూ– మనం వెళ్ళాలనుకున్నవాళ్ళే ఫోన్ చేశారిప్పుడు. ఆ పెషెంట్ అనుకోకుండా బొంబే వెళ్ళిందట ! అందుకని మన అవుసరం వారికి లేదన్నమాట...''

''ఫర్లేదులెండి...''

''సారీ! మీకు అనవసరంగా ట్రబులిచ్చాను''

''దట్సాల్‌రైట్–ఇందులో శ్రమేముంది''

''ఆగండి– ముందు హార్లిక్స్ తెస్తాను..''

లోనికి వెళ్ళి రెండు కప్పుల్లో హార్లిక్స్ తెచ్చి ఆమెకొకటి అందించాడతను.

ఆమె తాగుతూంటే తను స్టీరియో ఆన్ చేశాడు.

''టేక్ ది హీట్ ఆఫ్ మీ... టేక్ ది హీట్ ఆఫ్ మీ...'' పాట రిథమిక్‌గా వినబడుతోంది.

ఆమె గదంతా కలియజూసిందోసారి.

''మీకి ట్రబుల్ ఇచ్చినందుకు నాకు నేనే పనిష్మెంట్ ఇచ్చుకుంటున్నాను మార్గరెట్ ! అదేమిటో తెలుసా ?''

ఆమె నవ్వింది.

''ఏమిటి ?''

''మీకు ఈ రాత్రికి డిన్నర్ ఇస్తాను నా ఖర్చుతో.''

ఆమె సిగ్గుపడింది.

''మరేం ఫర్లేదులెండి ! ఏమీ వద్దు !''

''నో నో– అలాక్కాదు ! కాదనకండి ! లేకపోతే నాకు శాటిస్‌ఫాక్షన్‌గా ఉండదు, ఎప్పుడూ మీరే గుర్తుకొచ్చి బాధ కలుగుతూంటుంది...''

ఆమెకు ఆశ్చర్యంగా ఉంది.

అతను ఇందులో అంతగా అప్సెట్ అవ్వాల్సిన విషయమేముందో అర్థంకావడంలేదు.

''నేనేమీ అనుకోవడంలేదని చెప్తున్నాను కదా ! ఇంక ఆ విషయం వదిలేయండి !'' అంది చిరునవ్వుతో.

''మిస్ మార్గరెట్ ! నాకొక్క విషయం చెప్పండి ! నాతో డిన్నర్ తీసుకోవడం మీకేమయినా అభ్యంతరమా ?'' అడిగాడతను సూటిగా.

''ఊహ ! అదికాదు... నేను చెప్పేది...''

''ఇంకేం చెప్పకండి ! ప్లీజ్!''

ఆమె ఇంకేమీ మాట్లాడలేక ఊరుకుండిపోయింది.

ఖాళీ కప్పులు తీసుకెళ్ళి అతనే లోపల ఉంచాడు.

''పదండి ! నాక్కొంచెం మార్కెట్లో పని ఉంది. అలా వెళ్ళి డిన్నర్ తీసుకున్నాక మిమ్మల్ని డ్రాప్‌చేసి వెళ్ళిపోతాను...''

ఆమె లేచి నిలబడింది.

అతను స్టీరియో మ్యూజిక్ స్విచ్చాఫ్‌చేసి ఆమెతోపాటు బయటకు నడిచి తలుపు తాళం వేసి 'కీ' జేబులో పెట్టుకున్నాడు.

''రండి...'' అంటూ కారు ఫ్రంట్‌డోర్ తెరచాడు.

ఆమె కూర్చోగానే డోర్ మూసివేసి తను డ్రైవింగ్ సీట్లో కూర్చున్నాడు.

కారు వేగంగా మెయిన్‌రోడ్‌మీద కొచ్చేసింది.

సాయంత్రం సమయమవడంవల్ల రోడ్డు బాగా రద్దీగా ఉంది. అయినాగాని వేగం తగ్గించకుండా ఓవర్‌టేక్ చేస్తూ నడవుతున్నాడతను. మార్కెట్ స్ట్రీట్‌లోకి తిరిగాక ఓ కాసెట్ షాప్ ముందు కారాపాడు.

''ఒక్క నిమషం కూర్చోండి. లేటెస్టు ఏమయినా కాసెట్స్ వచ్చాయేమో చూసివస్తాను'' అంటూ షాపులోకెళ్ళాడు.

ఓ పావుగంట తర్వాత ఓ అరడజను కాసెట్స్ తీసుకుని వచ్చాడు మళ్ళీ.

''నాకు మ్యూజిక్ అంటే భలే పిచ్చిలెండి! అన్నిరకాల మ్యూజిక్కూ లైక్ చేస్తాను...'' నవ్వుతూ అన్నాడతను.

ఆమె చిన్నగా నవ్వింది.

కారు మళ్ళీ స్టార్ట్ చేశాడతను.

ఇరుకు సందుల్లోనుంచి తిరిగి బీచ్‌రోడ్ మీదకు చేరుకున్నారు కొద్ది సేపటికి.

చల్లనిగాలి విసురుగా జొరబడుతోంది కార్లోకి.

వెన్నెలలో సముద్రపు కెరటాలు మెరుస్తూ విరుచుకు పడుతున్నాయ్.

వెన్నెలకాంతి ముందు ఎలక్ట్రిక్ దీపాలు వెలవెలబోతున్నాయ్.

కారు చాలా స్లోగా నడపసాగాడతను.

''మీ ఇల్లెక్కడండీ మార్గరెట్‌గారూ?''

''లలిత్‌నగర్ కాలనీ--''

''ఐసీ–కొంచెం దూరమే ఊరికి...''

''మీరెప్పుడేనా వచ్చారా అటు?'' అడిగిందామె.

**జరిగిన కథ–1 :** కృష్ణ, ప్రసాదు స్నేహితులు. కృష్ణ తనో డాక్టరుగా ఆ హాస్పిటల్ సిస్టర్‌కు చెప్పి తన పేషంటు ఒకామెకు ఇంజక్షన్ చేయడానికి ఆమెను రమ్మని వేడుకుంటాడు. కృష్ణ అన్న సీతారామయ్య వస్తున్నట్లు టెలిగ్రాం ఇస్తాడు. సిస్టర్ కృష్ణ ఇంటికి వస్తుంది.

''ఎప్పుడో ఓసారి అటువేపు వెళ్ళానులెండి''

''చాలా కామ్‌గా – బాగుంటుంది..'' అందామె.

''అయితే మీకూ నిశ్శబ్దం అంటే ఇష్టమన్నమాట. నేనూ అంతేనండీ! అందుకే సిటీ మధ్యలో ఉన్నా ఎక్కువ రద్దీలేని రోడ్డుమీద ఆ ఇల్లు మొత్తం అద్దెకు తీసుకున్నాను. నా ఒక్కడి కోసం అంత ఇల్లు! నెలకు ఎనిమిది వందలు. అద్దె ఎక్కువే అనుకోండి! కానీ ఆ కామ్‌నెస్ కోసమే స్పెండ్ చేస్తున్నానన్నమాట. రాత్రుళ్ళు తలుపులన్నీ మూసేసుకుని ఇష్టమయిన మ్యూజిక్ సన్నగా వినబడేట్టు వాల్యూమ్ ఉంచి వింటోంటే ఎంత బాగుంటుందో తెలుసాండీ! జీవితమంతా ఇలాగే గడచిపోతే బావుండుననిపిస్తుంది ..''

ఆమె చిరునవ్వుతో వింటోందతని మాటలు

కారు సీషోర్‌లోనే ఉన్న ఖరీదయిన హోటల్ ఆవరణలోకి చేరుకుంది. ఇద్దరూ కారు దిగారు.

రూఫ్ గార్డెన్ ఎంతో అందంగా కనబడుతోంది ఆ వెన్నెల్లో.

చక్కని క్రోటన్స్ మొక్కలు, సువాసనలు విరజిమ్ముతోన్న పూల మొక్కలు ఎంతో ఆహ్లాదం కలిగిస్తున్నాయ్.

స్త్రీ పురుషులు చాలా మందితో నిండిపోయి ఉందా చోటు. ఓ మూలకు చేరుకుని ఖాళీగా ఉన్నా టేబుల్ ముందు కూర్చున్నారిద్దరూ. మార్గరెట్‌కి అతనితోపాటు రావడం సిగ్గుగానూ, ఉత్సాహంగానూ కూడా ఉంది.

బేరర్ వచ్చి మెనూ కార్డ్ ఇచ్చాడు.

''ఇందులో మీకేం కావాలో చెప్పండి . .'' కార్డ్ ఆమెకివ్వబోతూ అన్నాడతను.

''నాకేదయినా సరే మీరే– చెప్పండి...'' అందామె తీసుకోకుండా.

''ఓకే! నేనే చెప్తాను. తరువాత మళ్ళీ నన్ను తిట్టుకోకూడదు– ఇలాంటి చెత్త తెప్పించాడేమిటా అని...'' నవ్వుతూ అన్నాడతను.

''ఏమీ తిట్టుకోను లెండి –''

అతను ఏవేవో నాలుగయిదు రకాల పదార్థాలు ఆర్డరిచ్చాడు బేరర్‌కి.



## జీవితం — సెంటిమెంట్

''మీరు నమ్ముతారో నమ్మరో గాని ఇక్కడ నాకు మంచి స్నేహితులే లేరనుకోండి! చాలా లోన్లీగా ఉంటుంది ఒకోసారి! నేనుఇంచు మించుగా రాత్రుళ్ళు రోజూ ఇక్కడే భోజనం చేస్తూంటాను. కానీ ఎప్పుడూ ఏదో డ్యూటీ కోసం తింటున్నట్లు తినడమే! ఇవాళ మాత్రం భలే ఆకలిగా ఉంది. ఎందుకో తెలుసా? మీ కంపెనీ ఉంది కాబట్టి.''

ఇద్దరూ నవ్వేశారు.

''మీరేమీ మాట్లాడడంలేదు మార్గరెట్ గారూ! నేనే ఎక్కువగా మాట్లాడి మీకు'బోర్' కొడుతున్నాననుకుంటాను...''

''అదేంలేదులెండి...''

''మీ జాబ్ ఎలా వుంది? స్టాఫ్ నర్స్ ఎప్పుడవుతున్నారు?''

ఆమె విరగబడి నవ్వింది.

''అయ్యో! అప్పుడేనా! ఇంకా చాలా సర్వీస్ అవాలి స్టాఫ్‌నర్స్ అవాలంటే.''

''చాలామంది నర్సులు ఇరాన్ వెళ్లిపోతున్నారని పేపర్లో చదివాను. మీరు కూడా వెళ్ళాలని ఏమయినా ట్రై చేస్తున్నారా?''

''ఊహ! నాకిష్టం లేదండీ! అయామ్ హాపీహియర్! ఫైనాన్షియల్‌గా ప్రాబ్లెమ్స్‌లేవు. ఇంకెందుకు అంత దూరం వెళ్ళి పని చేయడం? మా సిస్టర్, మా బ్రదర్ – అందరూ ఎర్నింగ్ మెంబర్సే!''

''అఫ్‌కోర్స్ అది నిజమేలెండి!''

బేరర్ ట్రేలో ఏవేవో కూరలు, స్వీట్సు, రైస్ తెచ్చి వారి ముందుంచాడు.

''అమ్మో! ఇన్నిరకాలే!'' ఆశ్చర్యంగా అందామె.

''ఇదిగో ఇలా మాట మార్చేయకండి. నేను ముందే చెప్పాను, నేను ఆర్డరిచ్చాక గొడవచేయ కూడదని!''

ఇద్దరూ ఏవేవో విషయాలు మాట్లాడుతూనే భోజనం ముగించారు.

బేరర్ బిల్లు తెచ్చి ప్లేట్లో ఉంచాడు.

నూటఏభయ్ రూపాయలు బిల్లవటం చూచి మార్గరెట్ ఉలిక్కిపడింది.

''అమ్మో! భోజనానికి అంత బిల్లా?''

''ఎక్కువేంకాదుగా! రెండు వందలలోపే''

''మీకు చాలా తక్కువలాగా ఉంది కాబోలది...''

''చూడండి! మనం అనుభవించడానికి కాకపోతే ఇంకా ఈ డబ్బు ఉపయోగమేముంది చెప్పండి! నేనేరోజూ డబ్బుని లెక్క చేయలేదు ఇకముందు చేయను కూడా...''

ఆమె ఏమీ మాట్లాడలేదు.

అతను చాలా ధనవంతుడయి ఉంటాడని పించింది.

క్రమేపీ రూఫ్ గార్డెన్ ఖాళీ అవుతోంది.

వెన్నెల మరింత మనోహరంగా ఉందిప్పుడు.

సన్నగా వినబడుతున్న నజియా డిస్కోపాట మత్తుగా ఉంది.

''ఇంక వెళ్దాం...'' అంది మార్గరెట్.

''పదండి. ఇలా మీతో కబుర్లు చెప్తూ కూర్చుంటే చాలా బాగుందనుకోండి!

కానీ మీరు డ్యూటీ కెళ్ళాలికదా మళ్ళీ..''

ఇద్దరూ కార్లో బయల్దేరేరు.

ఆమె ఇంటిముందు కారాపాడతను,

ఆమె దిగి నిలబడింది.

''మళ్ళీ ఎప్పుడు వస్తారు మా యింటికి?'' అడిగాడతను.

''ఇంకెందుకు?'' ఆశ్చర్యంగా అడిగిందామె.

''ఇది అన్యాయమండీ! దొరక్క దొరక్క మంచి ఫ్రెండు దొరికారని అనుకుంటూంటే– గుడ్‌బై చెప్తానంటారేమిటి?'' నిష్ఠూరంగా అన్నాడతను.

''నేనలా అనటంలేదు. కానీ...'' ఏం మాట్లాడాలో తెలీలేదామెకి.

''చూడండి! మీరు కనీసం వారానికోసారయినా వస్తూండాలి–ఏమంటారు?''

''సరే...'' అందామె ఇబ్బందిగా.

''సరే అని తప్పించుకుందామనుకుంటున్నారేమో! వారంలోగా మీరు రాకపోతే నేనే ఇంటి కొచ్చేస్తాను...''






"యూ ఆర్ మోస్ట్ వెల్‌కమ్" చిరునవ్వుతో అందామె.

"అంటే మీరు రారన్నమాట! అంతేనా?"

"సరే– వస్తాన్లెండి..."

"ప్రామిస్ ?"

"ప్రామిస్ !"

"థాంక్‌యూ ! గుడ్ నైట్–"

అతను కారు స్టార్ట్ చేశాడు.

ఇంటికి చేరుకునేసరికి ప్రసాద్ భోజనం చేస్తూ కనిపించాడు.

"ఏం గురువా ? ఏమయింది ?"

"ఇంకేమౌతుందిరా ! మనం ఏ కథ ప్రారంభించినా కథ ఖచ్చితంగా కంచికెళ్ళాల్సిందేగా ?"

"అంటే కథ కంచికి ఆ అమ్మాయి నీ వలలోకీ– అంతేనా ?"

"ఇంకా అనుమానమేమిటి ? వారంలోగా మళ్ళీ డిన్నర్‌కొస్తుంది."

"అదృష్టంరా !"

"అదే వద్దన్నానా? కృషి ! కృషిరా నాయనా ! కృషే ఫలి. అన్నారు."

ప్రసాద్ భోజనం ముగించి చేయి కడుక్కున్నాడు.

"అది సరేగాని బ్రదరూ– రేపు మీ అన్నయ్య వస్తున్నాడు గదా ! మరి మన ఇల్లూ– ఈ రాజభోగాలూ చూస్తే మన కారెక్టర్‌మీద డౌట్ రాదూ ?!"

"రేపు ఇల్లు ఇలా ఉంటుందనుకుంటున్నావేమిట్రా ? ఆ కాలెండర్లనీ మారిపోతాయ్. ఆ సినిమాల మాగజైన్లు, సెక్స్ మాగజైన్లూ బాత్‌రూమ్‌పైన అటకమీద కెళ్ళి పోతాయ్. బీరు సీసాలన్నీ పాత సీసాలు కొనే షాపుకెళ్ళిపోతాయ్."

"ఇవన్నీ ఒక్కరోజులో ఎలా జరుగుతాయ్?"

"మరి నీ పనేమిటనుకున్నావ్ – రేపు సాయంత్రంలోగా చేసేయాలి ఇవన్నీ."

"ఒరేయ్ నీతోపాటు ఇక్కడుండటం నా వల్లకాదురా!" విసుగ్గా అన్నాడు ప్రసాద్.

"ఎందుకని ?"

"ఇక్కడుంటే నీతోపాటు నా చదువుకూడా గంగలో కలిసిపోతుంది. ఇప్పటికే రెండుసార్లు తప్పానని మా ఫాదర్ డబ్బు పంపటం తగ్గించివేశాడు. ఈసారికూడా తప్పితే–ఇంతేసంగతులు– నీకు చదువొద్దురా చిట్టితండ్రీ–వచ్చి వ్యవసాయం చూసుకోమంటాడు."

"ఒరే ప్రసాదం ! ఇంతకాలం నాతో స్నేహం చేసినా నువ్వింకా జీవితాన్ని అర్థం చేసుకోలేదంటే నాకు చాలా ఇన్సల్ట్‌గా ఉంది. మనిషి లైఫ్‌లో ఇది గోల్డెన్ పిరీడ్‌రా ! దొరికినదీ దొరకనిదీ, కావాలనుకున్నదీ, అక్కర్లేనిదీ అన్నీ ఎంజాయ్ చేసేసెయ్యాలిప్పుడే ! ఆలస్యం చేస్తే ఈ అవకాశాలు పోతాయ్, ఈ వయసూ దాటిపోతుంది – అప్పుడు ఏడుస్తూ కూచుంటే ఏం లాభం ? అంచేత..."

"బాబోయ్ ! స్పీచ్ ఇవ్వకు ! అదంతా నాకెప్పుడో కంఠతా వచ్చేసింది."

"వచ్చిందా – వెరీగుడ్ ! అయితే ఈనాటి కార్యక్రమం ఇంతటితో సమాప్తం చెప్పేసెయ్– పడుకుందాం ! ఈ దేహాలకి కొంచెం విశ్రాంతి ఏర్పాటుచేస్తేగాని రేపు మళ్ళీ యాక్టివ్‌గా ఉండవ్."

ఇద్దరూ మంచాలమీద పడుకున్నారు.

"బాస్ ! పొద్దున్నే లేచి మీ చంద్రకళకు ఫోన్ చేయాలి – ఎల్లుండి సాయంత్రం ప్రోగ్రాం కాన్సిలయిందని."

"చచ్చాంరా నాయనా! ఇవాళా, రేపూ వద్దన్నాననే కోపం ముంచుకొచ్చింది. ఇప్పుడు ఎల్లుండి కూడా వద్దంటే ఇంక మన మొఖం చూడదు..."

"చూడకపోతే పోనీ – కొత్తపిట్ట దార్లో కొస్తోందిగా..."

"ఎవరి అందం వాళ్ళదేరా బ్రదరూ! మనం ఎప్పుడూ ఒకటే రంగు బట్టలు ఎందుకు తొడగడం లేదు? ఒకటే కూర ఎందుకు తినడం లేదు? ఇదీ అంతే–"

"ఇలా అని ఆడాళ్ళుకూడా అనుకుంటే..." నవ్వుతూ అన్నాడు ప్రసాద్.

"అనుకుంటే తప్పేముందిరా! వెల్‌కమ్– వెల్‌కమ్–"

"రేపు పెళ్ళయ్యాక మన భార్యలు కూడా అనుకుంటే...

"ఒరేయ్ ఇంకోసారా పిచ్చివాగుడు వాగావంటే మర్డర్ చేస్తాను, పడుకో ఇక– మన భార్యలు కూడా అలా తయారయితే అమెరికాలో మొగుళ్ళు ఏం చేస్తున్నారో మనమూ అదేచేస్తాం–సన్యాసి! ఆ మాత్రం తెలీదుట్రా!"

ప్రసాద్ నవ్వేశాడు.

"నీ హృదయానికి వైశాల్యం మరీ ఎక్కువరా–"

మర్నాడు ప్రసాద్ ప్రొద్దున్నేలేచి, కృష్ణ నిద్రలేచేలోగా ఆ ఇంటి రూపురేఖలే మార్చి పారేశాడు.

కృష్ణ లేస్తూనే చూసి ఆశ్చర్యపోయాడు.

"ఏమిటి మనం ఉన్నది మనింట్లోనేనా ?"

"మరీ ఓవరాక్షన్ చేయకు–కాఫీ టిఫినూ టేబుల్ మీదున్నాయ్

నేను వెళ్ళి ఆ సీసాలన్నీ మార్కెట్లో పారేసి వస్తాను..."

అంటూ వెళ్ళిపోయాడతను.

"వచ్చే జన్మలో నీ కడుపునపుట్టి ఋణం తీర్చుకుంటాన్రా బ్రదరూ..." నవ్వుతూ అన్నాడు కృష్ణ.

సాయంత్రం ఇద్దరూ స్టేషన్‌కెళ్ళారు.

"కోరమండల్ ఎంత లేటండీ ?'

ఎంక్వయిరీ క్లర్క్‌ని అడిగాడు కృష్ణ.

"లేటు లేదండీ ! రైట్ టైమ్ ..."

"అయ్యోపాపం ! ఎందుకని ఇవాళ ...'

ఆశ్చర్యంగా అనేసి ప్లాట్‌ఫారంమీదకు చేరుకున్నాడు.

బుక్‌స్టాల్ దగ్గర నిలబడ్డ ఓ అమ్మాయిని చూసి సన్నగా విజిల్ వేశాడు కృష్ణ.

అది చూసి ప్రసాద్ అదిరిపడ్డాడు.

''మళ్ళీ కొత్త కేసా ?'' అన్నాడు నాలుగు వేపులా కలియజూస్తూ.

''ఇటు కాదురా ! అదుగో ! ఆ బుక్‌స్టాల్ దగ్గర అమ్మాయిని చూడు.''

ప్రసాద్ ఆమెవేపు చూశాడు.

''ఒరేయ్ ! పాపం చిన్నపిల్లరా ! పట్టుమని పద్దెనిమిదేళ్ళుకూడా ఉండవేమో ! అన్యాయం చేయకు ... ''

''ష్ ! ప్రేమకు వయసూ, వరుసా ఏమీ లేవని అన్నార్రా — ఎవరని అడక్కు ! నేనే !''

''కానీ పాపం — ఈ అమ్మాయి మరీ అమాయకంగా ఉందిరా !''

''అందుకే మరీ లైకింగ్‌గా ఉంది నాకు.''

''బాబ్బాబు — ''

''ష్ ! నోర్మూసుకోరా పక్షీ ! నీకు ప్రేమించడంచేతకాదు—ఇంకోడిని ప్రేమించనీవు, నువ్విక్కడే ఉండు ! నేను వెళ్ళి ఆ అందాల దేవతతో ఒక్కసారి పరిచయం చేసుకొచ్చేస్తాను'' అంటూ తనూ బుక్‌స్టాల్ దగ్గరకెళ్ళి 'నమస్తే' అన్నాడు ఆమెతో.

ఆ అమ్మాయి తెల్లబోయి అతనిని చూసింది.

''నన్ను గుర్తు పట్టలేదనుకుంటాను. అవున్లెండి. అయిదేళ్ళయిపోయింది కదా! గుర్తుంచటం కష్టమే ! మీలో పెద్దగా మార్పులేక పోబట్టి నేను గుర్తు పట్టాను.'' నవ్వుతూ అన్నాడతను.

ఆమెకు అయోమయంగా ఉంది.

''సారీ ! నేను ఇంకా గుర్తు తెచ్చుకోలేక పోతున్నాను ...'' అంది ఆలోచిస్తూ.

''మా సిస్టరూ, మీరూ క్లాస్‌మేట్స్ కదా అప్పుడు ! మీరు మా ఇంటికి కూడా వచ్చారు చాలా సార్లు ...''

ఆమె కళ్ళల్లోకి వెలుగు వచ్చింది.

''మీరు అనుపమ బ్రదరా ?'' ఉత్సాహంగా అడిగిందామె.

''అయ్యో! ఇంకా అనుమానమేమిటండీ!''

''సారీ ! చాలా మారిపోయారు ! అందుకని గుర్తు పట్టలేకపోయాను ...''

''ఏం ఫరవాలేదు... నిజానికి నా పాత ఫొటోలు చూస్తే అది నేనేనని నాకే నమ్మకం కలగదు ...''

''ఇప్పుడు అమా ఏం చేస్తోంది?'' అడిగిందామె కుతూహలంగా.

''ఇంకేం చేస్తుందండీ! హాయిగా మారేజ్జేసుకుని సంసారం చేస్తోంది.''

''ఎక్కడుంది ?''

''విజయనగరంలో —''

''ఈసారి ఇక్కడికొస్తే ఆమెను మా ఇంటికి రమ్మని చెప్పండి ...''

''మీరు ఇంకా అదే ఇంట్లో ఉంటున్నారా?'' అడిగాడతను.

''ఊహూ లేదండీ ! అడ్రసు ఇస్తాను ...''

## జీవితం— సెంటిమెంట్

అంటూ కాగితం కోసం బాగ్ తీసేసరికి అతను ఛటుక్కున తన డయిరీ ఆమెకిచ్చాడు.

''ఇందులో రాయండి !''

ఆమె డయిరీలో తన అడ్రస్ రాసి ఇచ్చింది.

రాస్తూంటే ఆమె పేరు చూశాడతను. సావిత్రి అని రాసింది.

''ఎవర్నయినా రిసీవ్ చేసుకోడానికి వచ్చారా ? '' అడిగాడతను.

''అవునండీ ! మా ఆంటీ వాళ్ళు వస్తున్నారు కోరమండల్‌కి.''

''మీరేమయినా జాబ్ చేస్తున్నారా ? '' అడిగాడతను.

''ఊహు లేదండీ ! మొన్నే బి. యెస్సీ పాసయ్యాను—అంతే ! ఆ తరువాత చదవటం లేదు.''

''నేను ప్రస్తుతం ఇక్కడే ఉంటున్నాను. మా ఫాదరూ మదరూ అంతా అనకాపల్లిలో ఉన్నారు. మా ఇంటి అడ్రస్ ఇస్తాను. ఎప్పుడయినా మీరు అటువేపు రావడం తటస్తిస్తే, తప్పక ఇంటికి రండి ! '' ఓ కాగితం మీద తన పేరు ఇంటి అడ్రస్ రాసి ఆమె కిచ్చాడతను.

ఇదంతా పక్కనే నిలబడి చూస్తున్న ప్రసాద్ 'దేముడో' అని అరచాడు.

ఆ కేకతో ఆ అమ్మాయి ఉలిక్కిపడి అతని వేపు చూసింది.

కృష్ణకి వళ్ళు మండిపోయిందతని మీద.

''ఏమిటండీ— అలా అరచారు ? '' అనడిగాడు కోపంగా.

''అరవలేదండీ—ఏడుస్తున్నాను.''

''ఎందుకు ? ''

''ఏమోనండీ ! నాకే తెలీదు.

అప్పుడప్పుడూ అలా ఏడుపొస్తూంటుంది. అదేదో జబ్బువల్ల అలా వస్తుందని మా డాక్టర్ చెప్పాడు.''

## ప్లాస్టిక్ విమానాలు !

ప్లాస్టిక్ విమానాల తయారీ గురించి హానోవర్ విశ్వవిద్యాలయాలలోని ప్లాస్మా ఫిజిక్స్ విభాగంలో పరిశోధనలు జరుగుతున్నాయి. కృత్రిమ రెజిన్లు, కర్బనము కలిసిన ఒక కొత్త ప్లాస్టిక్ పదార్థాన్ని రూపొందించారు. ఇది లోహంకంటె చాలా తేలికైనది. దీనితో విమానాలు నిర్మించటం సాధ్యమైతే, విమాన ప్రయాణ ఖర్చులు చాలావరకు తగ్గగలవు. ఈ కొత్త పదార్థంతో చుక్కానిని తయారుచేశారు. ఈ కొత్త పదార్థంపై మెరుపుల ప్రభావాన్ని పరీక్షించవలసి ఉంది.

''అయ్యోపాపం ! త్వరగా నయంచేయించుకోండి—లేపోతే ప్రాణంమీదకొస్తుంది'' అన్నాడు కోపంగా.

''పదండి ! మనం అలావెళ్ళి కూల్‌డ్రింక్స్ తీసుకుందాం'' అన్నాడు కృష్ణ ఆమెతో.

''వద్దండీ...''

''ప్లీజ్ ! కాదనకండి ! అనుకోకుండా ఇంత కాలానికి కలుసుకున్నాం.''

అతని అందానికీ, ఆ వర్ణనకీ సంచలనం కలుగుతోందామెలో.

కొత్తదనం చాలావరకూ తొలగిపోయింది.

అతనితోపాటు కూల్‌డ్రింక్ స్టాల్ దగ్గరకు వెళ్ళిందామె.

ఇద్దరూ కూల్‌డ్రింక్ తాగారు.

''మీరేం చేస్తున్నారు? చదువుతున్నారా?'' అడిగిందామె.

''ఎమ్మే తప్పానండీ ! పాసవ్వాలని తెగ ప్రయత్నిస్తున్నాను...''

ఆమె నవ్వేసింది.

''నేను పోస్ట్‌గ్రాడ్యుయేషన్ చేయాలనే అనుకున్నానండీ ! కానీ అనుకోకుండా మా ఫాదర్ పోవడంవల్ల ఆర్థిక పరిస్థితి తారుమారయింది. అందుకని ఉద్యోగం చేయాలని ప్రయత్నిస్తున్నాను...''

''ఉద్యోగమా ? ఏం ఉద్యోగం చేయాలనుకుంటున్నారు ?''

''ఏదోకటి— టెంపరరీగా ! కనీసం చిన్న స్కూల్స్‌లో టీచరుగానయినా ప్రయత్నిద్దామని ఉంది—''

''అరె ! చెప్పారుకారేం ? మీకు టీచర్ ఉద్యోగం కావాలంటే నేను ఇప్పించగలను !''

ఆమె ఆశ్చర్యంగా చూసింది.

''ఎలా?''

''ఓ స్కూలు హెడ్మాస్టరు— నాకు బాగా ఫ్రెండ్ లెండి ! నేను చెప్తే కాదనడు.''

''అయితే మరి నాకు ఆ సహాయం చేయగలరా ?'' ఆశగా అడిగిందామె.

''ఓ ! అదెంతపనండీ ! మీరు ఇంత సన్నిహితులు— ఆ మాత్రం సహాయం చేయలేకపోతే ఇంకెందుకు ?''

''అయితే నే నెప్పుడు రావాలి మీదగ్గరకు!''

''రెండు మూడు రోజుల్లో నేను ఆ స్కూలుకి వెళ్ళి మా వాడికి చెప్తాను. మీరు ఆ తరువాత— అంటే— ఆ— నెక్స్ట్ మండే మా ఇంటికి రండి. అడ్రస్ కనుక్కోవడం చాలా తేలిక—''

''థాంక్యూ ! ప్రస్తుతం నేను ఏదోక ఉద్యోగం చేస్తే మా కుటుంబానికే ఎంతో హెల్ప్‌ఫుల్‌గా ఉంటుంది...'' కృతజ్ఞతతో అందామె.

వాళ్ళా మాట్లాడుతూండగానే ఎనౌన్స్‌మెంట్ వినిపించింది.

కోరమండల్ కొద్ది నిమషాల్లో వస్తోందిట.



## ‘ఇప్పుడు, నేను తెలుసుకున్నాను కెయో-కార్పిన్, నా తలనూనెను మార్చేందుకు నేను ఎప్పుడూ ఇష్టపడను...’

—అంటోంది ఒక గృహిణి




ఈమె ఒక్కరే కాదు. దేశం మొత్తాన లక్షలాది గృహిణిలు కెయో-కార్పిన్ హేయిర్ ఆయిల్ వాడుతున్నారు, కుటుంబంలో ప్రతి ఒక్కరినీ వాడమని చెప్తున్నారు. వారికి తెలుసు ఇది పలుచని జిడ్డు అంటనిది, మృదువైన సువాసనలతో దళసరిగా జుట్టు ఎదిగేందుకు తోడ్పడుతుంది.

## కెయో-కార్పిన్ హేయిర్ ఆయిల్

సంవత్సరాల నమ్మకమైనది

డేస్ వారి ఒక శ్రేష్ఠమైన సమర్పణ. 


PX/KK/TG-2/84A

"ఓకే – ఇంక ఉంటానండీ ! మండే మార్నింగ్ మీకోసం వెయిట్ చేస్తాను" అన్నాడతను.

"ఓ ! తప్పక వస్తాను..."

రైలు వచ్చి ప్లాట్‌ఫారంమీద ఆగింది.

ఆమె అతనిదగ్గర్నుంచీ వెళ్ళి జనంలో కలసిపోయింది.

"ఒరేయ్ తమ్ముడూ ! మువ్వు వెళ్ళి అరుంధతిని త్వరగా వెయిటింగ్ రూమ్‌వేపు తీసుకెళ్ళు. ఆ తరువాత మా అన్నయ్యను నేను కలుసుకుని బయటకు తీసుకెళ్తాను."

"ఓకే..." అన్నాడు ప్రసాద్ తనూ జనంలో జొరబడుతూ.

కొద్దిసేపటి తర్వాత అరుంధతి ప్రసాద్‌తో పాటు వెయిటింగ్‌రూమ్‌వేపు వెళ్ళడం కనిపించింది కృష్ణకు.

వెంటనే తను కోటాకోచ్ దగ్గరకెళ్ళి ప్లాట్‌ఫారంమీద నిలబడి తనకోసం ఎదుర్చూస్తున్న శీతారామయ్యను కలుసుకున్నాడతను.

"రైలువచ్చి చాలాసేపయిందా అన్నయ్యా! వాళ్ళకి ఫోన్‌చేస్తే అరగంట లేటన్నారు. సరే అన్నారుకదా – తప్పక ఉండే ఉంటుంది అని లేటుగా వచ్చాను."

"ఏం ఫర్వాలేదులేగానీ – పద వెళ్దాం."

అతని చేతిలోని సూట్‌కేస్ తనే పట్టుకున్నాడు కృష్ణ.

"నువ్వెందుకురా మోయడం! కూలీకివ్వు.." అన్నాడు శీతారామయ్య.

కూలీని పిలిచి అతనికి సూట్‌కేసిచ్చాడు కృష్ణ.

ఇద్దరూ బయటకు నడిచి కార్లో కూర్చున్నారు.

"కారెక్కడిదిరా?" ఆశ్చర్యంగా అడిగాడు శీతారామయ్య.

"అద్దెకు తెచ్చానన్నాయ్–"

"ఎందుకు?"

# జీవితం — సెంటిమెంట్

"అదే–నువ్వొస్తున్నావనీ – మనకు తిరగడానికీ–దానికీ పనికొస్తుంది కదా..."

లోపల తనకంత గౌరవం ఇస్తున్నందుకు ఆనందంగా ఉన్నా పైకి మాత్రం చిరాకు ప్రదర్శించాడాయన.

"ఈ కార్లూ, స్కూటర్లూ పక్కనుంటే ఇంకేం చదువొస్తుందిరా నీకు ?"

"అబ్బే – ఈ కారు ఎప్పుడూ తీసుకోనన్నాయ్–నువ్వొస్తున్నావనే..."

"సర్లే–పద..."

ఇద్దరూ ఇంటికి చేరుకున్నారు.

ఆ ఇల్లు చూస్తే ముచ్చట వేసిందాయనకు.

"ఇల్లు బాగుందిరా" అన్నాడు సంతృప్తిగా.

"అవునన్నయ్యా! అందుకే అద్దెకొంచెం ఎక్కువయినా–చదువు చక్కగా సాగుతుందని తీసుకున్నాను."

"మరి ఇంకెందుకని చదువు సాగటం లేదు?"!

"ఎందుకంటే ... ఎందుకంటే – అదేంటన్నయ్యా! ఎవరన్నారు సాగటం లేదని?"

ఆయన నవ్వాడు.

"అయితే బాగా చదువుతున్నానంటావ్!"

"అవునన్నయ్యా ! ట్యూషన్ కూడా వెళ్తున్నాగ!"

"అంటే ఈసారి పాసవుతానంటావ్!"

"భలేవాడివన్నయ్యా ! ఇంకా అనుమానమా?"

"సరే ! చూస్తానుగా !"

"ముందు స్నానం చేసెయ్ అన్నయ్యా, భోజనానికెళ్దాం !"

ఆయన లేచి టవల్ తీసుకుని బాత్‌రూమ్‌లోకి వెళ్ళాడు.

స్నానం చేసి తిరిగి వచ్చేసరికి ప్రసాద్ కృష్ణతో మాట్లాడుతూ కనిపించాడు.



శీతారామయ్యను చూడగానే "నమస్కారమండీ" అన్నాడు వినయంగా.

"నమస్తే నమస్తే ! ఏమోయ్ ! నువ్వా ఇంకా ఈ రూమ్‌లోనే ఉన్నావా ?"

"అవునండీ !"

"అయితే మళ్ళీ ఇద్దరూ కలిసే తప్పారన్నమాట ! అంతేనా ?"

"తప్పటమా ! మారికార్డులో లేద్సార్ ! ఏదో పేపర్ వాల్యుయేషన్ సరిగ్గా లేక తప్పడమే !"

ముగ్గురూ కార్లో హోటల్‌కి బయలుదేరారు.

రూఫ్ గార్డెన్‌లో భోజనం చేసాక బిల్ చూశాక అది చాలా ఖరీదయిన హోటల్ అని అర్థమయింది శీతారామయ్యకు.

కృష్ణ అంత ఖరీదయిన జీవితం గడపడం ఆయనకు ఆనందమే కలిగిస్తోంది. తనలాగా వాడు దరిద్రంతో నిండిన జీవితం గడపడానికి వీల్లేదు. తను అనుభవించలేకపోయినా ఆడంబరాలన్నీ వాడనుభవించాలి.

బిల్లు తనే ఇచ్చేశాడు కృష్ణ.

ముగ్గురూ మళ్ళీ బయల్దేరి బీచ్ దగ్గర ఆగారు.

"ఎప్పుడు మీ పరీక్షలు మళ్ళీ ?" అడిగాడాయన.

"ఇంకా రెండు నెలలున్నాయ్ అన్నయ్యా!"

"అవగానే ఇంటికొచ్చేస్తావ్ కదా !"

"అవగానే కాకుండా... రిజల్ట్స్ వచ్చాక.. వద్దామని..." నసిగాడు కృష్ణ.

"సరే– నీ ఇష్టం ! అన్నట్లు చెప్పటం మరచాను. రుక్మిణి బర్త్‌డే వచ్చే శుక్రవారం ! నిన్ను తప్పకుండా రమ్మంది ..."

"సరే అన్నాయ్ ... రాకపోతే ఊరుకోదుగా అది !"

"నీ సంగతేమిటోయ్ ప్రసాద్ ? నువ్వు రారాదూ సరదాగా ?"

"వస్తానండీ !"

"మీరిద్దరూ ఎన్ని వేషాలేనా వేయండి కానీ చదువు మాత్రం నిర్లక్ష్యం చేయకూడదు."

"అబ్బే ... అసలు వేషాలేమీ వేయటం లేదండీ ..."

మరికాసేపు ఇంటి విషయాలు మాట్లాడాక మళ్ళీ ఇంటికి చేరుకున్నారు వాళ్ళు.

"రేపు కొంచెం బిజినెస్ పని ఉందిక్కడ ! సాయంత్రానికల్లా ఏదోక ట్రైన్‌కో, బస్‌కో వెళ్తాను – మరి పగలంతా ఈ కారు మనం వాడుకోవచ్చా ?"

"ఓ ! అందుకోసమే కదన్నాయ్ తీసుకుంది? ఎన్నిరోజులు కావాలంటే అన్నిరోజులు వాడుకోవచ్చు ..."

"సరే ..."




## ఎమ్. ఎవ్. - బాపట్ల

మా అన్నగారికి సుమారు 5 సంవత్సరముల నుండి రోజూ కనీసం 5 మార్లయినా విరోచనాలు అవుతాయి. చాలామంది డాక్టర్లకి చూపించి మందులు వాడినా ఏమీ ప్రయోజనం కనిపించలేదు.

★ కొందరికి భోజనం చేయగానే విరోచనం అయ్యే అలవాటు ఉంటుంది. ఇలా జరగటం ప్రేగులలోని నరాల ప్రేరేపణ వల్ల అని, మానసిక ఆందోళన వల్ల అనీ కొన్ని అభిప్రాయాలున్నాయి. మలపరీక్ష చేయించి అందులో అమీబియాసిస్ అనే రోగం లేదని తీర్మానించుకోవలసి ఉంటుంది.

## బి. హెచ్. కె. — గుంటూరు

నా వయస్సు 23 సంవత్సరములు. 9 సంవత్సరముల క్రితం నా కుడి కాలుకి కుష్టు వున్నదని డాక్టరు చెప్పారు. పాదం అంచులో స్పర్శజ్ఞానము లేదు. పాదం వెనుక నుండి కాలు, గజ్జలో, మెడ వెనుక భాగములో నరము అక్కడక్కడ ఉబ్బి వున్నది. అప్పటి నుండి 'డాప్‌సోన్ 100 మి.గ్రా.' 'అన్‌స్క్రిప్‌న్' వాడుతున్నాను. వ్యాధి పూర్తి నివారణకు మందులు ఇంకా ఎంతకాలం వాడాలి ? ఇంకా మంచి మందులేమైనా వున్నవా ? ఇది ఏరకమైన లెప్రసీ ? ఇది అంటు వ్యాధా ? 'డాప్‌సోన్' రెసిస్టెన్సి రాకుండా వుండటానికి ఏమి చెయ్యాలి ?

★ రోగం నయమయినదీ లేనిదీ వైద్యుల ప్రత్యక్షంగా పరీక్షించి తెలియజేయవలసి ఉంటుంది. డాప్సోన్ రెసిస్టెంట్ కేసులకీ, శరీరంలో క్రిముల సంఖ్య అధికంగా ఉన్నవారికీ రిఫామైసిన్, లాంపిరిన్ అనే మందులు వాడటం జరుగుతుంది. మీకు ఉన్నది నాన్‌లెప్రోమేటస్ రకం అనిపిస్తుంది. లెప్రోమేటస్ రకం అంత అంటు రోగం కాదు. క్రమబద్ధంగా డాప్సోన్ మాత్రలను వాడుతూ ఉన్నప్పుడు రెసిస్టెన్స్ ఏర్పడే అవకాశం లేదు.

## కె. ఎవ్. ఆర్. — విజయవాడ

నాకు కొద్ది రోజుల క్రితం చెవిలో చీము వచ్చింది. మందులు వాడితే తగ్గింది. రెండవమారు పోటుతోపాటు చీము కారినది. చదివేటప్పుడు చెవి నరాలు నెప్పులుగా వుంటున్నాయి. అప్పుడప్పుడు శబ్దం వచ్చుచున్నది.

★ మీరు ఇ.ఎన్.టి. వైద్యులను సంప్రదించవలసి ఉంటుంది. అలక్ష్యం చేయుటంవల్ల చెవులవెనుక భాగంలోని ఎముకకి చీము వ్యాపించే అవకాశం ఉంటుంది.

## కె. వి. ఎవ్. — అద్దంకి

నాకు చదువుతున్నప్పుడు తలనెప్పి కనుగ్రుడ్లు పోట్లుగా వుంటాయి. దీనివలన నేను చదువుకోలేక పోతున్నాను. డాక్టరుకి చూపిస్తే కళ్ళజోడు వాడాలన్నారు. కాని నాకు యిష్టంలేదు.

★ కళ్ళజోడు వాడమని చెప్పినప్పుడు దానికన్న వేరే మార్గంలేదు. వీలయిన పక్షంలో నేత్రవైద్యులు కాన్‌టాక్టు లెన్సులను అమర్చటం జరుగుతుంది. అప్పుడు కళ్ళజోడు వాడవలసిన అవసరం ఉండదు.

## ఎవ్. ఆర్. ఎల్. — ఏలూరు

నా ముక్కు పెద్దదిగా వుండి అసహ్యంగా కనబడుచున్నది. దీనిని 'ప్లాస్టిక్ సర్జరీ'ద్వారా అందంగా మలచుకొనవచ్చునా ? అది ఎక్కడ చేస్తారు ? ఎంత కాలము పడుతుంది ?

★ తప్పకుండా వీలవుతుంది. పెద్ద మెడికల్ కాలేజీ ఆస్పత్రులలోని ప్లాస్టిక్ సర్జరీ డిపార్టుమెంటులో ఈ చికిత్స చేయటం జరుగుతుంది. ఎంతకాలం పడుతుందనేది చేసిన శస్త్ర చికిత్సననుసరించి ఉంటుంది. సుమారుగా 15 రోజులనుంచి నెల రోజులదాకా పట్టవచ్చును.

## ఎవ్. ఎవ్. ఎమ్ — కువ్వం

నా వయస్సు 60 సంవత్సరములు. గత 7 సంవత్సరములనుండి కీళ్ళ నెప్పులతో బాధపడుతున్నాను. డాక్టరు సలహాపై మాత్రలు వాడినా ఫలితము శూన్యము. మోకాళ్ళు, మోచేతులు కదిలించిన అధికముగా నెప్పి కల్గుతోంది. నడుముటకు సాధ్యమవట్లేదు.

★ దీనిని ఆస్టియో ఆర్త్రైటిస్ అని అంటారు. వయస్సు మీరిన వారిలో ఈ లక్షణాలు సహజం. వైద్యుల పర్యవేక్షణలో ఆస్ప్రిలిసిలిక్ యాసిడ్ మాత్రలు, కార్టిసోన్‌వంటి మందులు వాడవలసి ఉంటుంది. ●

ఆయన నిద్రపోయాక కృష్ణ, ప్రసాద్ లేచి బయటికొచ్చి కూర్చున్నారు.

''ఏరా — అరుంధతి ఏమంది ?''

''ఏమందేమిట్రా! నా ప్రాణం తీసేసింది!''

''ఏం ?''

''నువ్వు ఊరెళ్ళిపోయానని చెప్పగానే ఏడుస్తూ కూర్చుంది. ఓదార్చలేక చచ్చాననుకో! ఈ గొడవంతా చూసి ఆమెని నేనోదో హింసించి ఏడిపిస్తున్నాననుకుని జనమంతా మా చుట్టూ మూగారు. అలా అక్కడే కాసేపుంటే పోలీసులు కూడా వచ్చి నన్ను అరెస్ట్ చేసినా చేస్తారని అనుమానం వచ్చి ఆమెని తీసుకెళ్ళి వాళ్ళూరికి బస్ ఎక్కించేసి నేను బయటపడ్డాను.''

''వెరీ గుడ్! నాకు తెలుసులే ఇలాంటి విషయాలు నువ్ చాలా జాగ్రత్తగా టాకిల్ చేయగలవని ... ''

''ఒరేయ్—నువ్ భుజం తట్టి 'వెరిగుడ్' అనడం బాగానే ఉందిగానీ ఈ వెధవ టెన్షన్ భరించలేక నేను ఛస్తున్నాను...''

''స్నేహితుడు అనే మాటకు అర్థం అదే కదురా మరి! అన్ని కష్టాలూ మిత్రుడి కోసం భరించాలి...''

''లాభం లేదురా! నావల్ల కాదిక!'' చిరాగ్గా అన్నాడు ప్రసాద్.

''సరే మానేసెయ్‌గానీ — ఒక్కసారి పాత రోజులు గుర్తు తెచ్చుకో! బి. కామ్ పరీక్షకు ఫీజు కట్టలేక నువ్వు వెళ్తిన చెంగేసుకుని ఏడుస్తుంటే ఎవ్వడా నీకు సహాయం చేసింది?''

''వద్దులేరా! ఆలిస్యంతా ఇప్పుడు చదవకు ! నేనేంకాదనడం లేదుగా !''

''సరే ! అయితే, లే ఇక! వెళ్ళి నిద్ర పోదాం ! నన్ను తెల్లారుజామునే లేపు ! అన్నయ్య ఉన్నప్పుడయినా మనం శ్రద్ధగా చదువుకుంటున్నట్లు కనబడకపోతే బావుండదు.''

''నాకెక్కడ మెలకువ వచ్చేదుస్తుందిరా అంత పొద్దున్న ! నీ రూమ్మేట్ అయాక అలాంటి మంచి అలవాట్లన్నిటికీ తిలోదకాలొదిలేశాను.''

కృష్ణ నవ్వేశాడు.

ఇద్దరూ లోపలికెళ్ళి పడుకున్నారు.

(ఇంకా వుంది)




వానాకాలం వెళ్ళిపోయింది. శీతాకాలం, వంటింట్లో జొరబడే పిల్లిలాగ, నిశ్శబ్దంగా ఎవ్వరూ గమనించకుండానే వచ్చి పడింది. కలిగిన వారంతా నెమ్మదిగా బీరువాలలోనూ, పెట్టెల అడుగునా దాచివుంచిన వున్ని దుస్తులను తియ్య సాగేరు.

ప్రొద్దుటినుంచీ మబ్బులతో నిండిన ఆకాశంలో నుంచి అప్పుడే సూర్యభగవానుడు తొంగి చూస్తూ, తన వెచ్చటి కిరణాల్ని ప్రసరింప జేస్తున్నాడు. ఎండకోసం ఎదురు చూస్తున్న లక్ష్మీరాజ్యం, తన పిల్లవాడి తోపుడు బండీని గుమ్మం ముందే నిలబెట్టి, పిల్లవాడిని తీసుకొచ్చి తోపుడు బండిలో పడుకోనబెట్టి, గుమ్మంలోనే కుర్చీ వేసుకుని కూర్చుంది, వచ్చే పోయే జనాన్ని చూస్తూ.

దూరంగా వున్న వెంకట రామయ్యగారి యింటి ముందు రాలిన ఆకుల్నీ, మిగతా చెత్తనూ ప్రోగుచేసి కుప్పగా వేస్తున్నాడు అయిదేళ్ళ గోపాలం.

ప్రక్కయింటిలోనుంచి యశోదమ్మ అరుస్తోంది, "ఆఖరుమెట్టు జాగర్త లలితా—కొంచెం కదుల్తోంది." ఇంతలోనే దభీమని చప్పుడు. లలిత తన నాలుగేళ్ళ తమ్ముడిని లేవదీసి, కాలికి, చేతులకు అంటుకున్న దుమ్మును దులుపుతోంది. తన చేతిలోంచి జారిన చెత్త బుట్ట అల్లంత దూరంలో పడివుంది. బుట్టలోంచి బయటకొచ్చి, చెత్త నేలపై చెల్లా చెదరుగా పడివుంది.

"లల్లీ! లల్లీ! నేను నెత్తీ నోరు బాదుకుంటూనే వున్నా 'జాగర్త'! అంటూ ఏంలాభం? వాడివి పడేసేవు మధ్యలో! గదిలోకెళ్ళి బేండేజి, చీపురూ పట్రా! ఊ! తర్వగా." అంటూ యశోదమ్మ బయటకు వచ్చి, ఏడుపు మొహం పెట్టిన శేఖరాన్ని దగ్గరగా తీసుకున్నది. లలిత ఒక్క క్షణంపాటు తెల్లబోయి, వెంటనే తల్లి చూపులనుంచి మొహాన్ని తిప్పుకుని యింట్లోకి పరుగెత్తింది.

లలితకు తొమ్మిదేళ్ళుంటాయి. స్వతహాగా భయస్తురాలు. ఏ పని చెయ్యబోయినా తల్లి వెనకనుంచి కంగారు పెడుతూ భయపెట్టే

స్తుంది. ఆవిడ భయపడుతూన్నట్లే, లలిత కూడా కంగారుపడి, తను పడటమో, మరొకర్ని పడవెయ్యటమో, చేతిలోని వస్తువును జార విడవటమో, లేక మరేదో వస్తువును తన్నెయ్యడమో చేసేసి, తల్లిచేత మరిన్ని అక్షింతలు వేయించుకుంటుంది. లలితకు తల్లి అంటే విపరీతమైన భయం !

లలిత యింట్లోనుంచి వచ్చి, తల్లికి బేండేజి అందించి, చెల్లా చెదరయిన చెత్తను తను చీపురుతో మళ్ళా బుట్టలోకి ఎత్తసాగింది. యశోదమ్మ శేఖర్ మోకాలికి పట్టీ తగిలించి, ''అయిన నిర్వాకం చాలదూ ! ఆ చీపురు అక్కడ పడెయ్యి. నేను చేసుకుంటాను. ఒక్కపని సరిగ్గా చేసే యోగ్యతలేదు – తొమ్మిదేళ్ళు నెత్తిమీద కొచ్చినా.'' అంటూ అరిచేసరికి, లలిత చీపురు కట్టను అక్కడే వదిలేసి కొయ్యలాగ నిలబడి పోయింది. యశోదమ్మ చీపురుకట్టను అందుకుని చెత్తను ఎత్తి, వెంకటరామయ్యగారి యింటి ముందు పోసిరావడానికి వెళ్ళింది.

లలిత చిర్నవ్వుతో లక్ష్మిరాజ్యం వాటా వైపు వచ్చి, తొట్టు బండిలోకి తొంగిచూస్తూ, ''బాబు నిద్రలో నవ్వుతున్నాడు పిన్నీ'' అంటూ, ''బాబు లేచేక నన్నోసారి ఎత్తుకోనివ్వవా పిన్నీ'' అన్నది.

'' బాబు యింకా చిన్నపాప కదమ్మా ! ఇంకొన్నాళ్ళు పోతే రోజూ నువ్వే ఎత్తుకుని ఆడిద్దువుగాని,'' అన్నది లక్ష్మిరాజ్యం మృదువుగా. తను ఏ పనిచేసినా అధ్వాన్నమవుతుందని లలితకు కూడా తెలిసినట్లుంది ... అందుకే కాబోల్ను ఒక నిట్టూర్పు విడిచి, ''బాబు నవ్వుతూంటే ఎంత బావుంటుందో తెలుసా పిన్నీ – ముద్దెట్టుకో బుద్ధి వేస్తుంది.'' అన్నది మెరిసే కళ్ళతో చూస్తూ.

''ఏయ్ లలితా ! అక్కడ ఏం చేస్తున్నావ్! ఈ పావలా తీసుకెళ్ళి, రోడ్‌మీద దుకాణంనుంచి కొత్తిమీర, కరివేపాకు పట్టుకురా'' అన్నది యశోదమ్మ, లలితను చూస్తూ.

యశోదమ్మ చేతిలోని పావలాను అందుకొని లలిత రోడ్‌మీదకు పరుగు పెట్టింది–''జాగర్తగా నెమ్మదిగా వెళ్ళు'' అంటూ వెనకాలనుంచి యశోదమ్మ హెచ్చరిస్తూవుండగా. వెంకటరామయ్యగారు తన యింటిముందువున్న చెత్త కుప్పకు నిప్పుపెట్టగా, వాళ్ళ ఆఖరి కుర్రాడు గోపాలం అక్కడే కూర్చుని, చెత్త అటుయిటు ఎగరకండా, మంటలోకి తోస్తున్నాడు.

''ఒరేయి వెధవా జాగర్త! ఒళ్ళు అంటించుకుంటే చంపేస్తాను. దూరంగా వుండు''అంటూ లోపలికి వెళ్ళారు.

''ఏం చేస్తున్నావ్ లక్ష్మి ! ఎండ కాగుతున్నావా ? నాలుగు రోజులయ్యింది సూర్యుడి మొహం చూసి. అన్నట్లు 'టీ' పెట్టాను. ఓ గుక్క త్రాగివెళ్ళు.'' అన్నది లక్ష్మిరాజ్యం వైపు నాలుగడుగులువేసి ఆప్యాయంగా యశోదమ్మ.

''ఇంకాస్సేపట్లో భోజనం చేస్తాంగా యిప్పుడు మళ్ళా 'టీ' ఎందుకమ్మా ?'' అన్నది లక్ష్మిరాజ్యం.

''నేను భోజనం చేస్తాగా ! వెచ్చగా వుంటుందని పెట్టాను. రా! కొద్దిగా తాగుదువుగాని.'' అంటూ ప్రక్కనేవున్న తన యింటికి రెక్కపట్టుకుని పిల్చుకుని పోయింది యశోదమ్మ.

''లలితతో నాకు పెద్ద దిగులు వచ్చిపడిందమ్మా లక్ష్మమ్మ తల్లీ ! అది యింట్లో వుందంటేనే భయం భయంగా వుంటోంది. 'సిరాబుడ్డిని అలమారలో జాగర్తగా పెట్టవే' అంటే, ఠపీమని జారవిడిచేస్తుంది. మొన్న 'నల్లా' దగ్గర స్టీలు బిందెను పెట్టిరావే అంటే, బిందెను అమాంతం ఎత్తి క్రింద పడేసింది. దాంతో ఎట్లా బ్రతకాలో అర్థంకాకుండా వుందమ్మా.'' అంటూ గ్లాసుతో 'టీ' తెచ్చి యిచ్చింది.

''దానిదేముందిలే. చిన్నతనం కదా ! కొన్నాళ్ళుపోతే దానికీ తెలిసివస్తుంది. జాగర్తగా వుంటుంది.'' అన్నది లక్ష్మిరాజ్యం అనునయంగా.

''ఏమోనమ్మా ! వంట నేర్పించమని రోజూ నా ప్రాణాలు తోడేస్తోంది. అది వంటయింట్లోకి వస్తావంటేనే నా ప్రాణాలు 'బితుకు బితుకు' మంటున్నాయి'' చెప్పింది యశోదమ్మ.

''వంటలూ వార్పులూ యిప్పటినుంచీ ఎందుకులే. అవ్వటానికి పిల్ల వుత్సాహవంతురాలే! తెలివికలది కూడాను. ఎటొచ్చీ–'' అన్నది 'టీ' త్రాగుతూ లక్ష్మి రాజ్యం.

''అవును. తెలివితేటలు బాగానే వున్నాయి. అయితే నమ్మి, ఏ పనీ దానిమీద వదలడానికి వీల్లేదు. ఇందాక చూడరాదూ–చెత్తబుట్టను బయట గుమ్మరించి రావే అంటే–'' అంటూ నవ్వేసింది యశోదమ్మ.

ఇంతలో బయటనుంచి పిల్లలు గొడవగా కేకలు పెడుతూండటం విన్పించి, 'టీ' త్వరత్వరగా త్రాగేసి, లక్ష్మిరాజ్యం గబగబా బయటకు వచ్చింది. ఈదురుగాలి పిచ్చిగా వీస్తోంది.

వెంకటరామయ్యగారి యింటి ముందు పిల్లలంతా గుమికూడి ఖంగారు పడిపోతున్నారు. ''పిన్నీ ! గోపీగాడి లాగు అంటుకుంది పిన్నీ! లాగూ అంటుకుపోతూంది'' అంటూ వో కుర్రాడు కేకలు వేస్తున్నాడు. చుట్టుపట్ల పెద్దవాళ్ళు ఎవ్వరూలేరు. లక్ష్మిరాజ్యం వక్కపరుగులో గోపీని పట్టుకుని ప్రక్కనే వున్న పచ్చికలో పడవేసి వాడిని అటుయిటు దొర్లించింది. యశోదమ్మ వచ్చి గోపీగాడి పేంటును మోకాళ్ల వరకు లాగి పరిశీలనగా చూసింది. పేంట్ ఒక వైపు అంటుకుపోయింది. అక్కడక్కడ పిక్కల మీద బొబ్బలు ఎక్కివున్నాయి. గోపీగాడు వెక్కి వెక్కి ఏడుస్తున్నాడు.

''ఏమిటి ? ఏమయ్యింది ?'' అంటూ యింట్లోనుంచి వెంకట రామయ్యగారు బయటి కొచ్చేరు ఆశ్చర్యంగా.

''పిల్లలంతా మంట చుట్టూ చేరి ఎగురుతున్నట్లున్నారు. గోపీగాడి పేంట్ అంటుకుంది. ఆర్పేసేంలెండి. అక్కడక్కడ కాలికి బొబ్బలెక్కాయి. లోపలకు తీసుకెళ్ళి మందేమైనా వుంటే రాయండి.'' అన్నది లక్ష్మిరాజ్యం.

''ఇవ్వేళ లేచిన వేళమంచిది. వెధవలు, చెప్పినమాట వినరు కదా...నడవరా లోపలకు'' అంటూ గోపీని లోపలకు నడిపించుకుంటూ, యింట్లోకి వెళ్ళిపోయేరు వెంకట్రామయ్యగారు.



# భయం ... భయం

గాలి యింకా తీవ్రంగా వీస్తూనే వున్నది. గాలికి లేచిన నెరుసులు అంత ఎత్తుకి లేచి ఎగిరెగిరి పడ్తూన్నాయి. కొన్ని తోపుడు బండి వైపు కూడా ఎగురుతూండటం అప్పుడే గమనించిన లక్ష్మిరాజ్యం, పరుగులాంటి నడకతో 'బాబూ' అంటూ తోపుడు బండి వైపు వెళ్ళింది.

తోపుడుబండి ముందుకు చేతులు చాచి వంగిన లక్ష్మిరాజ్యం నోట మాట రాలేదు. పిచ్చి చూపులు చూస్తూ క్షణంపాటు అట్లాగే నిలబడి పోయింది. తోపుడు బండి శూన్యంగా వుంది. అందులో బాబు లేడు.

"అయ్యో— నా బాబు— బాబు" అంటూ అరచింది కర్తవ్యమూఢురాలయిన లక్ష్మిరాజ్యం.

తన యింట్లోకి వెళ్లబోతున్న యశోదమ్మ అక్కడనే ఆగిపోయి— "ఏం జరిగింది లక్ష్మి! ఏమిటి ?" అంటూ త్వరితంగా తోపుడు బండి వైపు వచ్చింది.

"నా బాబు— ప్రసాద్— తోపుడు బండిలో లేడు. ఎవరు ఎత్తుకుపోయేరో ఏమో" కళ్ళ వెంబడి నీళ్ళు తిరగగా, డగ్గుత్తికతో అన్నది లక్ష్మిరాజ్యం.

"పిల్లల్ని ఎత్తుకుపోయేవాళ్ళు తిరుగుతున్నారుట. ఎవరికో పోయే కాలం వచ్చి వుంటుంది... అట్టే పోయి వుండడు... వెదుకుదాం వుండు" అంటూ యశోదమ్మ అటు యిటూ చూడసాగింది, ఎటునుంచి వెదకాలా అన్నట్లు.

వీళ్ళ ఖంగారు చూసి ఎదురుంటి అమ్మాజమ్మగారు "ఏం జరిగిందమ్మా ? ఏమయ్యింది" అంటూ తోపుడు బండి వద్దకు వచ్చేసింది.

కళ్ళనీళ్ళు తుడుచుకుంటూ, గొంతు సవరించుకుని లక్ష్మిరాజ్యం విషయం చెప్పే లోగానే, లక్ష్మిరాజ్యం ఇంటిలోనుంచి బయటకు వస్తూన్న లలిత, భయపడుతూనే చెప్పింది, "బాబును వుయ్యాలలో పడుకోపెట్టేను పిన్నీ. ఇప్పుడే నిద్ర పోయేడు."

"భడవకానా ! విన్నెవరు తీసుకెళ్ళమన్నారే? అన్నిటికీ తయారవుతావు!" అంటూ యశోదమ్మ, లలిత వీపుమీద చిన్న చరుపు వేసింది.

లక్ష్మిరాజ్యం వక్క అంగలో యింట్లోకి పరుగెత్తి హాయిగా వుయ్యాలలో నిద్రపోతూన్న బాబును చూసి, తేలికపడిన హృదయంతో వక్క నిట్టూర్పు వదిలింది. చలి తగలకండా, చక్కగా వంటెనిండా బాబుకి ఫ్లానలు గుడ్డకూడా చుట్టబడింది. చిన్నవ్వు నవ్వుకుంటూ లక్ష్మిరాజ్యం తిరిగి గుమ్మంలోకి వచ్చేసరికి, యశోదమ్మ లలిత చెవిని మెలిపెడుతూ, "అసలు నువ్వు బాబును ఎందుకు ఎత్తుకుని, లోపలకి తీసుకెళ్ళావంట ! వాళ్ళ అమ్మ హడిలిపోయి ఏం తోచక ఏడుస్తోంది ?" అంటోంది.

"నిప్పునెరుసులు గాలికి ఎగిరి తోపుడు బండి వైపు వస్తూంటే, గబగబా బాబును ఎత్తుకుని తీసుకెళ్ళి, వుయ్యాలలో పడుకోపెట్టి, ఫ్లానలు కప్పి, నిద్రపుచ్చేనమ్మా... బాబును నేను ఏం చెయ్యలేదు... ముద్దుకూడా పెట్టుకోలేదు." అంటూ చెప్పింది లలిత.

"నిప్పునెరుసులు పడ్తూంటే, బాబుకి అంటుకుంటాయని, లోపలకు తీసుకెళ్ళావన్న మాట." అన్నది లక్ష్మిరాజ్యం, లలితవైపు మెచ్చుకోలుగా చూస్తూ.

"అవును పిన్నీ. నీకు కోపం వస్తే, యింకెప్పుడూ బాబును ముట్టుకోను కూడాను." అన్నది బెదురుగా చూస్తూ లలిత.

"కోపంలేదు లల్లీ ! నువ్వు నిజంగా చాలా మంచి పని చేసేవు. నువ్వు బాబును తియ్యకపోతే, నిప్పు నెరుసులుపడి ఫ్లానలు గుడ్డ అంటుకునిపోయేది. లేకపోతే, పొగకి బాబు వుక్కిరి బిక్కిరి అయిపోయేవాడు." అంటూ లలితను ఆప్యాయంగా దగ్గరకు తీసుకుని చెప్పింది లక్ష్మిరాజ్యం.

"నాకూ అదే భయంవేసింది. అందుచేతనే బాబును త్వరత్వరగా లోపలకు తీసుకెళ్ళిపోయేను అమ్మా" అన్నది తల్లివైపు తిరిగి.

ప్రేమతో లలితని నిమురుతూ, "మా అమ్మాయి తెలివికలది. బుద్ధిమంతురాలు" అన్నది యశోదమ్మ, మొదటిసారిగా తన కుమార్తెని మెచ్చుకుంటూ.

"నువ్వు బాబును జారవిడుస్తావేమోనని భయపడలేదా లల్లీ" అని అడిగింది లక్ష్మిరాజ్యం, తనలో ఏవేవో ఆలోచనలు ముసరగా.

"ఊహు. అట్లాంటి భయమేం వెయ్యలేదు. ఎవరైనా వెనకనుంచి 'పడేస్తావు, పడేస్తావు' అని భయపెడితే, నిజంగానే పడవేసేదాన్నేమో" అన్నది అమాయకంగా లలిత.

యశోదమ్మ అమాంతంగా ముందుకు వంగి, లలితను ప్రేమతో ముద్దుపెట్టుకుని, 'నా తల్లిని స్వతంత్రించి ఏ పనినైనా నేనసలు చెయ్యనిస్తేగా ! అన్నిటికీ భయపడి, దానిని భయపెట్టేసేదానిని. తప్పంతా నాదే అసలు" అంటూ, 'వస్తానమ్మా లక్ష్మి!' అని చెప్పి, మళ్ళీ కుమార్తెవైపు తిరిగి, "రా! లల్లీ ! ఇవ్వేళ చపాతీలు ఎట్లా చెయ్యాలో దగ్గిరుండి చేసి చూపిస్తాను. నేర్చుకుందువుగాని. రా." అంటూ లలిత చేతిని మృదువుగా తన చేతిలోనికి తీసుకుని, యింటివైపు నడచింది యశోదమ్మ.

వాళ్ళు వెళ్ళిన దిక్కే చూస్తూ, "భయపెట్టకుండా ప్రేమతో నేర్పితే, పిల్లలు నేర్చుకోలేనిది ఏముంది గనక ?" అనుకున్నది లక్ష్మిరాజ్యం. ★

# 67 ఏళ్ల గజ ఈతగాడు!

67 సంవత్సరాల యువకుడు, వుత్సాహవంతుడూ గుళ్ళపల్లి సూర్యనారాయణ 15వ తేదీ సాయంత్రం 5 గంటలనించి 16వ తేదీ సాయంత్రం వరకూ కృష్ణానదిలో ఏకబిగిన ఈతకొట్టి క్రొత్త రికార్డు సృష్టించారట. కేవలం తేనె, పాలు మాత్రమే తాగుతూ ఒక్క నిముషం కూడా ఆగకుండా 24 గంటల సేపు ఈతకొట్టారటీయన. 1944 నుంచీ ఈయన ఈతలో చాలా రకాల, రకరకాల బహుమతులు అన్ని స్థాయిలలోనూ గెల్చుకున్నారట.

## చేపలను తింటె అంగ వైకల్యం !

విష పూరిత రసాయన పదార్థాలను తినిన చేపలను తిన్నందువల్ల కర్ణాటక షిమోగా జిల్లాకు చెందిన ఓ వూళ్ళో,చాలామంది అంగ వైకల్యానికి గురి అయ్యారట. మొదట్లో యిదేజబ్బో డాక్టర్లకూ అంతు దొరకలేదట. నీళ్ళల్లో చచ్చి పడున్న చేపలను వీరు తిన్నట్టు తెలిసి, ఆ చేపలను పరీక్షిస్తే తేలిందటిది. ఆరువందల మంది స్త్రీ పురుషులీ కొత్త జబ్బు వాత పడ్డారట.

## పచ్చిమిరపకాయ పనితనం !

రోజూ క్రమం తప్పక వో మిరపకాయని (పచ్చిమిరపకాయ) కరుక్కు పరుక్కున నమిలి తింటే అది దంతాలకు చాలామంచిదని దంత జ్ఞానులన్నారట. ఈ విధంగా రోజుకో పచ్చి మిరపకాయ తినడంవల్ల దంతాలకూ, పళ్ళకేగాక గుండెక్కూడా చాలా మంచిదని విజ్ఞులు విన్నవించారట.




# షాలోక్షుని డైరీ

## చంద్రకళల ప్రభావం !

పురుషుని సెక్సోత్సాహము చంద్రకళలననుసరించి మారుతుందని, పౌర్ణమినాడది చాలా హెచ్చుగా వుంటుందని వెస్ట్ బెర్లినుకు చెందిన డాక్టరు హిల్మర్ హెకర్ట్ అన్నారట. పురుషులలో చాలామందికి సెక్సోత్సాహము పౌర్ణమినాడు వుప్పెనగా వస్తుందని, అది ఆడవారు తట్టుకోడం కష్టమని కూడా అన్నారట. పౌర్ణమినాడు సుష్టుగా భోంచేసిన పురుషుడు వెంటనే గనుక నిద్రపోతే, చంద్రుడు బాగా పైకొచ్చాక వున్నట్టుండి నిద్రలేచి, ఏగిరి రాక్షసుడిలా సెక్సోత్సాహంతో తన భార్యమీద విరుచుకుపడతాడని, కామోద్రేకానికి చంద్రునికి అవినాభావ సంబంధం [ఈ మాట రైటేనా] వున్నదనీ అన్నారట. దేశంలో మానభంగాలు ఎంచి చూస్తే, వాటిలో చాలా కేసులు పౌర్ణమి నాటివిగా తేల్తాయని కూడా ఆ డాక్టరన్నారట– మనోళ్ళలనాడే అనలేదా ఈ విషయం !

## పరుగెత్తడంలో ప్రథమ స్థానం !

చిరుతపులి పరుగెట్టినంత వేగంగా ప్రపంచంలో ఏ ప్రాణీ పరుగెట్టలేదట. డియ్యాం డియ్యాం అని గాలిలో తేలుతూ పరుగెట్టే లేడిని యిది ఛట్టున పట్టగలదట. ఆఫ్రికా, ఏషియా అడవులకు చెందిన చిరుతపులుల కాళ్ళు ఒకింత పొడవుగా వుండి సన్నంగాకూడా వుంటాయట. సామాన్యంగా యిది గంటకు 75 మైళ్ళ వేగంతో పరుగెట్టగలదట. వొళ్ళు మండితే మరో పది మైళ్ళెక్కువే పరిగెట్ట గలదట మరి వేగాన్ని హార్స్ పవర్‌తో పోల్చడంకన్నా ఛీటా పవర్‌తో పోల్చరాదా !

## తీరని కోరికతో ఆత్మహత్య !

సేలం జిల్లా పనమరత్తుపట్టి గ్రామవాసి 22 ఏళ్ల జీవానందం కోటేశ్వరుని గారాల బిడ్డట. అతనికి భాగ్యరాజాలా కథ, వచనం రాసి, తానే నటించి, తానే డైరెక్టు చేయాలనే కోరిక కలిగిందట. దాంతో కథా వచనాలు కుప్పలు తెప్పలుగా రాసి పడేసి, అవన్నీపుచ్చుకుని మద్రాసు వెళ్లి అందర్నీ, ఎందర్నో యాచించి ఫలితం లేక, మనస్సు విరిగి, తానుంటున్నా హోటలు రూములోనే ఆత్మహత్య చేసుకున్నాడట.

## విశ్వవిద్యాలయంలో పదిఏళ్ల విద్యార్థి !

బెల్‌గ్రేడు విశ్వవిద్యాలయంలో ఎమ్మే విద్యార్థులతోపాటు మియోడ్రగ్ మిషియో అనే 10 ఏళ్ళ కుర్రాడు క్లాసులకు వెళ్తున్నాడట. వారితోపాటు లెక్కలు, ఎలక్ట్రానిక్స్ అన్నీ చదువుతున్నాడట. ఇతను ఎలిమెంటరీ స్కూల్నొంచి నేరుగా ఆ క్లాసుకు వెళ్ళిపోయాడట. ఇతను తన ఏడో నెలలోనే ఎంచక్క మాట్లాడాడట. రెండో ఏట చేతికి ఏ పుస్తకమిచ్చినా ఛడామడా చదివవతల పారేసేవాడట. ఇతను కెమెస్ట్రీ, ఫిజిక్సులలో అధ్యాపకులకే చెప్పేంత తెలివి చూపుతున్నాడట. ఈతని విశేష మెదడు శక్తికి వైద్య విజ్ఞాన మబ్బురపడి, కారణాన్వేషణా కార్యకలాపాల్లోకి దిగిందట.




## అబలపై అత్యాచారం, హత్య!?

తమిళనాడు చింతామణియారుకు చెందిన 24 ఏళ్ళ సుబ్రహ్మణ్యం తన భార్య 20 ఏళ్ల కళావతిని, పసిపిల్లను యింట్లో వదలితాను రెండో ఆట సినిమాకి వెళ్ళి తిరిగొచ్చి తలుపెంత బాదినా ప్రయోజనం లేకపోయేసరికి బల ప్రయోగం చేసి, తలుపు విరక్కొట్టి లోపలకు వెళ్ళేసరికి కళావతి కూర్చున్న పోజులో గోడ కానుకుని చనిపోయి వుందట. ఆమె బుగ్గలమీదా, చేతుల మీదా గాయాలున్నాయట. జాకట్టు పూర్తిగా చిరిగి, స్తనాలు బయటకు లాగినట్టుగా వుందట. చీర తొడల పైవరకూ లాగేనుందట. స్తనాలమీదా, తొడలమీదా, పెదిమల మీదా గాయాలున్నాయట. పోలీసు పరీక్షలో ఆమె నెవరో బలాత్కరించి అనుభవించి ఆనక చంపేసి వుండాలని తేలిందిట– అయితే తెల్సినవాడై యుండచ్చా ! ★








( గత సంచిక తరువాయి )

రెండు నెలలు హాస్పటల్‌లో ఉండి, ఒళ్లు, యిల్లు గుల్ల చేసుకుని మతిలేని పసివాడిలాంటి చెట్టంత మగాణ్ణి, యింటి భారం మొయ్యవలసిన భర్తను తీసుకొని జీవచ్ఛవంలా అడుగుపెట్టింది యింట్లో భైరవి. యింట్లోకి రాగానే తల్లిలా ఆదరించిన చిన్నకూతుర్ని కొడుకులా ఆప్యాయంగా పలకరించిన రాజాని పట్టుకొని, భర్త స్థితికన్నా ఎక్కువ వేదన కలిగించే పెద్ద కూతురు, కొడుకుల ప్రవర్తనకు కృంగిపోతూ మనస్ఫూర్తిగా ఏడ్చింది.

ఆ రాత్రి క్లబ్బునుండి తాగి వచ్చిన కొడుకు, సినిమాకు వెళ్లి వచ్చిన కూతురు...యధాలాపంగా "వచ్చేసారా?" అని పలకరిస్తే... పాతికేళ్లుగా వంటింట్లో మగ్గిపోతూ, అతిథి అభ్యాగతులను ఆదరిస్తూ అదే కొండంత తృప్తిగా కాలం వెళ్లబుచ్చిన ఆ తల్లికి తనెక్కడ పొరపాటు చేసిందో అర్థంకాలేదు. ఆ అయోమయం నుండి తేరుకోక ముందే వెళ్లిపోయారిద్దరూ పనయిపోయినట్లు. ఆ రోజు నుండి మతిలేని తండ్రి బాధ్యత కూడా ఆరతి మీదే పడింది.

ఏం మాట్లాడబోయినా..."అబ్బ యింకేం పనిలేదేమిటమ్మా, నేను ఉద్యోగం అదీ చెయ్యలేను, అయినా నాకెవడిస్తాడు? ఏదన్నా బిజినెస్ చేద్దామనుకొంటున్నాను. ప్రయత్నిస్తున్నాను. అయినా యిద్దరూ కలసి సంపాదించినదంతా చుట్టాలు, మర్యాదలు అంటూ ధారపోసారు. యిపుడు హాయిగా ఎంజాయ్ చెయ్యవలసిన వయసులో సంపాదన, బాధ్యతలు అంటూ నా నెత్తిన రుద్దుతున్నావ్! నా యిష్టం వచ్చినట్లు ఉంటాను. లేదా చెప్పపోతాను ఎక్కడికన్నా, నా వాటా నాకిచ్చేస్తే..."

"చంద్రం... చంద్రం... నీకిది న్యాయం కాదురా? నన్నిలా చంపకురా పెద్దవాడివి ... తండ్రి పరిస్థితి అలా ఉంటే నీవిలా మాట్లాడ్డం న్యాయం కాదురా! ఆయన సంపాదించి పోసినన్నాళ్లు ... ఒక్కనాడు... ఒక్కనాడు నీవు కోరింది కాదన్నార్రా? ఒక్కనాడు నీకు లేదన్నార్రా? నువ్వాడింది ఆట, పాడింది పాటగా చేసుకొచ్చారు. నీ వెనక యిద్దరాడపిల్లలు ఉన్నారు, వాళ్ల బాధ్యత నీది కాదూ ... నాయనా చంద్రం... నీ సరదాలకి అడ్డురాను.. కానీ యిలా మాట్లాడకు నాన్నా.. నాకున్నది నీ వొక్కడివే... ఒక్కడివే ..." బోరుమంటూ వెళ్లిపోయింది భైరవి.

"కన్నారు! ఎవరి కోసం పెంచుతారు. అందరూ పెంచుకోవడంలే. అదీ గొప్పగా చెప్పుకోవడం!" గొణుక్కుంటూ చెప్పులేసుకొని పైకి వెళ్లిపోయాడు చంద్రకాంత్.

పరిస్థితి అర్థం చేసుకొన్న భైరవి భగవంతుడి మీద భారం వేసి మౌనాన్నాశ్రయించింది. ఆ సమయంలో రాజా, ఆరతిల చనువు శంకించడం, నిర్లిప్తంగా ఉండలేక ...

"ఆర్తి... రాజా మనకు తెలిసినవాడేకావొచ్చు...కానీ పరిస్థితులు బాగులేనపుడు ఎవరు ఎక్కడ ఉండాలో అక్కడ ఉంటే బాగుంటుంది. పెద్దదాన్ని చూస్తూ ఊరుకోలేక చెప్పాను. మీకు నేను చెప్పేంత దానను కాను... కానీ తల్లి మనసు ఊరుకోదు..." అంటూ నిష్ఠూరమాడుతుంటే ఆరతి భరించలేకపోయింది. ఆ రోజే రాజా వస్తే —

"రాజా! మన చనువు అమ్మ అపార్థం చేసుకుంటుంది. ఆమెకీ మాత్రం అన్నా మనశ్శాంతి లేకపోతే ఎలా! అందుకే నువ్వే స్వయంగా చెప్పు." అంది.

"అత్తయ్యగారూ! మీరు అనవసరంగా మనసు పాడుచేసుకోకండి. ఆరతి నా భార్య. సరేనా? మీకు కులం, మతం పట్టింపు ఉన్నా, ప్రస్తుత పరిస్థితులలో అవన్నీ మాకోసం వదులుకోండి. చిన్నప్పటి నుండి మీచేతి వంట తింటూనే ఉన్నాను. మీలో ఒకడిగా నన్ను కలిసిపోనివ్వండి. ఆరతికీ సమయంలో ఆప్తుడిగా నన్నాదరించనివ్వండి. మీరు అంగీకరిస్తే చాలు. నా చదువు అయిపోగానే ఉద్యోగం వచ్చిన వెంటనే ఆరతి నాదవుతుంది. అంతవరకు నన్ను నమ్మండి చాలు. ఈ స్థితిలో మిమ్మల్ని ఆదుకొనే హక్కు నాకివ్వండి..." అంటున్న రాజాని ఏమనాలో తోచనట్లు ఉండిపోయింది భైరవి.

"రాజా నీకన్నా ఆప్తులెవరున్నారు నాయనా మాకు. బాబూ ... నందిని పెద్దది దాని సమస్య తీర్చేస్తే ఆరతి గురించి యింక నాకే బెంగాలేదు. అది రత్నంబాబు. దాన్ని 'దారిదీపం'లా యిచ్చాడు ఆ దేవుడు. లేకుంటే ఈ చీకట్లో ఏమయ్యేదాన్నో. రాజా... మీ యింట్లో వప్పుకొన్నారా? వప్పుకొన్నా ఒప్పుకోకపోయినా, భయం, స్వార్థం నన్ను అడిగించేస్తోంది నాయనా, నువ్వీమాట మీద ఉండి దానికో దారి చూపించు... యిక నువ్వేనాకు, దానికి, ఈ యింటికి ఆధారం..." అంటూనే ఏడ్చేసింది భైరవి.

ఆరోజు నుండి తల్లి అంగీకారం లభించడంతో ఆ యిద్దరి స్నేహం సెలయేరులా సాగిపోతూనే ఉంది. అది నిర్మలంగా సాగిపోయే ప్రణయ వాహిని గాని, వయసు మోహం చేసే వరద సందడి కాదు. ప్రణయం పరిణయంతో స్థిరత్వాన్ని పొంది జీవితానికి నిర్వచనమిస్తాయని అనుభవం నేర్పిన పాఠం, బాధ్యతల బరువు, సంస్కార లోపం లేని బుద్ధి ఆ యిద్దర్నీ నిర్భయంగా ముందుకు నడిపిస్తోంది. ఆ కలయిక కోసం ఎదురు చూడ్డంలో ఆనందం, తమ యిద్దరి కోసం నిర్మించుకోబోయే చిన్ని ప్రపంచం కోసం ఆశగ ఎదురు చూస్తున్నారు!

"రతి...రతి" అని మూగగా కలవరిస్తున్న హృదయం స్వప్న లోకంలో విహరిస్తోంది. ఢబ్...ఢబ్‌మన్న తలుపు చప్పుడు రాజాని యిహానికి లాక్కు వచ్చింది. చటుక్కున లేచి తలుపు తెరిచాడు. చెదరిన గతాన్ని మరచి తాగి వచ్చిన మోహన్ని తీసుకు వెళ్లి పడుకోబెట్టాడు. అప్రయత్నంగా టైము వంక చూస్తే నాలుగును సూచిస్తూ 'తెల్లవారబోతోంది' అని గుర్తు చేసింది. జ్ఞాపకాల మధుర స్మృతులతో మత్తెక్కిన మనసుకి, శరీరాన్ని అదుపులో పెట్టుకోవడానికి బాత్‌రూమ్‌కి నడిచాడు రాజా. కాలకృత్యాలు ముగించుకొని పుస్తకాలు ముందు వేసుకొన్నాడు. చదువే అతనికాధారం. ఆ చదువు పూర్తయి తన కాళ్లమీద

**జరిగిన కథ—2 :** నందిని, ఆరతి, చంద్రకాంత్ భైరవి, మాధవరావు దంపతుల సంతానం. ఆరతి, రాజాల స్నేహం చూస్తే నందినికి అసూయ. మేనల్లుడు మోహన్‌కు స్నేహితుడు రాజాతో తమ బాధలని చెప్పుకొంటుంది భైరవి. రాజాకు గతం గుర్తుకు వస్తుంది. రెండు చేతులా సంపాదిస్తున్న మాధవరావుగారికి ఏక్సిడెంట్‌లో మతి చలిస్తుంది. ఆ పరిస్థితులలో ఆరతికి ఆమె తల్లికి రాజా సహాయంగా ఉండడం కొండంత ధైర్యాన్ని ఇస్తుంది. రాజా, ఆరతి ప్రేమించుకుంటారు. రాజా ఆమె కోసం జీవితాంతం వేచివుంటానని మాటిస్తాడు.

తను నిలబడితేనే మరొకరికాధారం కాగలడు. కాస్సేపటికి ఆలోచనలు మరచి చదువులో లీనం అయిపోయాడు.

* * *

కాలం, తానుఎట్టి మార్పు చెందక, మనుష్యుల జీవితంలో అనేక మార్పులు చేస్తూ, ఆ ఫలితాలను వాళ్ల ఖర్మలకే వదిలేసి నిర్వికారంగా సాగిపోతూనే ఉంటుంది. ఆరతి ఇంటర్ ఫస్టియర్ పరీక్షలు, రాజా ఫోర్త్ యియర్ పరీక్షలు వ్రాసారు. శలవులిచ్చారు. యింటికి వెళ్లబోతూ రాజా వచ్చాడు సామాను సర్దుకొని. ఆరోజు యిక్కడ గడిపి మర్నాడు వెళ్లడం అలవాటు.

సూట్ కేస్, బెడ్డింగ్ పట్టుకుని ఆటోదిగి గేటు తీస్తున్న రాజా... వీధిలోకి వినిపిస్తున్న కేకలకు వడివడిగా లోపలికి వచ్చాడు.

మాధవరావుగారు తనకేమి పట్టనట్లు కాగితాలు ముందేసుకొని ఆడుకొంటున్నారు.

"అమ్మా యిస్తావా లేదా ? దీని పెత్తనమేమిటి మధ్యన. ఈ యిల్లు, ఆస్తి అన్ని నావి. నాలుగుతంతే పైకి పోవాల్సింది...దీనికి పెత్తనం యిచ్చి నన్ను అవమానిస్తున్నావు. నువ్విచ్చిన అలుసుకాదూ..." చంద్రకాంత్ అరుస్తున్నాడు. ఆరతి నిర్లక్ష్యంగా సోఫాలో కూర్చుని చూస్తోంది.

"అన్నయ్యా నువ్వెంత అరచినా ఆ డబ్బు నీ కివ్వను. రేపు నాన్న మందులు కొనాలి, యింట్లోకి సామాను తేవాలి, నువ్వొచ్చేసరికి భోజనం అమర్చాలిగా ... యింక బాంక్ బాలన్స్ నిల్లు. ఈ పదిరోజులు గడిచాక, నువ్వన్నట్లు అంతా పైకి పోవాల్సిందే. ఒక్కరోజు యింట్లో ఎట్లా గడుస్తుందో ఆలోచించావా ? నీ సరదాలు నీవి, మా సంగతి ఆలోచించావా ? పైగా డబ్బుకోసం పేచి... ఛీ ఛీ సిగ్గులేదూ, చెట్టంత మగాడివై ఉండి బాధ్యతల్లేకుండా తిరగడానికి. యింటి బాధ్యత చూసేది నేను. నేను ఎలాచేస్తే అలాగే జరుగుతుంది. నువ్వు గంతులు వేస్తే కుదరదు. నీకు యిష్టంలేకపోతే సంపాదించుకు తిను. ఈ యింటితో నీకేం సంబంధం లేదు..."

ఆరతి మాటలు నోట్లో ఉండగానే...

"నోర్మూయ్" అంటూ చంప ఛళ్లు మనిపించాడు. ఒక్కదుటన రాజా లోపలికివెళ్లి చంద్రకాంత్ చెయ్యి పట్టుకొన్నాడు. తిరస్కారంగా అన్న వైపు చూసి గిర్రున తిరిగి లోపలికి పారిపోయింది ఆరతి.

"కాంత్ ఏమిటిది ? నువ్వు చెయ్యాల్సిందీపనికాదు. అమానుషంగా ప్రవర్తించకు. సిగ్గులేదూ, లోటు లేకుండా యింటికి తిండి సమకూరుస్తున్నందుకా నీ చెల్లికి ప్రతిఫలం... ఆ చెయ్యెత్తి నీ పెద్ద చెల్లికి ఈ బహుమానం యిస్తే... ఆ రోజు నువ్వు సరైన మగాడివౌతావు." ఆవేశంగా అంటున్న రాజాను –

"నోర్మూయ్ ! నువ్వెవిడివి ఈ యింటి విషయాల్లో తలదూర్చడానికి. హద్దులుమీరి ప్రవర్తించకు. అసలు ఈసారీ గడప తొక్కావంటే కాళ్లు విరగ్గొడతాను. నీ అలుసు చూసుకొనే అదలా మితిమీరిపోతోంది. చూస్తాను దాని ఆటలు ఎలా సాగుతాయో... అమ్మా నువ్వుండి చూస్తూ... నన్నిలా అవమానిస్తావ్ కదూ ! ఈ రోజుతో నీకూ, నాకూ సంబంధంలేదు... నాకు రావల్సింది ఎలా రాదో చూస్తాను... వస్తాను..." అంటూ రాజాని తోసేసి వెళ్లిపోతున్న కొడుకుని చూస్తూ శిలలా నిల్చుంది భైరవి. కొడుకుమీద మమకారంగాని, వెళ్లిపోతున్నాడన్న భయంగాని, కూతురు అన్న మాటల ప్రభావంగాని ఏమి పట్టనట్లు శిలలా నిల్చునే ఉంది. ఆవిడ దృష్టి 'రేపు' మీద ఉంది. అది అంధకారంగా ఉంది. ఆ నిశీధిలో నిశ్శబ్దంగా లీనమైపోయిన మనసు ఏ బెదిరింపులకు, ఏ పనులకు 'నేనున్నానంటూ' స్పందిస్తుంది ?

"అత్తయ్యా ! మీరు వెళ్లి విశ్రాంతి తీసుకొండి. మీరేం బాధపడకండి... ఎలా జరగాలో అలా జరుగుతుంది. కాంత్ ఎక్కడికి వెళ్లడు. మీకేం భయంలేదు..." అని నచ్చచెప్తూ ఆమె చెయ్యి పట్టుకొంటే... ఒక్కసారి నిర్లిప్తంగా చూసి మెల్లగా వెనుదిరిగి వంటింటి వైపు నడిచింది భైరవి.

ఆవిడటు వెళ్లగానే ఆరతిని వెతుకుతూ గదిలోకి వచ్చాడు. ఏ గదిలోనూ లేదు. పెరటి వసారాకి అటుప్రక్క మూలగా తోటలోకి దారి తీస్తున్న మెట్లపై తల వాల్చి కూర్చుంది. ఆ కళ్లు అవిరామంగా వర్షిస్తున్నాయ్. హృదయానికి హత్తుకొని ఓదార్చాలన్న కోర్కెను అదిమిపెట్టి తలమీద చెయ్యి వేస్తూ "రతీ" అని పిలిచాడు. ఆ పిలుపు చాలు ఆమె గుండెల ఘోషతో రగుల్కొంటున్న అగ్నిని ఆర్పడానికి. చివ్వున తలెత్తి చూసింది. రోషంతో, అవమానంతో ఎర్రబడ్డ ఆ కళ్ల నుండి కారుతున్నవి కన్నీళ్లు కాదు. మలినమైన చంపల్ని పునీతం చేస్తున్న మానస సరోవరపు నీళ్లు.

"రతి...నువ్వు చేసింది రైటే. నీకీ ధైర్యం ఎల్లకాలం ఉండాలని, నీ వలన ఈ యిల్లు పవిత్రతను సంతరించుకోవాలని మనస్ఫూర్తిగా



కోరుకొంటున్నాను. నీ బాధ్యత, బరువు నీకా మాత్రం స్థైర్యాన్నిస్తేగాని ముందుకు పోలేవు. చాలా మంచి పని చేసావు. యిక్కడ కావలసింది అనుబంధం కాదు ఆలంబన..." అతని మాటలు పూర్తికాకుండానే,

"రాజా... నా దగ్గరున్న ఈ కాస్త 'డబ్బు అయిపోతే ... అయిపోతే ..." ఆపైన చెప్పలేనట్లు ఆగిపోయింది.

"రతీ... ఛ...ఛ... యింత బేలవైతే ఎలా ? ఏదో మార్గం ఆలోచిద్దాం భయపడకు. లే... లేచి ముందు మొహం కడుక్కో... అలా కాస్సేపు వెళ్లివద్దాం..." అంటూ లేవనెత్తాడు.

రామకృష్ణా బీచ్ దగ్గర దిగి, రోడ్డు వెంబడి నడుస్తూ పాండురంగ దేవాలయానికి వెళ్లారు. నిర్మలంగా, నిశ్చలంగా జరుగుతున్న ఘోరాలకు శిలా సదృశుడైన ఆ మూర్తిలో తమకులేని శాంతిని

# జీవన సరళిలో తీయని రవళి

వెతుకుతూ కళ్లు మూసుకొన్నారు. ప్రసాదం అందుకొని వెనుదిరిగి వచ్చి ఓ ప్రక్కగా యిసుకలో కూలబడింది ఆరతి. ఆమె ప్రక్కన తనూ చోటు చేసుకున్నాడు రాజా! ఎన్నోసార్లు ఎన్నెన్నో తీయని కబుర్లకాలవాలమైన వాళ్ల హృదయాలు సముద్రునితో పోటీ పడుతూ ఘోషిస్తున్నాయి.

"రాజా...నిన్ననే బాంక్‌లో ఉన్న రెండువేలు తెచ్చేసాను. యింక నాన్నగారి సంపాదనగా యిల్లు, అమ్మ, మేము ఉన్నాము. అక్క యింక చదువుతుంది. ఆ డిగ్రీ కంప్లీట్ చేస్తుందన్న నమ్మకం నాకు కలగడం లేదు. యిక పోతే పెళ్లి. మా అత్తయ్యగాని, బావగాని ఈ సంబంధం చేసుకొంటారనుకోవడం తెలివితక్కువ తనమే అవుతుంది. యింకెవరున్నారు? రాజా మీ నాన్నగారితో చెప్పి ఏదో నువ్వే చూస్తే...అమ్మకు, నాకు పూర్తి బాధ్యత తీరిపోయినట్లే...యిల్లు అమ్మేసి అన్నా దానికి పెళ్లి జరిపించేస్తాను..."

"యిల్లు అమ్మేస్తావా?"

"ఓహ్...ఏం నాకు ఆస్తి ఉండదనా...నీకూ భాగం ఉండదనా?"

"ఆర్తీ!" అప్రయత్నంగా పలికిందతని గొంతు. ఆ గొంతులోని వేదన ఆరతిని విచలితను చేసింది.

"సారీ! రాజా! సారీ... ఏం చేద్దాం చెప్పు. నువ్వెలా చెప్తే అలా చేస్తాను. నా ఆలోచనల్లో, ఆవేదలో భాగం పంచుకొని నన్నూరడిస్తావనే ఆశ నన్ను ధైర్యంగా ఈ సమస్యల నెదుర్కోమని పురికొల్పుతుంది. చెప్పు రాజా..." పిడికిళ్లతో యిసుక ఎత్తిపోస్తూ అంటున్న ఆరతి ఎదురుగా రత్నగర్భుడిలా అనిపించింది.

"రతి... నందిని విషయం నేను చూస్తాను... కానీ... నీకెలా చెప్పాలో తెలియడంలేదు. ఎవరో ఒకబ్బాయితో చాలా చనువుగా తిరగడం చూసాను. వీలయితే వివరాలు తెలుసుకొంటే అదే సెటిల్ చెయ్యొచ్చని నా ఉద్దేశ్యం... నువ్వు, నేనూ అడిగితే ఎట్లాగూ చెప్పదనుకో. మీ అమ్మగారిద్వారా అడిగించు..."

"అవును... ఆ విషయం నాకూ చూచాయగా తెలుసు. దాని ఫ్రెండు అన్నకి ఫ్రెండ్ అతను. ఎలాంటివాడో తెలియదు. ఆ విషయం సరే. ఈ డబ్బు అయిపోతే ఏం చెయ్యడం ?"

"ఒక విషయం చెప్పనా ? రతీ... యింటిని రెండు భాగాలుచేసి అద్దెకు యిస్తే ఒక భాగంలో మీరు ఉండొచ్చు. ఎంతోకొంత వస్తుంది కదా..."

"అవును. గుడ్ అయిడియా... ఆపైన నేను ఏదన్నా జాబ్ చేస్తాను." ఉత్సాహంగా అంది ఆరతి.

"ఏమిటి నువ్వా ? ఈ యింటర్ ఫస్టియర్‌కి, ఏ పై లోయర్‌కి 'జాబ్' దొరకడానికి వంకాయలనుకొన్నావా, డబ్బులు పారేస్తే దొరకడానికి" తీవ్రంగా అంటున్న అతన్ని చూసి బెదిరిపోయింది.

"రతీ! ఏది ఎలాగున్నా. ఏమైనా నువ్వు గ్రాడ్యుయేటివి కావాలి. నెక్స్టుయియర్ నా చదువు అయిపోతుంది. నీది యింటర్ అయిపోతుంది. నేను చదివిస్తాను నిన్ను. మనకోసం ... మన సంసారం కోసం మన సుఖం కోసమన్నా నువ్వు చదువుకోవాలి. నువ్వీ యింటి కోసం ఎంత త్యాగం చేసినా నేనేమి అనుకోను. కానీ నీ భవిష్యత్తు పాడుచేసుకొంటానంటే వప్పుకోను. నా స్వార్థం అనుకో మరేదన్నా అనుకో!" నిష్కర్షగ అంటున్న రాజాని చూసి ఫక్కున నవ్వింది.

"అబ్బ యిప్పటికి మామూలు మనిషివయావు!" తన్మయంగా చూస్తూ అన్నాడు.

ఆ యువతీ యువకుల ఆలోచనా సరళి. ఆ ప్రేమికుల తీయని కలలు, ఒకరికోసం ఒకరు పడే తపన అర్థం చేసుకొని ఆశీర్వదిస్తున్నట్లు పొంగులెత్తుతుంది సముద్రం. చుట్టు ముసురుకొన్న చీకట్లు

కర్తవ్యం బోధిస్తున్నట్లు బాహ్యరూపాలను మరుగుపరుస్తూ మసక బారింది. రాజా లేచి చెయ్యి అందించాడు. ఆ చేతిని గట్టిగా పట్టుకొంటూ లేచి నిలబడింది ఆరతి. అలా చేతులు పట్టుకొనే బస్‌స్టాపుకి వచ్చారు. ఎవరి ఆలోచనలో వారున్నట్లు మౌనంగా నిలబడ్డారు. యింటికి చేరేసరికి ఎనిమిదయ్యింది. నందిని యింకా రాలేదు. మధ్యాహ్నమనగా వెళ్ళింది ఫ్రెండింటికంటూ. ఆరతి రాగానే వంటింట్లోకి వెళ్ళి తల్లికి సహాయంగా భోజనాల కార్యక్రమంలో పడింది. తండ్రిని బుజ్జగించి ఆ కాస్త తినిపించి, తల్లికి పెట్టి ఆవిడ తిన్నాక తనకి రాజాకి వడ్డించి అతన్ని పిలవడానికి వెళ్ళింది. వెతుకుతూ వెళ్తే డాబా పిట్టగోడ దగ్గర రేఖా చిత్రంలా ఉన్నాడు రాజా!

''రాజా ! భోజనానికి రావూ!'' ఆ పిలుపులోని ఆత్మీయతకు తల్లివెంట చంటివాడిలా వెనుదిరిగి అనుసరించాడు. ఎట్లాగో భోజనం అయిందనిపించి, తల్లిని పిలిచింది ఆరతి.

''రాజా...యింటి విషయం నువ్వే చెప్పు అమ్మతో,'' అని నెమ్మదిగ చెప్పి తను వంటిల్లు సర్దడానికి వెళ్ళింది.

''అత్తయ్యా, నేను రేపు ఊరు వెళ్తాను. శలవుల్లోపల ఓసారి వస్తాను. వెళ్ళే ముందొకమాట. ఉదయం గొడవ విన్నారు కదా! ఆరతి చెప్పింది నిజమే. తన దగ్గర ఉన్న డబ్బు అయిపోతే...తరవాత ఏమిటి? అని బెంగపడుతోంది. సాయంత్రమే మాకీ ఆలోచన వచ్చింది. మరేం లేదు. ఈ యింటిని రెండు భాగాలు చేసి ఒక భాగం అద్దెకిచ్చేస్తే ఏదో కొంత వస్తుంది. ఆపైన ఏదన్నా ఆలోచిద్దాం !''

అతను చెప్పింది అంతా మౌనంగానే విన్నది భైరవి. కొంత సేపటికి... ''మీకెలా తోస్తే అలా చేయండి'' అనేసి లేచిపోయింది.

రాజా మర్నాడు కూడా ఉండిపోయి గదులను ఎలా పార్టిషన్ చేస్తే బాగుంటుందో ... ఆలోచించి ఆ గదుల్లో సామాను అంతా యివతల గదుల్లో సర్ది దానికో రూపం తెచ్చి 'టు లెట్' బోర్డు కట్టేసరికి సాయంత్రమయ్యింది. సామాను సర్దుతుండగా ఎదురుపడ్డ స్టీరియో రికార్డు ప్లేయరు, టేపురికార్డరు, రేడియో, ట్రాన్సిష్టరు—రికార్డులు, టేపులు అవ్వన్నీ పెద్ద సమస్య అయిపోయింది సర్దడం.

''రాజా స్టీరియో రికార్డు ప్లేయరు, ఈ ట్రాన్సిష్టర్స్ అమ్మేస్తాం: ఎవరికన్నా కావాలంటే చూడు. ఎందుకివ్వన్నీ వేస్టు. టేపు, రేడియో ఉంటే చాలు. అనవసరవు ఆడంబరాలు అనుభవించే స్థితి దాటిపోయింది !'' అంటుంటే గొంతు గద్గదమైంది. రాజా కూడా 'నిజమే' నన్పించింది.

ఈ హడావిడి ఏమి తెలియని నందిని రాత్రి వచ్చి గుమ్మం ముందు వ్రేలాడుతున్న బోర్డు చూసి మండిపడింది. అపుడే రాజాని ట్రెయిన్ ఎక్కించి వస్తున్న ఆరతిని చూసి మరింత రెచ్చిపోతూ ''అంతా నీ యిష్టమేనా? ఏమంత ఖర్మ వచ్చిందని యిల్లు అద్దెకిచ్చుకోవడం. వాడు సరిగ్గా యింటికి రాకపోబట్టి నీ ఆటలు సాగిపోతున్నాయ్. యిక యిదిగో ఈ మూగావిడ, ఆ పిచ్చి మనిషి వత్తాసు ఉందని విర్రవీగుతున్నావేమో! పెద్దదాన్ని నాకేం చెప్పక్కరలేదా? యింట్లో అంతా నీ పెత్తనమేనా? వాడురానీ చెప్తాను. ఏమ్మా మాట్లాడవేం? నువ్వెందుకు మాట్లాడుతావు...దాన్నిలా చేస్తూ నెత్తికెక్కించుకొంది నువ్వుకాదూ. దీనికితోడు ఆ రాజా ఒకడు...నాటకాలు వేస్తున్నారు. యింట్లో మనుష్యుల లెఖ్ఖ లేదసలు. అసలు నీకెవరిచ్చారీ అధికారం, నా గది ఖాళీ చెయ్యడానికి నీకెంత ధైర్యం?'' మీదకు వస్తూ అరుస్తున్న నందిని వంక ఛీత్కారంగా చూసింది ఆరతి.

''నందూ! ఎందుకలా గొంతు చించుకొంటావ్! యిదేకాదు యింట్లో యింకా చాలా మార్పులు వస్తాయి. యిందులో అన్నయ్య ప్రమేయంగాని నీ ప్రమేయంగాని ఏమీ ఉండదు. మీరు వయసుకి పెద్దవాళ్ళేకానీ...కేవలం వయసు ఒక్కటే చాలదు పెత్తనం చేయాలంటే. ఈ యింటి బరువు, బాధ్యత మోస్తూ పూటకు భోజనంకోసం అమరుస్తున్న దాన్ని నేను. నాకు తెల్సు కష్టసుఖాలు, ఏది ఎలా చెయ్యాలో, ఏంచేస్తే కడుపునిండా తిండి తినగలుగుతామో? యింక నువ్వు ఆవేశం తగ్గించుకొని కాస్త ఆలోచించి సహకరించు. అంతేగాని అనవసరంగా మాట్లాడి నీ అహన్ని ప్రదర్శించకు. అద్దెకివ్వకపోతే ఎలా గడుస్తుందనుకొన్నావు ? పెద్దవాళ్ళు మీరేమన్నా సంపాదిస్తున్నారా, యిల్లు ఎలా జరుగుతుందని ఆలోచిస్తున్నారా ?...''

''ఏం ఎలా జరగడమేం ? మేం ఉద్యోగాలు చేసి సంపాదించి యిల్లు గడపాల్సిన ఖర్మ పట్టలేదు. ఏం నాన్న సంపాదించిదంతా ఏమయ్యింది ? బాగున్నన్నాళ్ళు వేలకు వేలు చుట్టాలు, బంధువులు అంటూ తగలబెట్టారు. మిగిలిన ఆ బ్యాంక్ బేలన్స్ అంతా నీ స్వార్థానికి నువ్వు ఉపయోగించు కొందామనుకొంటున్నావు. అమ్మ అలుసు తీసుకొని, ఉన్నాడుగా కాబోయే మొగుడు యిద్దరూ కూడబలుక్కుని మా నోరు నొక్కుదామని చూస్తున్నారు. నాకు తేలీదనుకొన్నావా మీ వేషాలు. ఎకౌంట్స్ ఎలా తేలవో చూస్తాను. మమ్మల్ని యింట్లో కూడా ఉండకుండా చేసి యిల్లు అన్ని పడేసుకో'' ఉగ్రంగా అరుస్తున్న నందిని చెంప ఛెళ్ళు మనడంతో కళ్ళుతిరిగి అవాక్కయి నిలబడిపోయింది. తేరుకొని చూసేసరికి ఆయాసంతో వగరుస్తున్న తల్లిని 'ఏమిటమ్మా' అని మందలిస్తున్న ఆరతని చూసి ఎవరు కొట్టారో అర్థం అయ్యింది.

''ఛీ...నా కడుపున చెడపుట్టారు మీ రిద్దరూ. నందూ ఈరోజే చెప్తున్నా, చెట్టంత మగాడు యింటిని చీకటి చేసి మూలచేరిపోతే.. అంత మగాడిలా ఈ పదహారేళ్ళ పసిది నెత్తి నెత్తుకొని పూటకింత తిండితినేలా చేస్తుంది. లేకపోతే తిరుగుళ్ళు మరిగి తిండికోసం యింటికివచ్చే నీలాంటి వాళ్ళకి గుప్పెడు మెతుకులు కూడా ఉండేవికాదు. ఈ ఆస్తి, యిల్లు నాది నా యిష్టం. అదే గార్డియన్. దానిష్టప్రకారం జరుగుతుంది. మరొక్కమాట మీరావంటే పళ్ళు రాలగొడతాను. నీకీ అదుపు చిన్నపుడే నేర్పిఉంటే యిలా మాట్లాడేదానివికాదు. పెద్ద... దేనికీ నువ్వు పెద్ద ? షోకు చేసుకొని అర్ధరాత్రి వరకు మంచి, చెడ్డలేకుండా తిరగడానికా ? అనారోగ్యంతోఉన్న తండ్రిని చీదరించుకోవడానికా ? మూడు పూటలా టేబిల్‌మీద అమర్చిపెడితే తినడానికా ? దేనికీ పెద్ద ?'' ఆవేశంతో వణికిపోతున్న తల్లిని బలవంతంగా గదిలోకి లాక్కువచ్చి కూర్చోబెట్టింది. పిల్లి అనుకొని నిర్లక్ష్యంచేస్తే అది పులిలా తిరగబడితే ఏం చేయాలో తోచని యజమానిలా నిశ్చేష్టితంగా నిలబడిపోయింది నందిని. కొంత సేపటికి గదిలోనుండి హృదయ విదారకంగా వినిపిస్తున్న తల్లి ఏడుపుకి తెలివివచ్చినదాన్లా ఉలిక్కిపడి చుట్టూ చూసింది. జరిగినదంతా కలలా కనిపిస్తోంది. చిన్నప్పటినుండి ఆడింది ఆటగా పాడింది పాటగా



# జీవన సరళిలో తీయని రవళి

మహారాణిలా దర్జాగా అహంకారమే ఆభరణంగా పెరిగిన నందిని ఈ హఠాత్పరిణామానికి తట్టుకోలేక చిగురుటాకులా కంపించిపోయింది. ఒక్కసారి ఈ ప్రపంచమంతా తలక్రిందులైనట్టు, యింకెవరూ లేని శూన్యంలో తనొక్కర్తె చిక్కుపడిపోయినట్లు ఉక్కిరి బిక్కిరి అయిపోయింది. చిన్న కాగితం ఎగరేసుకొంటూ చప్పట్లు కొడుతూ, కేకలతో ఈ గదిలోకి పరుగెత్తి వచ్చిన తండ్రిని చూసి ఒళ్లు జలదరించింది భయంతో. ఆ పరిస్థితిలో మోహిని... వాళ్లింట్లో బాధల్ని, ఆలోచన్లను, అన్ని మరచిపోయే, మరపింపచేసే ఆ వాతావరణం గుర్తు వచ్చింది. తీయగా కలలా మరో ప్రపంచలోకి లాక్కుపోయే ఆ మత్తుమందు... అది తీసుకొంటే గాని భరించలేక పిచ్చెక్కిపోతుందని పించింది. వెంటనే వెనుదిరిగి పరుగులాంటి నడకతో గుమ్మంలో విడచిన చెప్పుల్లో కాళ్లు దూర్చి రివ్వున సాగిపోయింది. వారిద్దామని ఆరతి అనుకొన్నంతలోనే జరిగిపోయిందిది. ''ఎక్కడకు వెళ్తుందో'' తెలిసిన ఆరతి కాసేపటికి ఊరట పొందినట్లు ఊరుకొని తండ్రికి భోజనం పెట్టడానికి కదిలింది.

పదకొండు అయ్యింది పన్లు అన్ని ముగించి తల్లికి తండ్రికి మందులిచ్చి తలుపులు వేసి వచ్చేసరికి. ఒక్కసారిగ దుఃఖం ముంచుకొచ్చింది. మూడు రోజులుగా యింటికి రాని అన్న; రాత్రి తొమ్మిది గంటల వేళపుడు యిల్లు విడిచి వెళ్లిన అక్క, బాధతో, ఆవేదనతో తల్లి, ఈ లోకంతో సంబంధంలేనట్లున్న తండ్రి .. యిదీ తన చుట్టు ఉన్న ప్రపంచం, ఈ వలయం ఛేదించుకొని శాంతిని ప్రసాదించే రాజా గుండెలపై నిశ్చింతగ నిదురపోయే రోజు వస్తుందా ?

''రాజా... ఎలా ఉన్నావ్ ? ఈ ఊళ్లో లేవు. కొన్ని మైళ్ల దూరాన్న ఉన్నావన్న ఊహే భరింపశక్యం కాకుండా ఉంది. నీ రతిని విడిచి ఉండలేవని అనుకొన్నాను. నీ సమక్షంలోని శాంతి లేక బేలనైపోతున్నాను. నందిని ఎన్ని మాటలన్నదో చూసావా రాజా ... నీవు ప్రక్కనుంటే ఎన్నన్నా భరించగలను. నేను డబ్బు దాచేసుకొంటున్నానట.. 'మనకోసం.' మనిద్దరం కలసి అస్తంతా దోచేసుకొంటున్నామట. చూసావా ? మనం 'మన' అని ఆలోచిస్తే యిలా చేస్తామా ? రాజా! నీ అండ లేకుంటే నేను మాత్రం ధైర్యంగా ఈ యింటి కోసం నిలబడగలనా !'' వేదన నిండిన మనసు ఆర్తిగా నివేదించుకొంటుంది మనసున మనసైన మనిషి లేని మనసుతో. కన్నీళ్లు చంపలమీదుగా జాలు వారి గుండె బరువుని తగ్గిస్తున్నాయి . ఆ రాత్రి ఎంతకీ తెల్లవారలేదు ఆరతికి.

( ఇంకా వుంది )

అజాద్ కల్చరల్ అసోసియేషన్, చిలకలూరిపేట వారు నాదస్వరకచేరి ఏర్పాటుచేసిన సందర్భంగా నాదస్వర విద్వాన్ షేక్ చినమౌలాసాహెబ్‌ని సన్మానిస్తున్న రోటరీ అధ్యక్షుడు శ్రీ కందిమళ్ల నారాయణమూర్తి.



# ఇప్పుడు...గోద్రెజ్ రూపొందించిందొక కొత్త సబ్బు.
# ఇది మీ అంత శ్రద్ధగా మీ చర్మాన్ని కాపాడుతుంది.



# అందరినీ ఆకర్షిస్తున్న పొయ్యి పరిశోధన!



మహిళా జీవితంలో వెలుగును తెచ్చే కొత్త పొయ్యి

**జ**నాభాలో రెండవదైన మన దేశంలో ప్రతి యేటా దాదాపు 250 మిలియన్ టన్నుల [మి.ట]వంట ఇంధనం వనరులను కాలుస్తున్నాం. వీటిని 'నాన్ కమర్షియల్ ఎనర్జీ సోర్సెస్' అని అంటారు. గ్రామాలలో కట్టెలను ప్రధాన వంట ఇంధనంగా వాడతాము. దీనితో పాటు పిడకలను మరియు వ్యవసాయ శేష పదార్థాలను కూడ పెద్ద మొత్తంలో కాలుస్తున్నాం. ఉదాహరణకు 1976 వ సంవత్సరంలో మన దేశంలో 133 మి. ట.ల కట్టెలను, 73 మి. ట.ల పిడకలను మరియు 41 మి. ట.ల వ్యవసాయ శేష పదార్థాలను కాల్చాము. జనభాతో పాటు మన అవసరాలు నిరంతరం పెరుగుతూనే ఉన్నాయి కావున ఈ అంకెలు ఇంకా ముందుకు పోతాయి అనడంలో సందేహం లేదు.

ఈ వనరులన్నింటిని కబళించేది పొయ్యి. మన దేశంలోని పట్టణాలలో గల కుటుంబాలలో 18.6 మిలియన్లు, గ్రామాలలో 94.5 మిలియన్ల పొయ్యిలున్నాయి. సాధారణంగా ఉపయోగించే పొయ్యి కేవలం 10 శాతం కన్నా తక్కువ సామర్థ్యాన్ని మాత్రమే చూపుతుంది. అంటే బహుమూల్యమైన ఇంధనాన్ని కాలిస్తే వచ్చే ఉష్ణంలో 90 శాతం వృధాగా పరిసరాలలోకి పోతుంది. మూడు రాళ్ళు పెట్టుకొని వంట చేసుకునే వారిని ఇప్పటికీ చూస్తూనే ఉన్నాం. వీటిలో అయితే ఉపయోగించుకునే ఉష్ణం అతి తక్కువ. 2 శాతం సామర్థ్యంతో పని చేసే పద్ధతులను మనం ఇంకా కొనసాగిస్తున్నామంటె చాలా విచారకరమయిన విషయం.

గ్రామీణ పేద ప్రజలు అడవుల నుండి తల మోపు కట్టెలు తీసుకురావడానికి మైళ్ళకొలది నడవాల్సి వస్తుంది. ఉత్తరప్రదేశ్‌లోని గ్రామ మహిళలు సూర్యోదయం కాకముందు బయలుదేరి అతికష్టంగా మోపెడు కట్టెలతో రాత్రికి ఇల్లు చేరుకుంటారు. ఒక్కొక్కసారి రాత్రిపూట ఎక్కడైనా బసచేసి మరునాడు ఇంటికి చేరుకుంటారట. బెంగుళూరుకు దగ్గరి గ్రామాలలో జరిపిన సర్వేలో ప్రతిదినం మహిళలు రెండు గంటలకు పైగా సమయాన్ని కట్టెలు తేవడానికి వెచ్చించాల్సి వస్తుందని తేలింది. గుజరాత్‌లోని ఒక గ్రామంలో జరిపిన సర్వేలో 83 శాతం మహిళలకు పిల్లలు కట్టెలు ప్రోగుచేయడంలో సహకరిస్తారని తెలిసింది. అడవి లోపలికి చేరుకోవడానికే 3–4 గంటలు పడుతుంది. కట్టెలు నరకడానికి ఉపయోగించే గొడ్డలి వల్ల 58 శాతం మహిళలు గాయపడతారని, 10 శాతం మహిళలు వన్యమృగాల వల్ల గాయాలకు గురవు

ఇంటికి పుల్లలు చేరవేస్తేకాని నోట్లోకి ముద్ద రాదు ‹‹ మామూలు పొయ్యిలో చాలా ఉష్ణం వృధాగా పోతుంది





తారని కూడ తెలిసింది. కట్టెలు మండించేటపుడు వచ్చే పొగలో 17 రకాల కలుషిత పదార్థాలు, 14 రకాల క్యాన్సరుజనక పదార్థాలు ఉంటాయి. అవి ఆడవారిపై రోజుకు 200 – 400 సిగరెట్లు తాగినంత ప్రభావాన్ని చూపుతాయని ప్రయోగాలు తెలిపాయి. కావున గ్రామీణ మహిళలు సాధారణంగా కంటిజబ్బు మరియు శ్వాస సంబంధమైన రోగాలతో తరచుగా బాధ పడుతుంటారు. ఇన్ని రకాల చిత్రహింసలకు గురవుతున్న స్త్రీలకు మన విజ్ఞాన – సాంకేతిక రంగాలు ఏ విధంగా తోడ్పడతాయి ? కష్టాలను ఎంత వరకు తగ్గించగలుగుతాయి ??

పొయ్యి సామర్థ్యాన్ని అభివృద్ధి పరచడానికి గత కొన్నేళ్ళ నుండి దేశంలో పలుచోట్ల చాల పరిశోధన జరుగుతున్నది. ప్రయోగాలు ముఖ్యంగా కట్టెలను పూర్తిగా మండించడంపై సామర్థ్యాన్ని పెంచడం మరియు వంట చేసే చోట పొగ లేకుండా చిమ్నీ ద్వారా బయటకు



## సాంచాలతో పొయ్యిలను చకచకా నిర్మించవచ్చు

పంపించే విషయాలపై జరిగాయి. తత్ఫలితంగా మన ముందు ఇపుడు ఎక్కువ సామర్థ్యంతో పని చేసే చాలా పొయ్యి నమూనాలున్నాయి. ప్రభుత్వం డజనుకు పైగా నమూనాలను గ్రామాలలో వ్యాప్తి చేయడానికి గాను గుర్తించింది. నమూనాలను అభివృద్ధి చేసినవారు రకరకాల పేర్లు పెట్టుకున్నారు. అవి : ప్రియాంగి, అగ్నిమిత్ర [జ్వాల], నాధా చుల్హా [హిందీలో చుల్హా అంటె పొయ్యి అని అర్థం], దోలాధర్, జల్‌నిగావ్, హెచ్. ఈ. ఆర్. యల్. చుల్హా, జనాఘడ్, తాపోలి, మగన్, మధురై, క్రిష్ణప్రియ, ప్రాడ్, సహయోగ్, మొదలగునవి. వీటి సామర్థ్యం 15 శాతం నుండి 25 శాతం వరకు ఉన్నాయి. ఇండియన్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ సైన్స్ [బెంగుళూరు] వారి పొయ్యి 50 శాతం సామర్థ్యాన్ని చూపుతుంది. వీటివల్ల కట్టెల వినియోగం తగ్గిపోతుంది. ఆడవారికి, పిల్లలకు అడవికి పోయే పని తగ్గుతుంది. కట్టెలు కొనుక్కునే వారికి డబ్బు ఆదా అవుతుంది. దీని ఫలితంగా మన అడవులపై కట్టెల కోసం రోజు రోజుకు పెరిగిపోతున్న ఒత్తిడి తగ్గిపోతుంది. ప్రతి నమూనాకు పొగను బయటకు తీసుకుపోయే చిమ్నీ ఉంది కావున ఆడవారి ఆరోగ్యస్థాయి పెరుగుతుంది.

గ్రామీణ వంట ఇంధన సమస్యలను పరిష్కరించడానికి కీలక పాత్ర వహించే కొత్త పొయ్యిల వ్యాప్తికై ప్రభుత్వం జాతీయ స్థాయిలో ఒక కార్యక్రమాన్ని చేపట్టింది. "డిపార్ట్‌మెంట్ ఆఫ్ నాన్ – కన్వెన్షనల్ ఎనర్జీ సోర్సెస్" వారు డిసెంబర్– 1983లో "నేషనల్ ప్రాజెక్ట్స్ ఆన్ డెమాన్‌స్ట్రేషన్ ఆఫ్ ఇంప్రూవ్‌డ్‌చుల్హాస్" అనే పేరుతో మొదలు పెట్టింది. దీంట్లో ఒక లక్ష ముఖ్యంగా స్త్రీలకు పొయ్యిలు నిర్మించడంలో మరయు నెలకొల్పడంలో ట్రెయినింగ్ నిస్తారు. ఒక్కొక్కరు 5 పొయ్యిల చొప్పున 5 లక్షల పొయ్యిలను నిర్మించాలని నిర్ణయించారు. శిక్షణ ఖర్చు ప్రభుత్వం ఇస్తుంది. పొయ్యిలు కావాలనే వారికి సబ్సిడీలు లభిస్తాయి. ఫిక్స్‌డ్ పొయ్యిలకు సామాను ఖర్చు అంతా ప్రభుత్వం ఇస్తుంది. పోర్టబుల్ పొయ్యిలకు మాత్రం ప్రదేశాలను బట్టి [కొండ ప్రాంతాలు] మరియు హరిజన గిరిజనులకు 25 నుండి 75 శాతం వరకు సబ్సిడీలను ఇస్తుంది. 5000 గ్రామాలలో అన్ని ఇండ్లలో పొయ్యిలను నెలకొల్పి "ధూమ రహిత గ్రామాలు" గా చేయాలని కూడ నిర్ణయించారు. పొయ్యి వ్యాప్తి కార్యక్రమం కొన్ని చోట్ల చాల మంచి ప్రభావాన్ని చూపుతున్నది. మన రాష్ట్రంలో కూడ ఈ కార్యక్రమం పుంజుకుంటున్నట్లు తెలుస్తుంది.

పొయ్యిలను నిర్మించడానికి కొద్దిపాటి ట్రెయినింగ్ అవసరం. పొయ్యిల నిర్మాణం సులభతరం చేయడానికి గాను ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ – ఢిల్లీ వారు



పొయ్యి నిర్మాణాన్ని నేర్చుకుంటున్న మహిళ

'సహయోగ్ పొయ్యి' నమూనాకు గాను సాంచాలను తయారు చేసారు. వీటిని రేకుతో గాని కర్రతో గాని చేసుకోవచ్చు. వీటి నుపయోగించి పొయ్యిని సునాయాసంగా నిర్మించవచ్చు. కొలతలు ఎక్కువ తక్కువలయ్యే ప్రమాదం లేదు. తక్కువ సమయంలో ఎక్కువ పొయ్యిలను స్థాపించవచ్చు. పొయ్యి యొక్క జాతీయ కార్యక్రమానికి 'సాంచా టెక్నాలజీ' ఎంతో పటిష్ఠతను చేకూరుస్తుంది.

ప్రపంచంలోని సగం ఇళ్ళలో ఉపయోగించే పొయ్యి వన నిర్మూలనకు చాలా వరకు కారణము. వన నిర్మూలన వల్ల పలురకాల వాతావరణ సంబంధమైన సమస్యలు తలెత్తుతాయి. అవి మానవ జీవనానికే ముప్పు తెస్తాయి. వీటన్నిటిని అరికట్టడానికి పొయ్యి సామర్థ్యాన్ని సాధ్యమయినంతవరకు పెంచినపుడు అడవులను రక్షించు కోడానికి వీలవుతుంది. ఆడవారికి, పిల్లలకు మోటు పని తగ్గుతుంది. మధ్యతరగతి కుటుంబీకులకు డబ్బు ఆదా అవుతుంది. తమ ఆదాయం నుండి 20–25 శాతం డబ్బుని వంట ఇంధనాలపై ఖర్చు చేసే కుటుంబాలకు కొత్త పొయ్యి ఆర్థికంగా ఎంతో దోహదకారిగా ఉంటుంది.

### తేడా ...

బ్రతికిన్నాడు
మట్టెలు అరిగేదాక
గాలించినా దొరకని
మోపెడు కట్టెలు
చచ్చిన్నాడు
తరలి వస్తాయి
మోపుల కొద్దీ ...
కాల్చి
బూడిద చేయడానికి...

### అంకితం

ఏళ్ళ నుండి వంట ఇంధనాల సమస్యలను ఎదుర్కొంటూ వంట ఇంట్లోని కలుషిత వాతావరణంతో కుస్తీపడుతూ ప్రేమతో తిండిని అందిస్తున్న 'స్త్రీ'కి.

ఫొటోలు–వ్యాసం :

**— టి. సంపత్‌కుమార్**

# "సినిమా గ్లామర్‌ని 'కాష్' చేసుకుని 'పవర్'లోకి రావాలని లేదు!"

# రాజ్యసభ సభ్యురాలు కుమారి జయలలిత

సేలం జిల్లా ఆత్తూరు గ్రామంలో ఒక బహిరంగ సభ. ఎక్కువగా మహిళలే ఉన్నారా సభలో. జయలలిత (35) అప్పుడప్పుడు పిట్ట కథలతో, జోక్‌లతో అందర్నీ నవ్విస్తూ, ఎం. జి. ఆర్. పాలనలో దీనజనోద్ధరణకు జరుగుతున్న కృషి గురించి ఉపన్యసిస్తోంది. ఇంతలో సభలో కలవరం బయలుదేరింది. ప్రసంగం వినడానికి వచ్చిన ఒక నిండు చూలాలికి అకస్మాత్తుగా పురిటి నొప్పులు ప్రారంభమయ్యాయి. ఆమెను ఎకాయెకీన ప్రసూతి కేంద్రానికి తరలించడానికి కొందరు వాలంటీర్లు ప్రయత్నిస్తే ఆమె నిరాకరిస్తూ — "అమ్మ మాట్లాడేదంతా పూర్తిగా వినందే నేనిక్కడ్నుంచి చచ్చినా కదలను. బిడ్డ పుడితే ఇక్కడే పుట్టనీయండి. ఆ బిడ్డకు అమ్మ పేరే పెట్టుకుంటాను," అంటూ చివరిదాకా భల్లూకం పట్టు పట్టి అక్కడే కూర్చుండి పోయిందట!

నేడు తమిళనాడులో కొన్నిచోట్ల జయలలిత ఉపన్యాసం వినడానికి హాజరయ్యే వారి సంఖ్య, ఎం. జి. ఆర్. ప్రసంగం వినడానికి వచ్చేవారి సంఖ్య కన్నా ఎక్కువే! ఈమె తమిళం, తెలుగు, కన్నడం, హిందీ, ఆంగ్ల భాషల్లో అనర్గళంగా ఉపన్యసించగలదు. "నేనొకప్పుడు సినిమా తార అన్న విషయాన్నే ఈ సభలకొచ్చే చాలామంది మరచిపోయినట్లున్నారు," అంటుంది జయలలిత మందహాసంతో. ఈమె ఎక్కడికెళ్లినా మహిళామణులు హారతితో స్వాగతమిస్తుంటారు.

"రంగాలు వేరైనా ప్రజలకి దగ్గరే...."



## సినిమాలు — రాజకీయాలు

రాజకీయ రంగానికీ, సినిమా రంగానికీ ఎంతో దూరమున్నా — ప్రజానీకంతో మాత్రం రెండింటికీ బాగా దగ్గర సంబంధం ఉంది. ఏ రంగంలోనైనా రాణించడానికి ప్రజాదరణ, ప్రజాభిమానం ముఖ్యమైన ఆయుధాలన్న విషయం అందరూ ఎరిగినదే. ప్రజలతో మాట్లాడ్డంలో, వారిని ఆకట్టుకోడంలో, వారి ఆదరణ సంపాదించడంలో ఈ రెండు రంగాలలోని వారికీ ప్రజ్ఞ ఉంది. ఐతే, సినిమా కళ ద్వారా ప్రజలను రంజింపజేసే వ్యక్తులకు రాజకీయపరంగా కూడా ప్రజలను చైతన్యవంతుల్ని చేయగల సామర్థ్యం ఉందని ఇటీవల నిరూపణ జరిగింది.

జయలలిత ఒక శిఖరాగ్రం మీద నుంచి మరొక శిఖరానికి లాంగ్‌జంప్ చేయలేదు.

"నేను లాయర్‌నో, లిటరరీ స్కాలర్‌నో అవ్వాలనుకున్నాను. కాని, మా అమ్మగారి ప్రోద్బలంతో సినిమా రంగంలో ప్రవేశించాను. నా ఐదవ ఏట నుంచే భరతనాట్యం అభ్యసించడం మొదలెట్టాను. అది ఏ రంగమైనాసరే — చివరిదాకా శ్రద్ధాసక్తులతో కృషి చేయడమే నా మతం. ఐతే, ఇప్పుడు రాజకీయ రంగంలో ఎవరి ప్రోద్బలం లేకుండా నా అంతట నేనే ప్రవేశించాను. నటిగా సిరిసంపదలు, కీర్తి ప్రతిష్ఠలు ఏనాడో ఆర్జించాను. నేడు నేను కొత్తగా ఆర్జించవలసిందేమీలేదు. సినిమా 'గ్లామర్'ను కేష్ చేసుకుని 'పవర్'లోకి రావాలనే కాంక్ష నాలో ఏ కోశానా లేదు. కొంత కాలంగా రాజకీయ రంగం పట్ల నా దృష్టి మరలింది. రాజకీయ పరిణామాల పట్ల అవగాహన కూడా ఏర్పడింది నాలో. సామాన్య ప్రజల ఇబ్బందులను, లోటుపాట్లను గ్రహించగల్గాను. సామాజిక చైతన్యం గురించి ఆలోచించడం మొదలెట్టాను. అసలు



నేనెప్పుడూ ఏకాంతాన్నే వాంఛిస్తాను. పుస్తకాలు చదవడం బాల్యం నుంచీ నా హాబీ అయితే, ఇప్పుడది నా జీవితంలో ఒక భాగమైపోయింది. చిన్నప్పుడు నా పుట్టినరోజు పండుగనాడు మా అమ్మగారో, అత్తయ్యో 'కేక్' తెప్పిస్తే నాకంత సంతృప్తి ఉండేదికాదు. కాన్కగా కొన్ని పుస్తకాలిస్తే, ఎంతో సంబరపడిపోయేదాన్ని. ఇప్పుడు మధురై జిల్లాలో నేను టూర్ వెళ్లాలనుకోండి, అక్కడి ప్రజల సమస్యల్ని, లోటుపాట్లని సమస్తం చదివి తెలుసుకుని మరీ బయలుదేరుతాను. అంచేత, నేనెప్పటికీ పాఠకురాల్నే," అంటుంది జయలలిత.

నుదుట ఎర్రటి పెద్ద బొట్టు, అదేరంగు సాదా చీర...మెడలో ఆమె మేని ఛాయను పోలిన చిన్న పసిడి సరం... ఎప్పుడూ ఎంతో సింపిల్‌గా కన్పిస్తుందామె.

మద్రాసు స్టెల్లా మేరీస్ కాలేజ్ వెనుక పోయెస్ గార్డన్‌లో 'వేదాఇల్లం' అనే భవంతి ఆమె నివాసం. అక్కడ విజిటర్స్ గదిలో ఓ గోడకు మాల వేసిన ఆమె తల్లి--అలనాటి కీ॥ శే॥ సంధ్య ఫోటో, దానికి కొంత దూరంలో బ్రిటిష్ రాకుమారుడు ఛార్లెస్ ఫోటో, మరో వైపున ఎం. జి. ఆర్. ఫోటో, పక్కన ఇసుక వేస్తే రాలనంతటి జనసందోహం సమక్షంలో జయలలిత ఉపన్యసించే బానర్ సైజ్ ఫోటో.

ఈమెను కొందరు 'అమ్మ' అని, 'చిన్న అణ్ణి' (చిన్న వదినె) అని సంబోధిస్తారు. 'పురట్చి శెల్వి' (విప్లవ నాయకురాలు) 'చింతనై శెల్వి' లాంటి బిరుదులు ఎన్నో ఉన్నాయి. ఒకే ఒక్కచోట ఎం. కరుణానిధి ఈమెను 'తోకచుక్క'గా పేర్కొన్నారట. ఆ తర్వాత ఈమె గురించి మరేం మాట్లాడ్డం మానేశారట. "నేనడిగే ఏ ప్రశ్నకూ ఆయన సరియైన సమాధానం ఇవ్వలేరు," అంటుంది జయలలిత. డి. ఎం. కె. కు ఇక భవిష్యత్తు లేదని ఈమె అభిప్రాయం. "అసలు ప్రజల విశ్వాసం కోల్పోయినప్పుడే కరుణానిధి రాజీనామా ఇచ్చేసి, తన పార్టీ నాయకత్వాన్ని మరొకరికి అప్పగించి తప్పుకొని ఉండాలి," అంటుందామె.

## రాజకీయరంగ ప్రవేశం

1980 లోనే రాజకీయ రంగంలో ప్రవేశించాలనుకుంటున్నానని జయలలిత చెప్తే, ఎం. జి. ఆర్. "తొందరపడొద్దు. ముందు నువ్వు చాలా పుస్తకాలు చదవాలి," అన్నారట.

1982 ఏప్రిల్‌లో మద్రాసులో జరిగిన చేనేత ప్రదర్శనశాలలో జయలలిత ఉపన్యసించడానికి పదిహేను నిమిషాల వ్యవధి ఇవ్వబడింది. చేనేత కార్మికుల సమస్యల గురించి, విజ్ఞతతో కూడిన ఎం. జి. ఆర్. విశుద్ధ పాలన గురించి ఆమె మాట్లాడింది. ఆ ప్రసంగాన్ని ఆమెకు తెలీకుండా ఎం. జి. ఆర్. టేప్ చేయించుకుని విని, 'వేదిక పరీక్ష'లో ఆమె ఉత్తీర్ణురాలైనట్లు సంతృప్తి చెందారు.

(50 వ పేజీ చూడండి)

సీరియల్

# కర్మయోగి

డా॥ కె.వి. కృష్ణకుమారి

## (గత సంచిక తరువాయి)

**జరిగిన కథ — 16 :** తులశమ్మగారు గత జీవితాన్ని శ్రీహరిగారితో చెప్పి హృదయభారాన్ని తగ్గించుకొంటారు. కృష్ణారావు తల్లి ఆవేదనని చూసి చలిస్తాడు. తల్లి కోరిక ప్రకారం పెళ్లి చేసుకొనుటకు అంగీకరిస్తాడు కృష్ణ. కృష్ణ పెళ్లి పద్మినితో నిశ్చయమవుతుంది. కృష్ణారావు, పద్మినిల వివాహం జరిగిన కొద్దిగంటలకే పద్మిని తల్లి యశోదమ్మ మరణిస్తుంది. యశోదమ్మ కర్మకాండ అనంతరం పద్మినితో కూడ కృష్ణప్రియను తమ దగ్గరకే పంపమని రామచంద్రరావుకి చెప్పి తులశమ్మ కృష్ణారావుతో కలిసి తమ ఊరు వెళ్లిపోతారు. పద్మిని, కృష్ణప్రియల రాకతో తులశమ్మగారి ఇంట్లో చైతన్యం వస్తుంది. కృష్ణారావు చర్యలకు అందరూ ఆకర్షితులవుతారు. శోభనం నాటి రాత్రి మూర్ఛవచ్చి పడిపోయిన పద్మినికి సేవలు చేసి అనునయిస్తాడు కృష్ణ. గుండె నొప్పితో బాధపడుతున్న పద్మినిని మనస్సుకు ఉల్లాసం కలిగించే మాటలతో ఊరడిస్తాడు కృష్ణ. మనుమడి కోసం తాపత్రయ పడే తులశమ్మను చూసి పద్మిని కృంగిపోతుంది. కృష్ణారావుని గోష్టిలో అల్లరిపాలు చేయాలనుకున్న నారాయణ ప్లాను తలక్రిందులవుతుంది తులశమ్మకు మనుమడిని ఎత్తుకోవాలనే కోరిక రోజు రోజుకు బలపడులోంది. కాని ఆమెకు కృష్ణ వైఖరి ఆందోళన కలిగిస్తుంది. పద్మిని ఆరోగ్యం ఇంకొంచం క్షీణించింది. పద్మిని మంటల్లోపడి మరణిస్తుంది. పద్మిని మరణం ఆ ఇంటి వాతావరణంలో పూర్తి మార్పు తెచ్చింది. లక్ష్మి బాధ్యతల విషయం గుర్తుచేయగా తన బాధ్యతల్ని తను నెరవేరుస్తానని వదినకు మాట ఇస్తాడు కృష్ణ. తల్లి కోరికపై కృష్ణప్రియను వివాహం చేసుకొనేందుకు అంగీకరిస్తాడు కృష్ణ. కృష్ణ, కృష్ణప్రియల వివాహం జరిగిపోతుంది.

అన్నం కెలుకుతూ కూర్చుంది కృష్ణప్రియ.

"ఏమ్మా కూర బావుళ్ళేదా...ఇవాళ కారం కాస్త తక్కువ పడింది."

"బాగానే వుందక్కయ్యా."

తినటానికి ప్రయత్నిస్తున్నా తినలేక పోతోంది. కడుపులోంచి వికారం లాంటిదేదో తన్నుకు వస్తోంది.

"వొంట్లో బావుళ్ళేదా తల్లీ—"

అత్తగారివంక చూడలేక తలదించుకుంది.

లక్ష్మిలో అనుమానం మొలకెత్తింది. అది ఆనందంతో క్షణాల మీద చిగురులు వేసింది.

ప్రియకళ్ళల్లో భావాలు కదులుతున్నాయి. నిజం దాగనంటోంది.

"ప్రియా నిజమేనా?"

ఆనందాన్నీ ఉత్సుకతమా ఆపుకోలేక పెద్దగానే అడిగేసింది.

విషయం అర్థంకాని తులశమ్మ తెల్ల మొహం వేసింది.

"ఏమిటే ఆ నిజమూ?—"

అయోమయంగా అడుగుతున్న అత్తగార్ని ఎంగిలి చేత్తోనే చుట్టేసుకుంది లక్ష్మి.

"ఏమిటే నీ సంతోషం? — ఏం జరిగిందింతకి—"

ఆవిడకి పరిస్థితి అర్థమయీ అవనట్టుంది. అర్థమవక పోవటానికి కారణముంది. అది తన అదృష్టం మీద నమ్మకం లేకపోవటమే.

"సంతోషంకాక ఇంకేమిటత్తయ్యా. ఈ ఇంట్లో మరో చిన్న కృష్ణుడు రాబోతున్నాడు..."

ఒకేసారి నోరు తెరిచేసింది తులశమ్మ.

ఆపుకోలేని ఆనందంతో ముద్ద మింగుడు పడలేదు.

ఇంతకుమించి మరే ఆశా—మరే కోరికా లేని ఆవిడ పిడికెడు గుండె ఇంత సంతోషాన్ని తట్టుకోలేకపోయింది.

నిలువు గుడ్లతో అచేతనంగా కన్పిస్తున్న తులశమ్మను చూసి కంగారు పడ్డారిద్దరు కోడళ్ళూ. అతి ప్రయత్నంమీద ఈ లోకానికి తెప్పించగలిగారు.

"అత్తయ్యా ముందాముద్ద మింగండి. కాస్తలో ప్రమాదం తప్పిపోయింది."

లక్ష్మి మంచనీళ్ళందిస్తున్నా ఆవిడ చూపులింకా కృష్ణప్రియ మీదే వున్నాయి.

సరిక్రొత్తగా కన్పిస్తున్న కోడలిని కంటినిండా చూసుకుంటూ — నీటితోబాటు కన్నీటిని కూడా మింగేశాక గుండె తేలికైనట్లైంది.

ఆత్రంగా భోజనం అయిందన్పించాక తన కాళ్ళమీదకు వొంగబోతున్న కోడల్ని వారిస్తూ గుండెలకి హత్తుకుంది.

"నాతల్లే—నా బంగారమే—నా కలలు నిజం చేశావే. ఇంక నేను పోయినా ఫరవాలేదమ్మా—పోయినా ఫరవాలేదు."

కన్నతల్లిని మరపించే ఆ వెచ్చని గుండెల్లో ఆ చల్లని స్పర్శలో పసిదానిలా వెక్కిళ్ళు పెట్టింది కృష్ణప్రియ.

"ఇప్పుడు మీ అమ్మేవుంటే ఎంత సంబర పడేదో...ఎంత పండగ చేసుకునేదో...ఊరుకో... ఊరుకోవే పిచ్చి తల్లీ. ఊరుకో—"

ఎలా వోదార్చాలో తెలియక — తికమక పడిందావిడ.

ఆరోజు నుంచీ ఇంట్లో — పరిస్థితుల్లో చాలా మార్పులు వచ్చాయి. ఎంతో జీవం వచ్చింది.

ఇదేదో విచిత్రమైన వార్తలా ఆ నోటా ఆ నోటా ఊరంతా పాకిపోయింది. సంతోషించిన వాళ్ళకన్నా — బాధపడ్డవాళ్ళే ఎక్కువైనా — ఆ బాధను కనపడనివ్వకుండా జాగ్రత్తపడ్డారు చాలామంది. అంతటి ఐశ్వర్యం ఆ వైభవం, ఆ పేరుప్రతిష్టలూ, మరో నలుసుద్వారా — కూడా వ్యాప్తిచెందటంకన్నా — ఆ వంశం కృష్ణారావుతోనే అంతమైపోయుంటే సంతోషించేవాళ్ళు చాలామంది. కృష్ణారావుకి పిల్లలు పుట్టరని ఎందుకో ధీమాగా వున్న శ్రేయోభిలాషులకీ వార్త గొడ్డలిపెట్టే అయింది. ఐనా చేసేదిలేదు. కృష్ణప్రియ గొడ్రాలిగానే వుండిపోతే — ఆ బాధతో ముసలావిడ మంచంపట్టి — కుళ్ళి కుళ్ళి ఏడుస్తుంటే — ఇద్దరు కోడళ్ళూ జీవచ్ఛవాలుగా వుండిపోతే — అప్పుడు ఎడతెరిపి లేకుండా సానుభూతి అందించటానికీ — కన్నీళ్ళు తుడవటానికి — వచ్చేవాళ్ళు లోకులు. ఇప్పుడూ వస్తున్నారు. ఐతే సంతోషాన్ని పులుముకుని. అప్పుడైతే ఆనందాన్ని దాచుకుని.



అత్తాకోడళ్ళు కృష్ణప్రియ విషయంలో అమిత శ్రద్ధతోనూ, కృష్ణారావు 'తత్వ రచన' లోనూ పూర్తిగా మునిగిపోయారు.

*　　*　　*

నారాయణ తల్లి సరోజినమ్మకూ, తులశమ్మకూ బాల్య స్నేహం వుంది. ఆ బాల్య స్నేహాన్ని ఇంత వయసు వచ్చినా వయసుతోబాటు పెంచుకుంటూ వచ్చింది సరోజినమ్మ. కారణం, తులశమ్మ ఆగర్భ శ్రీమంతురాలు కావటమే. అప్పటికీ ఇప్పటికీ తరగని ఆవిడ స్థితిగతులే అడపా తడపా, మాట సహాయానికీ, పని సహాయానికీ వచ్చి – అంతకన్నా ఎంతో విలువైనవాటినే తీసుకువెళ్ళటం ఆవిడకు అలవాటు. తులశమ్మది, స్వతహాగా జాలిగుండె. అందులో పరిస్థితులు తెచ్చిన వైరాగ్యంతో వస్తువుల విలువను గ్రహించే స్థితిని ఆవిడ దాటిపోయింది.

ఆ రోజు తులశమ్మ దగ్గరకు స్వలాభం కోసమే వచ్చింది.

మనసునిండా పుట్టెడు సంతోషాన్ని దాచుకోలేక అవస్థలు పడుతున్న తులశమ్మ, స్నేహితురాలిని మనసారా ఆహ్వానించింది.

ఐశ్వర్యం ఆహ్వానిస్తుంటే సంబరపడిందావిడ.

''మనవడ్నో – మనవరాలినో చూస్తేనేగానీ మనుషుల్లో పడలేనట్టే వున్నావు–'' ఆయాసంగా అంటూనే స్థూలకాయాన్ని గోడకు జారేసింది సరోజినమ్మ.

''అది సహజమేకదా –''

సహజంగా నవ్వుతూనే కోడలు వంక చూసింది తులశమ్మ.

లక్ష్మి టిఫిన్ తీసుకురావటానికి లోపలకు వెళ్ళింది.

''చిన్నకోడలు కులాసావా ?''

లక్ష్మి తీసుకురాబోయే టిఫిన్ నోరూరిస్తుంటే – మనసంతా ఆత్మీయతను పులుముకుని అడిగింది.

''స్వతసిద్ధంగా ఆరోగ్యవంతురాలు కదా...''

''...అందులో కంటికి రెప్పలా చూస్తున్నారిద్దరూ –''

లక్ష్మి తెచ్చిన ప్లేటందుకుంటూ సంబరంగా అంది సరోజినమ్మ.

ప్లేట్లో కజ్జికాయాలూ – పూతరేకులూ– జంతికలూ నోరారా అందుకుంది.

''... ఇప్పుడివన్నీ ఎందుకమ్మా –'' మొహమాటపడుతూనే తినటం మొదలుపెట్టింది.

''ఎప్పుడూ చేస్తామా – ఏదో భగవంతుడన్నాళ్ళకు దయ తలవబట్టి–'' తింటూనే తులశమ్మని పరిశీలనగా చూసింది –

మనిషిలో చాలా మార్పు వచ్చింది – ఉత్సాహం, తృప్తి తెచ్చిన ఆరోగ్యం – వింత అందంతో మెరుస్తోంది.

''నేనొక పనిమీద వచ్చాను తులశమ్మా–''

''అటువంటిదేదో వుంటుందని అనుకున్నానులే – ముందర మంచినీళ్ళు తాగు –''

తులశమ్మ చేతిలోంచి గ్లాసందుకుంటూ గటగటా తాగేసి మూతి తుడుచుకుంది.

''...ఏమీలేదు – ఎప్పటికప్పుడు మనం వెళ్ళాలనుకోటం – ఏదో అవాంతరమొచ్చి ఆగిపోవటం... ఈసారిమటుకు పుష్కరాలకు వెళ్ళితీరాలనేవుంది –''

''అవునవును గోదావరి పుష్కరాలుకదూ–''

ఆలోచన్లోపడింది తులశమ్మ.

''... ఆలోచించటమెందుకూ – మళ్ళా పుష్కరాలకు మనముంటామో వుండమో – ఎప్పుడూ పుష్కర మహిమలు చెప్పేదానివి – అసలు నీవల్లే – చిన్నతనంనుంచీ నాకు పుష్కరాలకు వెళ్ళాలనే కోరిక పుట్టింది... ఈసారి వదిలేదిలేదు –'' నచ్చచెప్పమన్నట్టు ఇద్దరు కోడళ్ళవంకా చూసింది సరోజినమ్మ.

''...పోనీ వెళ్ళండత్తయ్యా – పుష్కర స్నానం మీ కిష్టంకదా...''

లక్ష్మి మనస్ఫూర్తిగా అంటుంటే – విస్మయంగా చూసింది తులశమ్మ.

''ఎలాగే – ప్రియ లేవలేని పిల్ల. నిన్నొక్కదాన్నే వదిలేసి – నేనెలా వెళ్ళను ?... ఇంటి పరిస్థితులు చూస్తే...''

''...ఫరవాలేదత్తయ్యా–ఇంటి పరిస్థితులకేమొచ్చిందీ – పైగా నా వంట్లోకూడా బాగానే వుంది – మీ వంట్లోనే బావుళ్ళేదు. ఐనా ఎన్నాళ్ళనుంచో వున్న కోరికను వాయిదా వేసుకోటమెందుకూ ? – మీతో అక్కయ్యను కూడా తీసుకువెళ్ళండి – మీకు తోడుగానూ వుంటుందీ – నాకు ధైర్యంగానూ వుంటుంది.''

ప్రియ అలా అంటుంటే సరోజినమ్మ మొహం చింకిచాటంతైంది.

''ఇంక నీకేంలోటమ్మా – ముత్యాల్లాంటి కోడళ్ళిద్దరూ కదలమంటుంటే...''

''బావుంది – లక్ష్మిని అట్టేపెడితేనే ఈ ఇంట్లో ఎలా గడుస్తుందాని నేననుకుంటుంటే దాన్నికూడా తీసుకుపొమ్మంటోంది.''

# సన్‌రైజ్ ఫ్లాస్క్ సదుపాయం




## ఉచితం!

ఈ ప్రత్యేకతగల సన్‌రైజ్ థర్మోస్ ఫ్లాస్క్ మీ సొంతమే!
కేవలం 5 ఖాళీ సన్‌రైజ్ 200 గ్రా. రీఫిల్ ప్యాక్‌లు యిచ్చి వాటి బదులు దానిని తీసుకోనవచ్చును.

సన్‌రైజ్ మంచి మరొకటి గొప్ప విలువైన సదుపాయం. 5 ఖాళీ సన్‌రైజ్ 200గ్రా. రీఫిల్ ప్యాక్‌లను సేకరించి, వాటిని మీ డీలర్ దగ్గరకు తీసుకువెళ్ళండి. అంతే, ఒక వారం లోపున, మీ సొంత సన్‌రైజ్ ఫ్లాస్క్, ఆయన దుకాణంలో మీ కోసం ఎదురు చూస్తూ ఉంటుంది. మీరు చేయవలసిందల్లా, మళ్ళీ మీ డీలర్ షాపుకు వెళ్ళినప్పుడు, దానిని తెచ్చుకోడమే. చాలా సులువైన పని, అవునా? అందుచేత మీ సేకరణ ప్రారంభించండి-ఇప్పుడే!







కొత్త

Nestlé

# సన్‌రైజ్

ఇన్‌స్టెంట్

ప్రాతఃకాలపు ఆ తాజాతనాన్ని అనుభూతి చెందేందుకు

8252

అత్తయ్య నిష్కారంగా అన్నా ఆ ఆప్యాయతకి కృష్ణప్రియ కళ్ళు చెమర్చాయి.

"పది పన్నెండు రోజులకేమొచ్చిందత్తయ్యా — ఈ ఇంట్లో ఏం పని వుందనీ — నేను సర్దుకోలేకపోతానా ? పాపం అక్కయ్య కూడా ఎప్పుడూ ఇల్లు కదలనే కదల్దు. మొన్న మాటల్లో అంది పుష్కరాలకు వెడితే బావుంటుందని — ఇంట్లో వుండేదాన్ని నా ఆరోగ్యంకేమొచ్చింది. మీ ఆరోగ్యమే మంచిదికాదు. కని పెట్టుకోటానికి మీకు తోడు అక్కయ్యుండాలి— ఇద్దరూ వెడితేనే నాకు సంతోషంగా వుంటుంది."

ఇంక కాదనద్దన్నట్టు గట్టిగా అంటుంటే— కాదనలేకపోయింది తులశమ్మ. లక్ష్మిని మాత్రం అతి కష్టంమీద వొప్పించాల్సి వచ్చింది.

"కృష్ణా — గోదావరి పుష్కరాలకి వెడుతున్నాంరా — ప్రియ వొక్కతే ఇంట్లో వుంటానంటోంది... మేమున్నప్పట్లా కాకుండా— కాస్త ఇంటి విషయాల్లో దానికి సాయంగా వుండరా."

తల్లివంక ఆశ్చర్యంగా చూశాడు కృష్ణారావు. ఆరోగ్యాన్ని పుంజుకున్న ఆవిడ మొహంలో కళ కన్పిస్తోంది. ఉత్సాహం కురుస్తోంది.

"అసలు నేను వెళ్లకపోయేదాన్నే — చుట్టుప్రక్కలవాళ్ళందరూ వెడుతున్నారు — వెళ్ళి రమ్మని ప్రియకూడా పట్టుబట్టింది...చెప్పద్దూ నాక్కూడా -"

చిరునవ్వుతో తల వంచుకున్నాడు.

"వెళ్ళాలనుంటే వెళ్ళమ్మా — వద్దనగలనా ? అలా అనటానికి నేనెవర్ని ?" కొడుకు మనస్ఫూర్తిగానే వెళ్ళమన్నాడనిపించింది.

"మన పురోహితుడుగార్నికూడా తీసుకు వెడుతున్నారా — పెద్దాడికి తర్పణాలు వొదలాలి మరి..."

"నీ ఇష్టం —"

కొడుకు అంత ప్రసన్నంగావున్నా — 'నువ్వు వస్తావా ?' అని అడగలేక పోయిందావిడ. అడిగినా అతని తత్వం రానివ్వదు. ఐనా ప్రియ వంటరిగా వున్నప్పుడు అడగటంకూడా భావ్యం కాదు.

నారాయణ పన్లవల్ల రావటంలేదని తెల్సింది.

వీళ్ళతో మరో ఐదారుగురు బయలుదేరారు.

పురోహితుడు బుచ్చిరామయ్యగారు — తారాబలం చంద్రబలం చూసి, విఘ్నేశ్వరుని పూజ తరువాత, పుణ్యాహవాచకము చేసి — శ్రీకృష్ణుణ్ని స్మరించుకుంటూ అందర్నీ బయలుదేరదీశాడు.

వెళ్ళేముందు కోడలికి లక్ష జాగ్రత్తలు చెప్పింది తులశమ్మ.

"వేడిచేసే వస్తువులు తినకమ్మాయ్. ఇష్టంకదాని ఇంగువలాంటి వాటి వాసనకూడా పనికిరాదు. పని మనిషి పన్లన్నీ చేసుకుపోతుంది కానీ — నువ్వేమీ విరగబడకు. బద్ధకంగా వుంటే

# కర్మయోగి

ప్రొద్దున్నే లేవక్కర్లేదులే అంత మాత్రం అబ్బాయి సర్దుకోగలడు. మనసుని ప్రశాంతంగా వుంచుకో. ఆ దైవ లీలల్నే చదువుకుంటూ వుండు — వొంట్లో ఏమాత్రం నలతగావున్నా అబ్బాయితో చెప్పు — సిగ్గుపడక —"

చెప్పినమాట చెప్తూనే వుందావిడ.

"నేను జాగ్రత్తగానే వుంటానుగానీ — ముందర మీ ఆరోగ్యం జాగ్రత్తగా చూసుకోండి. క్రొత్త ప్రదేశంకూడానూ— వొంట్లో బావుండక పోతే — వచ్చేసెయ్యండి — పన్నెండు రోజులూ వుండక్కర్లేదు — అక్కయ్యా — నీక్కూడా చెప్తున్నా."

ప్రియ కళ్ళల్లో నీళ్ళు తిరగటం చూసిన లక్ష్మి కాళ్ళు ముందుకు సాగలేదు.

"ప్రియా — ఏమిటది ? ఎక్కడికో శాశ్వతంగా వెళ్ళిపోతున్నట్టు ? ధైర్యంగా వుంటానని నువ్వే కదా చెప్పావు. పోనీ నేను మానెయ్యనా ?"

లక్ష్మి చాటుగా అడిగింది.

ప్రియ గాభరాగా తల ఆడించింది.

"వొద్దొద్దు... ఎప్పుడూ విడిచి వుండ లేదు కదూ—"

అందరూ ప్రయాణ సన్నాహాల్లై హాల్లో తయారుగా వున్నారు.

"బుచ్చిరామయ్యగారూ— ఇంతమంది ఆడ వాళ్ళకూ— పితృదేవతలకూ—మోక్షం ప్రసాదించి పెడుతున్నారు— మీ పుణ్యం వూరికే పోదు—"

నారాయణకు సమాధానం లేనట్టు నవ్వాడాయన.

"నేను గోదావరిలోనూ— కృష్ణలోనూ — చాలాసార్లు స్నానం చేశాను. ఆ నీళ్ళేగా ఇప్పుడూనూ — అంతమంది స్నానం చేసిన ఆ బురద నీటిలో స్నానం చేస్తే జబ్బులు తప్ప పుణ్యం వస్తుందా ? మా ముసలమ్మ వినటం లేదు."

నారాయణకు సమాధానంగా కొన్ని గొంతుకలు వెకిలిగా నవ్వాయి.

ఇంక సమాధానం చెప్పక తప్పలేదు బుచ్చి రామయ్యగారికి.

చెప్పబోతూ కృష్ణారావు వంక చూశారు. అతని మొహంలో ఏ భావమూ కన్పించలేదు.

"చూడు నాయనా — నీ పేరు నారాయణ కదూ — నీకు నమ్మకం లేక రావటం లేదు. మంచి పనే చేస్తున్నావు. అసలు నీలాంటి వాళ్ళు రాకూడదు కూడానూ. పవిత్ర జలానికీ బురదకీ వున్న తేడా నీకు తెలియకపోయినా—తెల్సుకోవాలనే ఉత్సాహమున్న వాళ్ళనీ చెడగొడుతున్నావు. నీకోసం కాకపోయినా నీ స్నేహితుల కోసమైనా ఒక రెండు ముక్కలు చెప్పాలన్పిస్తోంది—పుష్కర సమయంలో స్నానం చేసే నీళ్ళు మామూలు గోదావరి జలం కాదు నాయనా. ఈ పుష్కర దినాల్లో— మూడు లోకాల్లో వున్న పవిత్ర మహానదులన్నీ గోదావరిలో కలుస్తాయి. అందుకే ఈ సమయంలో గోదావరిలో స్నానం చేస్తే— సమస్త నదుల్లో— స్నానం చేసిన పుణ్యం కలుగుతుంది. మానవజన్మ ఎంతో సుకృతం చేస్తేనేగానీ కలుగదు. మనుష్య శరీరాన్నీ మనసునీ సాధ్యమైనంత వరకూ ముక్తి మార్గం వైపుకు తిప్పుకోటంలో ఫలముందు. సాఫల్యం వుంది. ఇది కృతయుగం కాదు. జప తపాలతో ముక్తి పొందటానికి త్రేతాయుగంలో— అందుకు యజ్ఞయాగాదులవసరం. ద్వాపర యుగంలో భగవంతుని సేవ ఆ ఫలాన్నిస్తుంది. కానీ ఇది కలియుగం. మానవులు పాపకర్మల వైపుకే ఆకర్షితులవుతారు. మరో విధంగా ముక్తి పొందే అవకాశం అన్ని విధాలా అల్పులమైన మనకి లేదు. భగవంతుని ధ్యానమూ— తీర్థ యాత్రా దర్శనమూ— అతి తేలిగ్గా మనకి ముక్తి నిచ్చే మార్గాలు ఏ సమయంలోనైనా — ఏ స్థితిలోనైనా—కేవలం భగవన్నామం చేసినంత



మాత్రాన్నే ఫలం అనంతమైనప్పుడు — అటు వంటి స్మరణము — ఇటువంటి పర్వదినాలలో చేస్తే — ఫలమెంత కలుగుతుందో — చెప్పవల్సిన అవసరం లేదు ... నిజానిజాలు తెలియకుండా శాస్త్రాలను చిన్నబుచ్చటం మంచిది కాదు ...''

నారాయణ మొహం చిన్నబోయింది.

ఈ పేద బ్రాహ్మణుడి వల్ల అవమానం జరగటం— అందులో కృష్ణారావు ముందూ, తన స్నేహితుల ముందూ— ఆడవాళ్ళ ముందూ — సహించరానిదిగా వున్నా—ఉక్రోషాన్ని బలవంతంగా అణచుకున్నాడు.

యాత్ర కందరూ బయలుదేరుతున్నారు.

తులశమ్మ కొడుక్కి చెప్పాల్సినవన్నీ చెప్పినా— కాళ్ళు కదలనంటున్నాయి. చెమ్మగిల్లిన కళ్ళను చాటుగా తుడుచుకుంటూ — ప్రియ నుదురు గట్టిగా ముద్దు పెట్టుకుంది

''వెడుతున్నా మమ్మాయ్... జాగ్రత్త —''

బుచ్చిరామయ్యగారు కదలబోతుంటే— కసి అణగనట్టు పెద్దగానే అన్నాడు నారాయణ.

''ఆ కృష్ణారావూ— మీలాంటి భక్తుడేగా— పాపం తోడు తీసుకువెళ్లాల్సింది.''

వ్యంగ్యం అర్థంచేసుకున్నారు బుచ్చిరామయ్య గారు.

''నక్కకీ — నాగలోకానికీ పోటీనా ? ఆ బాబుగారితో నాకు సాపత్యమా ? నా భక్తి పొట్టకూటి కోసం, స్వార్థంకోసం మోక్షంకోసం — మోక్షాన్ని కూడా కోరని మహానుభావు డాయన ''

తర తరాలుగా వాళ్ల ఉప్పుతిన్న నిజాయతీ నిజం పలికించింది.

నారాయణ మొహం నల్లబడిందీసారి.

* * *

పిడుగు లాంటి వార్తతో ప్రాణం లేని

## క ర్మ యో గి

తులశమ్మతో తిరిగివచ్చిన బుచ్చిరామయ్యగారు, గుమ్మంలోకి అడుగు పెట్టగానే షొల్లుమన్నారు.

వీధి వీధి క్షణాల మీద టాక్సీని చుట్టేసింది తల్లి శరీరాన్ని చూసి, నిర్వీణ్యుడై పోయాడు కృష్ణారావు

''ఘోరం జరిగిపోయింది బాబూ—అందరూ కల్సివెళ్లిన వాళ్లం గట్టుదగ్గర ఎక్కడవాళ్ల మక్కడ విడిపోయాము. సరోజినమ్మగారు లక్ష్మిగార్ని తీసకుని స్నానానికని కాస్త లోతుకు వెళ్లినట్టున్నారు . . కళ్లుతిరిగి గోదావరిలో కల్సి పోయారు. సరోజినమ్మగారు, లక్ష్మిగారి చేతులు పట్టుకుని గాభరగా లాగటంతో పాపం ఈవిడా నీళ్లు మింగి ఉక్కిరిబిక్కిరయ్యారు...''

చెప్పలేక గుడ్డ నోటి కడ్డం పెట్టుకున్నారు బుచ్చిరామయ్యగారు

''. .ఇదంతా చూస్తూ వూరుకున్నారా? ఈ ఘోరాన్ని ఆపలేకపోయారా ? ''

ఎవరివో మాటలు గద్గదంగా విన్పించాయి

''ఆ తరువాత తెల్సింది బాబూ — వాళ్ల శవాల్ని బయటకు తీశాక.. ఆ జనంలో ఆ గందర గోళంలో గుర్తుపట్టటానికని బయట పెట్టాక ఎప్పటికో మేము వెళ్లాము...కళ్లముందు శవాల్ని చూసి పెద్దమ్మగారు గుండాగిపోయి—''

అప్పటికే కుప్ప కూలిపోయింది కృష్ణ ప్రియ—

ఆ కారు వెనుకే మరోకార్లో లక్ష్మినీ, సరోజినమ్మనీ తీసుకుని ఒకరిద్దరు ధైర్యవంతులు ఆ ఊరి వాళ్లే వచ్చారు. నీళ్లు తాగి ఉబ్బి వికృతంగా వున్నాయి ఇద్దరి శరీరాలూ.

అతికష్టం మీద లక్ష్మి శవాన్ని క్రిందకు దించాక సరోజినమ్మ శవాన్ని తీసుకుని వాళ్ల ఇంటికి కదిలిందా కారు ఆ కార్లో వున్నది ఆ ఇంట్లో అద్దెకున్నవాళ్లే అవటంవల్ల చలనరహితంగా వున్న ఇక్కడ దృశ్యానికి తృప్తిపడక వాళ్ళు చూడాలనుకునే సన్నివేశంకోసం డ్రైవర్ని తొందరపెట్టారు వాళ్ళు.

ఇసకేస్తే రాలనట్టున్నారు జనం.

జరిగిన సంఘటనని ఎలా నమ్మాలో ఏ విధంగా బాష్యం చెప్పకోవాలో అర్థం కావటం లేదెవరికీ.

ఏనాడూ ఒకరి జోలికిపోని వాళ్ళు చీమ కైనా హాని చెయ్యాలనే తత్వం వున్నవాళ్ళు కాదు. అటువంటి సద్వంశంలో పుట్టి, ఎటు వంటి వంశానికి కోడళ్లై ఎంత పవిత్రంగా ఆదర్శవంతంగా వున్నారు !

ఎటువంటి వాళ్లకు ఎటువంటి చావు ?—

ఇటువంటి వాళ్లకా ఇటువంటి చావు ?

విధి ఇంత చిత్రమైందా ?

ఇంత క్రూరమైందా ?

దుఃఖాన్ని ఆపుకోటం చాలామందికి కష్టమైపోయింది.

తులశమ్మతో —తులశమ్మ మంచితనంతో— ఆవిడ సహాయ సహకారాలతో చాలామందికి పరిచయం. లక్ష్మి మంచితనంలో ఎంతో మందికి నమ్మకం. ఆ అమ్మాయి దురదృష్టంమీద ఎంతో మంధికి జాలి.

''ఈ కుటుంబానికి రావల్సిన కష్టాలు కావివి...''

''కృష్ణారావు కాబట్టి తట్టుకుంటున్నాడు గానీ మరొకడైతే — పిచ్చిపట్టి సన్యాసుల్లో కల్సివుండేవాడే.''

''ఇన్ని కష్టాలు రావల్సిన యోగం వుండ బట్టే — ఆ మనిషలా రాయిలా ఐపోయాడు... శ్రీకృష్ణుడ్ని నమ్ముకున్నందుకు ఈ మాత్రం ఉపకారమైనా చేశాడు చాలు —''

ఆ సంఘటనను తట్టుకోలేక స్థాణువై పోయిన కృష్ణారావుకి... ఎంతోసేపటికి కర్తవ్యం స్ఫురించింది.

### ఉ ష స్సు

జీవితాల అనుభవాలని
పాటగా పలికితే
సముద్రాల
అల్లకల్లోలాలు వినబడతై
పాడగా
పాడగా
ఆకాశాల నక్షత్రకాంతులలో
రేపటి
సూర్యోదయాలు కనబడతై.

—రామసూరి

ఇటీవల శ్రీ గింజల నరసింహారెడ్డిగారి 'శక్తిధార' కావ్యావిష్కరణని సత్‌చర్యా సంస్థవారు నల్లగొండలో నిర్వహించారు. కావ్యాన్ని ఆవిష్కరిస్తున్న ప్రముఖ భాషా శాస్త్రజ్ఞులు, ఆచార్య చేకూరి రామారావు, సభాధ్యక్షులు శ్రీ పి. రాజరత్నం, కృతికర్త శ్రీ గింజల నరసింహారెడ్డి, డా. ముదిగొండ వీరభద్రయ్యగార్లని చిత్రంలో చూడవచ్చు.



అందరూ తనవంకే ఆర్తంగా చూస్తున్నారు — దీనంగా చూస్తున్నారు జాలిగా చూస్తున్నారు. సానుభూతిని కురిపిస్తున్నారు. కన్నీటితో పలకరిస్తున్నారు.

ఒంటరిగా నిస్సహాయంగా నిలబడిపోయిన అతనికి ఆసరాగా పెద్దలు కొందరు నడుం కట్టారు.

''బుచ్చిరామయ్యగారూ...''

మాటలు వెతుక్కుంటున్న కృష్ణారావు పసివాడిలా కన్పించాడాయనకి.

''కర్మకాండ మొదలుపెట్టాలి బాబూ...''

దుఃఖాన్ని ఆపుకుంటూ బలవంతాన అన గలిగాడామాటను.

అనుకోని ఘోరం జరిగిపోయింది.

కలలోకూడా ఊహించని దారుణం కళ్ళముందు కన్పిస్తోంది.

జరిగింది అబద్ధం కావాలన్నా — నిజం తట్టుకోలేనిదే ఐనా— నిజం నిజంగా కన్పిస్తోంది.

ఎటువంటి దారుణమైనా ఊహించినంత వరకే భయాన్ని కల్గిస్తుంది. చేరువుగా వస్తుందేమోనన్న భావమే—తట్టుకోలేనిదిగా వుంటుంది.

ఆ దారుణం పిడుగుపాటుగా—ఆకస్మాత్తుగా అదృష్టాన్ని సవాల్ చేస్తూ నమ్మకానికే గొడ్డలి పెట్టైతే.

ఆ దారుణమే మనిషి హృదయాన్ని పాషాణం చేస్తుందేమో.

మనిషిని మరగా చేసి కర్తవ్యానికి దగ్గర చేరుస్తుందేమో — కృష్ణప్రియ లేవగలిగింది.

యాంత్రికంగా భర్తతో సహకరించింది

ఒక్కసారిగా రెండు శరీరాలు పైకి లేచాయి.

ఆ ఇంటితో — పరిసరాలతో బంధాలు త్రెంపుకుని — అనుబంధీకుల కన్నీటిని ఆసరాగా తీసుకుని అసలైన గమ్యంవైపుకు దారితీశాయి.

* * *

ఇల్లు శూన్యంగా వుంది.

కళాహీనంలా కన్పిస్తోంది.

భయంకర నిశ్శబ్దం కన్నీరు కారుస్తున్నట్టుంది.

''ప్రియా —''

దిలో లగా కుళ్ళికుళ్ళి ఏడుస్తోంది కృష్ణప్రియ.

అప్పటికప్పుడు వచ్చి వోదార్చి వెళ్ళే అప్తులవల్ల తీరే దుఃఖం కాదిది. శాపగ్రస్త మనుకుంటున్న ఆ ఇంట్లో ఎక్కువకాలం అండగా ఆసరాగా వుండదగ్గ బంధువులంటూ ఎవ్వరూ లేదు. ఉన్నా కాలానికున్న శక్తిని స్వంతం చేసుకోలేరు.

''ప్రియా— అన్నీ తెల్సున్న నువ్వు కూడా— ఇలా...''

ఇంకేమనాలో తెలియటంలేదు కృష్ణారావుకి. తన స్థితి వేరు. ప్రియ స్థితి వేరు. తల్లి తోడుగా వున్న ఇద్దర్ని విధి దారుణంగా పొట్టన బెట్టుకుంది. ఈ స్థితిలో, ఒక విధంగా ప్రియను ఒంటరిదాన్ని చేసింది.

ఈ ఒంటరితనం ఎలా పోతుంది ? ఎలా పోగొట్టగలడు తను ?—

''ప్రియా— లే.. లేమ్మా—''

ఆ క్షణంలో— ఆ ఆదరణకి— దుఃఖ్ఖం పెల్లుబికింది.

తన గుండెల మీద తలవాల్చుకుని పసిదానిలా వెక్కిళ్ళు పెడుతున్న భార్యని ఓదార్పుగా దగ్గరకు తీసుకున్నాడు

ఆర్ద్రంగా హృదయానికి హత్తుకున్నాడు.

''... ఏడవకు... పిచ్చిదానివి నువ్వు —''

తండ్రిని పెనవేసుకుని ఏడుస్తున్న పసిబిడ్డలా— కన్నకూతురులా అన్పిస్తోంది.

''నువ్విలా ఐపోతుంటే — అమ్మే వుంటే ఊరుకునేదా ? — వదిన ఎంత బాధపడేదో తెలుసా ? — నువ్వు మామూలుదానివికూడా కాదు... నీకేం చెయ్యాలో — ఎలా ధైర్యం చెప్పాలో కూడా నాకు తెలియటంలేదు.''

భర్త—అంత ప్రేమగా—అంత సన్నిహితంగా మాట్లాడుతుంటే — కళ్ళు కుండపోతగా వర్షించటం మొదలుపెట్టాయి

''అత్తయ్యా — అక్కయ్యా — అలా ఐపోటానికి నేనే కారణమండీ — వాళ్ళు నన్ను వదిలివెళ్ళమంటున్నా — నేనే బలవంతంగా పంపించాను పాపిష్టిదాన్ని. చేతులారా వాళ్ళని

మృత్యువు దగ్గరకు పంపించాను... ఇన్నాళ్ళకు ఒక నలుసు పుట్టబోతున్నాడని – పిచ్చావిడ – ఎంత పొంగిపోయారో... ఎప్పుడూ లేనిది ఎంత వేడుకగా చెప్పకున్నారో – ఎన్ని వేడుకలు చేద్దామని కలలు గన్నారో... అక్కయ్య – అక్కయ్య మటుకు – నన్నెంత ప్రాణంగా చూసుకుంది... మనకి మంచి రోజులొచ్చాయని– ఎంతగా పొంగిపోయామండీ... చివరికిలా ఐందేమిటండీ...''

కృష్ణప్రియను వోదార్చటం సాధ్యం కావటంలేదు.

''...నామూలానే వాళ్ళు పోయారు. వాళ్ళ ప్రాణానికి నేను మృత్యువులా దాపరించాను. అందుకే అంత బలవంతం చేశాను. తరిమినట్టే పంపించాను... చివరికి ఇంట్లోంచి శాశ్వతంగానే తరిమేశానండీ...''

ఎంతో ప్రయత్నంమీద ఊరడించగలిగినా ఆ ఊరట ఎక్కువసేపు నిలవటంలేదు.

''ఏమండీ...మీరెలా వుండగలుగుతున్నారు? అత్తయ్యా – అక్కయ్యా గుర్తుకు రావటంలేదా మీకు ? అత్తయ్య వున్నన్నాళ్ళూ – మనకోసమే దిగులుపడి – ఏడ్చేదే! అక్కయ్య పిచ్చిదానిలా వంటింటికీ–దేముడి గదికీ అంకితమైపోయిందే– ఎంత అమాయకులండీ వాళ్ళూ – వాళ్ళనెలా మర్చిపోగలుగుతున్నారండీ మీరూ...''

సమాధానం లేనట్టు ఎటో చూస్తూ వుండిపోయిన కృష్ణారావు ఎంతోసేపటికి అనగలిగాడు.

''చెయ్యగలిగింది లేనప్పుడు బాధపడి ప్రయోజన ముంటుందంటావా ? ఏ క్షణాన ఎవరికి ఎక్కడ ఎప్పుడు మృత్యువు దగ్గరవాలని వుంటుందో – అక్కడికి విధే బలవంతంగా తీసుకువెడుతుంది. మన అదృష్టానికీ – దురదృష్టానికీ మనమే కర్తలం కానప్పుడు – ఒకరి దురదృష్టానికి మన కర్తృత్వం ఎంత వరకుంటుంది ? పిచ్చిదానా – వాళ్ళ మృత్యువుకి నువ్వా కారణం ? – వాళ్ళని మృత్యువుకి అప్పగించింది నువ్వా ?

ఇన్నాళ్ళూ ఈ ఇంట్లో గృ ఇంత చదివీ నువ్వర్థంచేసుకున్నదింతేనా ?

''నిమిత్తమాత్రం భవ సవ్యసాచి'' శ్రీకృష్ణుడు ఎప్పుడు ఎందుకు అన్నాడు ? తన ప్రాణాధికమైన అభిమన్యుడి ప్రాణాలు తను రక్షించగలిగీ– ఎందుకు రక్షించలేకపోయాడు ?

ఎటువంటివారైనా కర్మకు బద్ధులు. ఎంతటివారైనా తప్పించుకోలేనిది కర్మని. ఆ సమయంలో అర్జునుడికి ఆ సైంధవుడే – అభిమన్యుని మృతికి కారణంగా కన్పించాడు. నిజానికతను కారణమా ? సాక్షాత్తూ ఆ భగవంతుడే గీత నుపదేసించినా దాని ప్రభావం అర్జునుని మీద కాస్తైనా వుందా ? తను దేనికీ కర్తను కానని తెల్సికూడా ఆ సైంధవుడి చావుకు కారణమౌతానని ప్రతిజ్ఞ చెయ్యలేదా ?

అభిమన్యుని వధను నువ్వడిగి మరీ చెప్పించుకునేదానివి. అందుకే నీకు మళ్ళీ గుర్తు చేస్తున్నాను ఎవరి కర్మకూ–ఎవ్వరూ కర్తలు కారు. అసలైన కర్త ఆ భగవంతుడు. అతని చర్యను విన్నబుచ్చే అధికారం మనకు లేదు. అది తప్పు.''

తనని చిన్నపిల్లను చేసి బుజ్జగిస్తుంటే, ఓదార్పుగా ధైర్యం చెప్తుంటే మనసును సమాధానపర్చుకునే ప్రయత్నంలో చిన్నగా అంది కృష్ణప్రియ.

''...ఎందుకో నేను మీలా ధైర్యం తెచ్చుకోలేకపోతున్నాను. సమాధాన పడటం కష్టమౌతోంది. నేను మీలా యోగిని కానండీ మామూలు మనిషిని.''

* * *

నారాయణ దుఃఖంలోంచి ఇంకా కోలుకోలేకుండా వున్నాడు.

తన స్వార్థం కోసమే తల్లిని పుష్కరాలకు పంపించాడు. విడిగా ఒక్కత్తే వెడితే డబ్బు ఖర్చవుతుందని తులశమ్మను వొప్పించి తీసుకువెళ్లమని బలవంతపెట్టి పంపించాడు. అప్పుడు ఖర్చంతా తులసమ్మే పెట్టుకుంటుంది. ఆ భారీ చెయ్యి నంటేది. అందుకే తల్లి అనారోగ్యంగావున్నా, వెళ్లలేనంటున్నా – డబ్బు





కోసం కక్కుర్తిపడి బలవంతాన పంపించాడు. ఏమైంది ? ? ?

తల్లి పోయిన దగ్గర్నుంచీ తనని అంటి పెట్టుకున్నారు స్నేహితులు. ఐనా తను తల్లిని ఎంత బలవంతంగా పంపించినదీ గుర్తుకు వస్తుంటే భరించలేని బాధ కృంగదీస్తోంది.

"నీలో నువ్వు ధైర్యం తెచ్చుకోకపోతే ఎట్లా ? ఆ కృష్ణతో పోలిస్తే నువ్వింకా అదృష్టవంతుడివే. వాడికి తల్లీ, వదినా కూడా పోయారు. వాళ్ల వదినది ఎంత చిన్న వయసు చెప్పు. వాడి తల్లి మనవల మీద ఆశపెట్టుకుని ఆశపెట్టుకుని ఆ కోరిక తీరకుండానే పోయింది. వాళ్ల బతికుంటే—మీ అమ్మపోతే విచారించాలి, ఇప్పుడు ఆ వైపు నుంచి ఆలోచించి చూడూ."

కాస్త వోదార్పు కలిగినట్లైంది.

"అవును. కృష్ణ తాలూకు వాళ్ల బతికుండీ తన తల్లిపోతే ఇంతగా విచారించాలి. వాళ్లు కూడా పోయారు కదా."

ఈ భావన కాస్తలో కాస్త నయంగానే అన్పించింది.

"నువ్వన్నదీ నిజమే."

బుద్ధిగా తలూపుతూనే గుమ్మంలో నిలబడ్డ కృష్ణారావుని చూసి తెల్లబోయాడు నారాయణ.

కంగారుగా లేచినిలబడ్డాడు.

కృష్ణారావు తన గుమ్మందాటి ఎవరింటికీ వెళ్లగా ఇంతవరకూ చూడలేదు—వినలేదు.

అందులో ఎక్కడికి వెళ్లనివాడు తన ఇంటికా ? తన ఇంటికా రావటం ? నారాయణతో బాటు అతని బృదం కూడా కంగారుపడింది.

అందరూ ఉమ్మడిగా అతని పరువుతియ్యాలనీ, నవ్వులపాలు చెయ్యాలనీ కంకణం కట్టుకున్న వాళ్ళే. అందుకోసం శక్తికొద్దీ శ్రమపడిన వాళ్ళే. ఆ విషయం కృష్ణారావుకి తెల్సనీ — వీళ్ళకు తెల్సు. తెల్సీ ఎందుకొచ్చినట్టు ?

"రారా కృష్ణా...అలా నిలబడిపోయావేం" రమణ మనసారా ఆహ్వానించాడు.

చనువుగా తన ప్రక్కన కూర్చుంటున్నాడు కృష్ణారావు. నారాయణకి చిరు చెమటలు పట్టాయి.

"అమ్మగారూ — వదినగారూ — అలా పోవటం ఘోరం... ఆ రోజు వచ్చాను."

సమాధానంగా కృష్ణారావు నవ్వాడు. దాని అంతరార్థం అక్కడున్న ఎవ్వరికీ అర్ధంకాలేదు. అంత శక్తి లేదన్న సంగతి ఒక్క రమణకే తెల్సు. కారణం అతను అంతర్గతంగా కృష్ణారావుని అభినందిస్తాడు కనుక.

"నారాయణా — అమ్మ పోయిన దుఃఖంలో వున్నావుట — ఇంకా కోలుకోలేదనీ — భోజనం కూడా సరిగ్గా చెయ్యటంలేదనీ — ఇందాక పని మనిషి కృష్ణప్రియతో చెప్తుంటే విన్నాను." ఆదరంగా భుజంనిండుగా చెయ్యివేసి—ఆప్యాయంగా అడుగుతున్న కృష్ణారావువంక తెల్లబోయి చూశాడు నారాయణ.

కృష్ణారావు కళ్ళల్లో శాంతి వెలుగుతోంది. ప్రేమ పొర్లుతోంది.

ఆదరం,అభిమానం, ఆప్యాయతా, మమతా, మార్దవం పోటీలమీద పలకరిస్తున్నాయి — అన్నిటినీ మించినది ఒక చల్లని భావం— సమైక్యతను సాధించగల అరుదైన భావం — ఏకత్వాన్ని సూచించగల దైవత్వం – క్షమనూ సహనాన్నీ స్వంతం చేసుకున్న అరుదైన వ్యక్తిత్వం –

అలా చూస్తుండగానే నారాయణలో విచిత్రమైన మార్పు కలగటం మొదలుపెట్టింది.

"అమ్మ పోవటం దురదృష్టమే – ప్రాప్తం లేకపోతే త్రాగాలనుకున్న పాలుకూడా చెయ్యిజారి నేలపాలవుతాయి. దానికోసం విచారిస్తామా ? భూమిమీద నూకలు లేకపోతే — ఈ జీవుడు క్షణమైనా భూమిమీద వుంటాడా ? వెళ్ళినవాడు తిరిగిరాగలడా ? తిరిగిరాలేని వాళ్ళనుగురించీ — మనకు ప్రాప్తంలేని వాళ్ళగురించీ - మన ఆరోగ్యాన్ని పాడుచేసుకోటం మంచిదా ? — భగవత్స్వరూపమైన కాలాన్ని వ్యర్థం చేసుకోటం మంచిపనా... నారాయణా – చదువుకున్నవాడివి నువ్వు..."

చటుక్కున కృష్ణారావు చేతులు పట్టుకున్నాడు నారాయణ.

ఇంతవరకూ తనకు పరిచయమున్న పరిధిలో




నేటి విద్యా విధానంలో చాలా మార్పులు వచ్చాయి. పూర్వం బాలునికిగాని, బాలికకు గాని అయిదేండ్లు నిండిన తర్వాతనే అక్షరాభ్యాసం చేసి బడికి పంపేవారు. పిల్లలు ఇతరుల సహాయం అక్కర లేకుండా బడికి వెళ్ళి వస్తూ ఉండేవారు. ఇప్పుడు మూడేండ్లు నిండకుండానే విశ్వప్రయత్నంతో బడిలో సీటు సంపాదించి ఆయాల సహాయంతో బడికి పిల్లలను పంపడం, తిరిగి యింటికి రప్పించడం జరుగుతున్నది. బడిలో చాలా నెలల పాటు ఆటవస్తువులతో పిల్లలను ఆడించడం, క్రమ క్రమంగా విద్య యందు ఆసక్తి కలిగించడం జరుగుతున్నది. దీనివల్ల తల్లుల బాధ్యత చాల వరకూ తగ్గుతున్నది. బడి, ఆ చిన్న పిల్లలకు ఇల్లుగానే కానవస్తుంది.

పూర్వపు పద్ధతి యిప్పటి వారిలో చాలా మందికి నచ్చదు. అయిదేండ్లకా పిల్లలను బడికి పంపడమని ఆశ్చర్యపోతారు. అయితే — ఆ అయిదేండ్లూ పిల్లలు మొద్దుల్లాగ ఇంట్లో కూర్చునే వారు కారు. తల్లి వారిని అలా కూర్చోనిచ్చేది కాదు.

పిల్లలకు తండ్రి దగ్గర కంటె తల్లి దగ్గరనే చనువు ఎక్కువ. వాళ్ళ మలమూత్రాలను ఎత్తి స్నానం చేయించి, ఆరోగ్యం చూచుకుంటూ, వాళ్ల ఆహారవిహారాల్లో శ్రద్ధ వహిస్తూ సంరక్షణ చేసేది తల్లి గాని తండ్రి కాదు గదా ! ఆమె మన పురాణాలలోని మహనీయుల కథలు చెప్పి, పురాణ పురుషుల యందు గౌరవభావాన్ని కలిగించి, నీతి కథలు చెప్పి వారికి మంచి స్వభావం అలవడేటట్లు చేసేది. అందువల్ల పిల్లలకు అయిదేండ్ల వరకూ అక్షరజ్ఞానం లేకున్నా మంచి జ్ఞానం కలిగేది. అందువల్ల శిశువులకు మొదటి గురువు తల్లియే ! ఇల్లే మొదటి పాఠశాల. మనం స్వామి వివేకానందులు మున్నగు మహనీయుల చరిత్రలను చదివినప్పుడు మాతృదేవత వల్లనే వారికి వివిధ రంగాలలో జ్ఞానం లభించినట్లు తెలుస్తున్నది. తల్లి బోధిస్తే తలకెక్కినట్లు బడిలో ఉపాధ్యాయులు బోధిస్తే తలకెక్కడం కష్టసాధ్యం. ఉత్తమ శీలానికి పునాదులు తల్లే వెయ్యాలి. తల్లి, తన బిడ్డల సంగతి పట్టించు కోకపోతే పిల్లలకు మంచి గుణాలు అలవాటు పడటం కష్టం. ఈ విషయం మహిళలు గమనించవలసి ఉన్నది.

నేటి మహిళలకు సంసార బాధ్యతతో పాటు ఉద్యోగ నిర్వహణ బాధ్యత కూడా అదనంగా ఉన్నందువల్ల పిల్లల బాధ్యతను వహించడంలో సమయం దొరకడం కష్టం. అయినా, పిల్లల పురోభివృద్ధిని కోరే మహిళలు ఇది కూడా ముఖ్యమే అని గ్రహించవలసి యున్నది. ★

స్వార్థాన్ని చూశాడు — ద్వేషాన్నీ, అసూయనూ, కసినీ, కక్షనూ, ప్రతీకారాన్నీ, మోసాన్నీ, కుత్సితత్వాన్నీ మాత్రమే చూడగలిగాడు. వాటినే తనతోబాటు పెంచుకుంటూ వచ్చాడు.

మనుష్యులతోనే పరిచయం వున్న అతను మనీషిని చూడటం ఇదే మొదలు. దైవాన్ని పరిహసించే అతను దైవత్వాన్ని చూడగలగటం — చూడగలననుకోటం కలలో వార్త.

దీన్నిగురించి కలగనే సద్బుద్ధికూడా లేని నారాయణ తన అదృష్టాన్ని నమ్మలేకపోతున్నాడు — తన కళ్ళని తనే నమ్మలేకపోతున్నాడు.

"వాళ్ళమ్మగార్ని తనే బలవంతంగా పంపించాట్ట — అందుకని ఆవిడ చావుకు తనే కారణమంటున్నాడు—అందుకనే కోలుకోలేకపోతున్నాడు మనిషి."

ఎవరో తరుముకొస్తున్నట్టు అన్నాడు లక్ష్మణ్.

తల దించుకున్నాడు నారాయణ.

"చదువుకున్నవాడివి. నువ్వే అలా అనుకుంటున్నావా ? అన్ని శాస్త్రాలూ చదివానన్నావ్ — నీకు నువ్వే సమాధానం చెప్పుకోలేకపోతున్నావా?"

అదిరిపడి చూశాడు నారాయణ.

మళ్ళా పొరపడ్డాడు — ఆ కళ్ళలో పరిహాసం వుంటుందా? ఎగతాళి వుంటుందా ? ఎత్తిపొడుపు వుంటుందా ?

## కర్మయోగి

నారాయణ కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి

"...నువ్వలా అనుకుని బాధపడటంలో తప్పులేదులే నారాయణా, అది సహజం. ఆ నరుడంతటివాడే— కృష్ణ నిర్యాణం అయాక— 'మన సారథి — మన సచివుడు ..' మనకి లేడని భోరున విలపించాడు. శ్రీకృష్ణుడు కాలుడనీ, లోక నియంత అనీ, ఆ సర్వేశ్వరుడనే తెల్సుండి కూడా అందరి జీవితాలకూ మార్గదర్శికమూ — ఆరాధ్యనీయమూ — ప్రమాణమూ ఐన గీతను సాక్షాత్తూ ఆ భగవంతుని నోటి ద్వారానే వినియుండీకూడా — కర్మవశాత్తూ — మాయ కమ్మి— మామూలు మనిషిలా ప్రవర్తించేవాడు — ఇంక మనమనగ్గా ఎంత ?

చూడు నారాయణా — మనమూ సర్వసాక్షి ఐన భగవంతుని చేతుల్లో కీలుబొమ్మలం. పుట్టించేవాడూ — ఆడించేవాడూ — లయం చేసేవాడూ ఆయనే. ఈ క్షణాన జరగబోయేదేమిటో — మనకు తెలియదు. మన భవిష్యత్‌ను మనమే నిర్దేశించుకోలేమా. అటువంటిది ఇతరుల కర్మానికి మనం కర్తలమనుకోటంకన్నా వెర్రితన ముందా? ఇవాళ పోయినవాళ్ళు అదృష్టవంతులు. రేపు వెళ్ళబోయే మనకీ దుఃఖం అనుభవించాల్సిన రాత వుంది. ఒక విధంగా దురదృష్టవంతులం. అందరూ చేరవల్సిన గమ్యానికి — మనవాళ్ళు ముందరే చేరుకున్నారు. అందుకు మనం సంతోషించాలి. అన్నివిధాలా అశక్తులమైన మనకి మంచి దారి చూపించమని ఆ భగవంతుని ధ్యానించుకునే సమయం మనకింకా మిగిలివుంది. ఆ విధంగా అదృష్టవంతులం. కాలం మనకి మిగిలుంది వ్యర్థం చేసుకోటానికి కాదు — సద్వినియోగం చేసుకోటానికి, తననే రెప్ప వాల్చకుండా చూస్తున్నాడు నారాయణ.

వాతావరణం స్తంభించినట్టూ,అందర్లోనూ చలనం ఆగిపోయినట్టూ వుంది.

"నారాయణా — వెళ్ళిరానా ?"

"...నేను...నేను నీకు చేసిన ద్రోహానికి—"

పశ్చాత్తాపంతో దహించుకుపోతున్న నారాయణకి మాటలు దొరకటంలేదు.

"...నువ్వా... నువ్వేం చేశావ్ ? నాకేం జరిగిందనీ —"

కృష్ణారావు చేతుల్లో మొహాన్ని దాచుకుని వెక్కిళ్ళు పెట్టాడు నారాయణ.

కల్మషం కరిగిపోయేలా, మనసు తేలికయేలా...

(ఇంకా వుంది)

# అసలైన తెలుపు ఏమిటో... ప్రపంచానికి చూపండి

# డెట్






## ఉత్తమం... ఉత్తమం... తెలుపులో సర్వోత్తమం!

డెట్ మీకు అందిస్తుంది ఎంతో ఎక్కువ. దీని క్రొత్త రేపర్ ఎంతో అందమైనది. ఆకర్షణీయమైనది. తీసి చూడండి, లోపల మరో ఆశ్చర్యం — ఉల్లాసకరమైన మనమోహక పరిమళం. అంతేకాదు, డెట్‌లో నిండి వున్నది ఎంతో ఎక్కువ తెలుపు శక్తి. మరి రండి, డెట్ ప్రపంచంలో అడుగిడండి. స్వయంగా చూడండి, అందరికీ చూపండి. డెట్ తెలుపు...అసలైన తెలుపు!

Shilpi DM 9A/84 Tel.



రజనీకాంత్—రాధ 'రౌడీలకు సవాల్'లో



'జననీ జన్మభూమి'లో బాలకృష్ణ, సుమలత




## భానుమతి, బాలకృష్ణ నటించే "మంగమ్మగారి మనవడు"

''డాక్టర్ పద్మశ్రీ భానుమతిగారు ఒక అపూర్వమైన పాత్రను పోషించడం, చాలాకాలం తర్వాత కర్ణపేయమైన రెండు గీతాలు గానం చేయడం మా చిత్రంలో విశేషం,'' అన్నారు భార్గవ ఆర్ట్ ప్రొడక్షన్స్ అధినేత ఎస్. గోపాల రెడ్డి. ఈయన మే 3న షూటింగ్ మొదలెట్టిన ''మంగమ్మగారి మనవడు'' చిత్రంలో బాలకృష్ణ, సుహాసిని నాయకా నాయికలు. గొల్లపూడి మారుతీరావు, గిరిబాబు, జానకి ఇతర ముఖ్య భూమికలు నిర్వహిస్తున్నారు. గణేశ్‌పాత్రో సంభాషణలు, సి. నారాయణరెడ్డి గీతాలు, కె. వి. మహదేవన్ సంగీతం, ప్రసాద్‌బాబు ఛాయ, కె. ఎల్. ధర్ శిల్పం, సురేష్ కుమార్ సహకార దర్శకత్వంతో ఈ చిత్రాన్ని డైరెక్ట్ చేసే కోడి రామకృష్ణ ''మే 24కి తొలి షెడ్యూల్ ముగుస్తుంది జూన్ 10 నుంచి 25 వరకు మలి షెడ్యూల్. దీంతో షూటింగ్ ఫినిష్ అవుతుంది,'' అని తెలిపారు

## కె. ఛటర్జీ "ప్రేమయుద్ధం"

''మే నెలనుంచి పూర్తిగా ఔట్‌డోర్‌లో షూటింగ్...సుప్రసిద్ధ మలయాళ డైరెక్టర్ భరతన్‌కు దర్శకత్వం బాధ్యతను అప్పగించాను. తమిళంలో కూడా ఒకేసారి షూటింగ్,'' అన్నారు కె. ఛటర్జీ. ఈయన నిర్మించే సమతాలయవారి ''ప్రేమ యుద్ధం'' చిత్రంలో సురేష్, జగ్గయ్య, శోభన, శ్రీవిద్య మున్నగువారు పాత్రధారులు.

## విజయబాపినీడు దర్శకత్వంలో శోభన్‌బాబు, జయసుధ

''ఆగస్ట్ నెలాఖరుకు విడుదల చేయాలన కుంటున్నాం,'' అన్నారు విజయబాపినీడు ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో ''పట్నం వచ్చిన పతివ్రతలు'' అనంతరం శ్రీనివాస ప్రొడక్షన్స్ అధినేతలు అట్లూరి రాధాకృష్ణ మూర్తి, కొమ్మన నారాయణరావు నిర్మించే ద్వితీయ చిత్రంలో శోభన్‌బాబు, జయసుధ, శరత్‌బాబు, గొల్లపూడి మారుతీరావు, మాతన్‌ప్రసాద్, గిరిబాబు, ఉదయకుమార్, వేలు, నిర్మల, రమాప్రభ,. కె. విజయ, రాజేశ్వరి. పండరీబాయి ముఖ్య భూమికలు నిర్వహిస్తున్నారు. మే 1 నుంచి 12 వరకు మొదటి షెడ్యూల్ జరిగింది. రెండవ షెడ్యూల్ జూన్ 20 నుంచి జూలై 10 వరకు, మూడవ చివరి షెడ్యూల్ జూలై 20 నుంచి 31 వరకు. సత్యమూర్తి సంభాషణలు, ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం సంగీతం, ఎస్. వి. రఘు ఛాయ, శివసుబ్రహ్మణ్యం నృత్యాలు, యాదు

'మంగమ్మగారి మనవడు'లో బాలకృష్ణ, భానుమతి



విజయశాంతి, చంద్రమోహన్ 'కొత్త పెళ్లికూతురు'లో





జయసుధ, శోభన్‌బాబు, కృష్ణ 'మహా సంగ్రామం'

శిల్పం, కె. సత్యం కూర్పు, సి. పుల్లారావు సహకార దర్శకత్వంతో గుత్తా మధుసూదనరావు ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్.

## "మహానగరంలో మాయాజాలం"

''మిస్టరీ థ్రిల్లర్. లత ద్విపాత్రాభియం విశేషాకర్షణ,'' అన్నారు బసవరాజు గోపాలకృష్ణ మూర్తి, ఈయన నిర్మించే వంశీకృష్ణ సినీ కంబైన్స్ వారి పై చిత్రంలో శివకుమార్, మనోరమ, ఇతర ప్రధాన పాత్రలు ధరించారు. వి. కుమార్, వింజమూరి కృష్ణమూర్తి సంగీత దర్శకులు. రవికాంత్ నగాయిచ్ తాంత్రిక ఛాయాగ్రాహకుడు. పట్టు దర్శకత్వంలో అరుణ, ఆదిలక్ష్మి సమర్పిస్తారీ చిత్రాన్ని.

## కృష్ణ హీరోగా ప్రభాకరరెడ్డి దర్శకత్వం వహించే తొలి చిత్రం

నటుడుగా, కథకుడుగా, నిర్మాతగా నిష్ణాతుడనిపించుకున్న డాక్టర్ ఎం. ప్రభాకర రెడ్డి వచ్చే సంవత్సరం దర్శకుడుగానూ తన ప్రతిభను ప్రదర్శించనున్నారు. శ్రీ లక్ష్మి మూవీ క్రియేషన్స్ పతాకంలో సి. హెచ్. చంద్రశేఖరరెడ్డి, పి. జె. ప్రసాద్ నిర్మించే చిత్రంలో కృష్ణ హీరో. మద్దిపట్ల సూరి సంభాషణలు, గోపి గీతాలు, సత్యం సంగీతం, మార్తాండ్ కూర్పు, సి. వి. శివరామయ్య నిర్వహణలో ఎ. రామచంద్రరావు సమర్పిస్తారీ చిత్రాన్ని.

## ధవళ సత్యం దర్శకత్వంలో మురళీమోహన్

శ్రీ వంశీకృష్ణ సాంబశివరావు సమర్పణలో శ్రీ విశ్వనాథ్ ఆర్ట్ పిక్చర్స్ అధినేతలు విశ్వనాథం, కొండలరావు నిర్మించే చిత్రం షూటింగ్ మే 11 నుంచి జరుగుతోంది. మురళీమోహన్, కార్తిక్, రాజేంద్రప్రసాద్, నూతన్‌ప్రసాద్, పి. ఎల్ నారాయణ, శివ ప్రసాద్, వేలు ఆదిగాగలవారు పాల్గొంటున్నారు. చక్రవర్తి సంగీతం, బి. యె. బేగ్ ఛాయ, రవీంద్రబాబు కూర్పుతో ధవళసత్యం కధ, స్క్రీన్‌ప్లే, మాటలు, దర్శకత్వ బాధ్యతలు వహిస్తున్నారు.

శరత్‌బాబు, వరలక్ష్మి, నరసింహరాజు 'మేమూ మీలాంటి మనుషులమే'లో



'కుర్ర చేష్టలు'లో దేవి, అన్నపూర్ణ, విజయశాంతి




'జనం — మనం'లో ప్రభ


'దేశంలో దొంగలు పడ్డారు'లో విజయశాంతి, సుమన్

కథా (కలర్) చిత్రం.

ఆర్థిక హోదాలు అంతస్తులు కంటె అభిమానము, ఆత్మీయతే గొప్పదని రుజువుచేసే ఈ చిత్రంలో చంద్రమోహన్, పూర్ణిమ, సుమన్, జగ్గయ్య, నిర్మల, కె. ఆర్. విజయ, సోమయాజులు, అల్లురామలింగయ్య, గిరిజ, చిట్టిబాబు మరియు దాసరి నారాయణరావు తారాగణంతో ఇరువది సంవత్సరాలుగా సినీరంగంలో వివిధ దర్శకులవద్ద అనుభవము సంపాదించిన యువకుడు లక్ష్మీశ్రీనివాస్ దర్శకత్వములో మూడువంతులకు పైగా తయారయింది. ముళ్ళపూడి మాటలు. కె. వి. మహాదేవన్ సంగీతదర్శకత్వం. నిర్మాతలు: ప్రమీలాగౌడ్, రుక్మారెడ్డి.



"మా పెళ్లి అయ్యాకకూడా ఈమె సినిమాల్లో నటిస్తుంది – లేకపోతే నేనెట్లా బతకటం! ?"

## ఎ. ఎన్. ఆర్., కోదండరామిరెడ్డి కాంబినేషన్‌లో అనూరాధా ఆర్ట్ కంబైన్స్ చిత్రం

"జూలై 11 నుంచి షూటింగ్. సెప్టెంబర్‌కి పూర్తయిపోతుంది," అన్నారు నన్నపనేని సుధాకర్. లోగడ ఈయన "ఇంద్ర ధనుస్సు, దీపారాధన" చిత్రాల నిర్మాతగా ప్రేక్షక లోకానికి పరిచితుడు. ఇప్పుడు ఈయన నిర్మాణ సారథ్యంలో తిరుపతిరావు సమర్పించే పై సంస్థ తొలి చిత్రంలో ఎ.ఎన్.ఆర్, సుహాసిని వగైరా తారాగణం. డి. వి. నరసరాజు సంభాషణలు, చక్రవర్తి సంగీతం, నవకాంత్ ఛాయతో నన్నపనేని భాగ్యలక్ష్మి, ఆర్. రామకృష్ణారావు నిర్మాతలు. ఎ. కోదండరామిరెడ్డి దర్శకుడు.

## తొలిరేయి ముచ్చట్లు

కిశోర్‌కుమార్ సమర్పించే ప్రమీలామూవీస్ వారి "తొలిరేయి ముచ్చట్లు" చక్కని కుటుంబ

## సుమన్ 'కౌబాయ్'గా కె. వాసు దర్శకత్వంలో కె. మహేంద్ర చిత్రం

"యాక్షన్ పిక్చర్. మే 23,24 తేదీలలో సాంగ్స్ రికార్డ్ చేస్తాం," అన్నారు గీతా ఆర్ట్ పిక్చర్స్ అధినేత కె. మహేంద్ర ఈయన చిత్రంలో సుమన్, శివకృష్ణ, సుదర్శన్, నూతన్‌ప్రసాద్, భానుప్రియ, జయమాలిని ముఖ్యభూమికలు నిర్వహిస్తారు. కథ, మాటలు పేరాల రాశారు. కె. సత్యం సంగీతం, విజయ్ ఛాయ, బి. ఎన్. కృష్ణ శిల్పం, నాయని మహేశ్వరరావు కూర్పు, రాజు సాహసాలు, శివసుబ్రహ్మణ్యం నృత్యాలతో ఈ చిత్రానికి దర్శకత్వం వహించే కె. వాసు "జూన్, జూలై నెలల్లో 1–20 తేదీల మధ్య హొగెనకల్, పాండిచ్చేరి, తడ ప్రాంతాలలో మొత్తం షూటింగ్ పూర్తయిపోతుంది." అని తెలిపారు.

'ఇల్లాలు – ప్రియురాలు'లో శోభన్‌బాబు, సత్యనారాయణ



"శ్రీశ్రీ" చిత్రంలో అబ్బూరి వరదరాజేశ్వరరావుతో దర్శకుడు బి. నరసింగరావు





జయమాలిని 'భారతంలో శంఖారావం'



అనూరాధ 'ఘరానా రౌడీ'లో

## హరికృష్ణ చిత్రం "వందేమాతరం"

''దేశానికి గ్రామాలే పట్టుకొమ్మలు. కూపస్థమండూకాలలా ఉన్న గ్రామీణులను జాగృతమొనర్చే ఇతివృత్తం,'' అన్నారు 'నేటి భారతం' టి. కృష్ణ. ఈయన దర్శకత్వంతో ప్రముఖ డిస్ట్రిబ్యూటర్ లక్ష్మీచిత్ర వై. హరికృష్ణ సమర్పించే శ్రీనికేతన్ ప్రొడక్షన్స్ ''వందేమాతరం'' చిత్రంలో సుమన్, సుహాసిని, రాజ్యలక్ష్మి, రమాప్రభ వగైరా తారాగణం. చక్రవర్తి సంగీతం, గోపాలరెడ్డి ఛాయతో వై. అనిల్‌బాబు నిర్మాత.

## అమితాబ్, శ్రీదేవిలతో సత్యచిత్రవారి హిందీ చిత్రం

ఎస్. రామనాథన్ దర్శకత్వంలో సత్యనారాయణ, సూర్యనారాయణ నిర్మించే సత్య చిత్ర ఇంటర్నేషనల్ వారి హిందీ చిత్రం తొలి షెడ్యూల్ ఏప్రిల్ 17 నుంచి 24 వరకు జరిగింది. అమితాబ్‌బచ్చన్, శ్రీదేవి, ప్రాణ్, వహీదారెహమాన్, కాదర్‌ఖాన్, డానీ, శక్తికపూర్, రంజిత్, నిరుపారాయ్ ముఖ్య నటవర్గం. ఆర్.డి. బర్మన్ సంగీత దర్శకుడు. వి.ఎస్.ఆర్. స్వామి ఛాయాగ్రాహకుడు.

## "దొంగలు బాబోయ్ దొంగలు"

''జూన్ నుంచి షూటింగ్,'' అన్నారు పి. బాబ్జీ. ఈయన త్రిమూర్తి అండ్ శశిరేఖా ఆర్ట్స్ పతాకంలో నిర్మించే చిత్రంలో కృష్ణ, రాధ, అంబిక, సత్యనారాయణ ప్రభృత తారాగణం. సత్యానంద్ మాటలు, పుష్పాల గోపీకృష్ణ ఛాయ, ఎం. తిలక్ సహకార దర్శకత్వం, డి. వెంకటరత్నం కూర్పు, ఎం. జయదేవ్ సహ దర్శకత్వంతో కె.ఎస్.ఆర్. దాస్ దర్శకుడు. కథ, సమర్పణ : డూండీ. ●

---

# ఆంధ్రసచిత్రవారపత్రిక

## రచయితలకు గమనికలు

**ఆంధ్ర సచిత్ర వారపత్రికకు కథలూ, యితర రచనలు పంపదలచుకున్నవారు**

**సంపాదకుడు, ఆంధ్రసచిత్ర వారపత్రిక, గాంధీనగరం, విజయవాడ-520 003.**

**అన్న చిరునామాకి వ్రాయాలి.**

★ కవరుమీద శీర్షికపేరు పేర్కొనడం మంచిది. రచయితలు తమ పూర్తి పేరూ, చిరునామా రచన చివరకూడా స్పష్టంగా వ్రాయాలి – హామీపత్రం జతచెయ్యాలి.

★ గేయాలు తిప్పి పంపబడవు వీటి పరిశీలనకు కూడా సుమారు ఏడు నుంచి ఎనిమిది వారాల గడువు అవసరం.

★ కథలుగాని, యితర రచనలుగాని తిప్పి పంపబడాలని కోరుకునే వారు – వారి స్వంత చిరునామాగల తగినన్ని **తపాలాబిళ్ల**లంటించిన కవరు పెట్టడం అవసరం.

★ రచనల గురించి పంపిన వెంటనేగాక ఎనిమిది వారాల తరువాత మాత్రమే వాటిపై నిర్ణయంకోసం ఎదురుచూడడం మంచిది. రచనల గురించి ఉత్తర ప్రత్యుత్తరాలకి తావులేదు. కాని– తప్పనిసరి పరిస్థితులలో వాటిపై వ్రాయవలసివస్తే రచయితలు – రచన పేరు – అది పంపినతేదీ, వాటి గురించి **వివరంగా తెల్పనిదే** పరిశీలించడం కష్టం.

★ మా కార్యాలయానికి రచనలు తెచ్చి ఇచ్చేవారు కూడా పై నిబంధనలన్నీ పాటించాలి. వారికి కూడా స్వంత చిరునామాగల తగినన్ని తపాలాబిళ్లలంటించిన కవరు జత చెయ్యాలి అన్న నిబంధన వర్తిస్తుంది.

★ కార్టూన్‌లు పంపేవారుకూడా ఎనిమిది వారాలలోగా మా మీద **ఉత్తరాల**దాడి చెయ్యకూడదు ... ప్రతీ కార్టూన్ వెనుక పూర్తి పేరు, చిరునామా వ్రాయాలి.

★ ప్రత్యేక సందర్భాలుగా వేసిన కార్టూన్‌ల కవర్లపై ఆ విషయం వ్రాస్తే వాటి పరిశీలన త్వరితంగా జరుగుతుంది.

★ రచనల ఎంపిక తరువాత వాటి ప్రచురణ వీలువెంబడి జరుగుతుంది.

★ రచయితలకు, కార్టూనిస్టులకు [ఒక్క ఉత్తరాలు, ప్రశ్నావళి, డాక్టర్ సలహాల శీర్షికలో 'పడ్డ' వారికి తప్ప తతిమ్మా అందరికీ] అవి పడ్డ ''ప్రతు''లను – కాలక్రమంలో వాటి పారితోషికాలను పంపుతాము. కాపీలు టపాలో పోయే ప్రమాదం వుంటుందే తప్ప పంపకపోవడం జరుగదు. **సం॥**



**చక్కని రచయిత్రి**

## ..... కుమారి జయలలిత

(35 వ పేజి తరువాయి)

ఆ తర్వాత కొంతకాలానికి జయలలిత మళ్ళీ తన రాజకీయ రంగ ప్రవేశం ప్రస్తావన తెచ్చే సరికి ఆమెకు ఎం జి. ఆర్ 'ఆల్ ఇండియా అన్నాడ్రావిడ మున్నేట్ర కషగం' ఆశయాలను, సిద్ధాంతాలను, నియమ నిబంధనలను వివరించే కొన్ని గ్రంథాలిచ్చారు. వాటిని కుణ్ణంగా చదివిందామె. 1982 జూన్ 4న ఆమెకు 'ఏ ఐ ఏ డి ఎం కె' పార్టీలో ప్రవేశం లభించింది 1983 జనవరిలో ఆమె ఆ పార్టీ కార్యదర్శినిగా ఎదిగింది. "దళిత జనోద్ధరణకు ప్రభుత్వం సేవలు చేయడం మాత్రం చాలదు. ఆ సేవలు ఎంతటివో ప్రజలందరికీ తెలియడం కూడా అతి ముఖ్యం. పైగా, చిత్తశుద్ధితో చేసే సేవలకు ప్రతిపక్షాల వారి విమర్శలు, హేళనలు ఉంటాయి. వాటిని ఎదుర్కోవాలి కూడా. ప్రొపగాండా సెక్రెటరీకి ఇలాంటి బాధ్యతలెన్నో ఉంటాయి," అంటుంది జయలలిత.

అప్పుడోసారి ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధి మద్రాసు వచ్చినప్పుడు ఎం జి. ఆర్ తో "హూ ఈజ్ జయలలిత?" అని అడిగితే, "మన ప్రొపగాండా సెక్రెటరీ," అని జవాబిచ్చారాయన కాని, 1983 ఫిబ్రవరిలో తిరుచెందూర్ అసెంబ్లీ బై ఎలెక్షన్ లో 'ఏ ఐ ఏ డి ఎం కె'తో పొత్తుసంగతి 'కాంగ్రెస్–ఐ' విస్మరించి ప్రత్యేకంగా పోటీ చేసినప్పుడు అక్కడ 'ఏ ఐ ఏ డి ఎం కె' అభ్యర్థి గెలుపొందడానికి కారకురాలు జయలలిత అని కీర్తింపబడింది. అంతేకాదు, 'డి. ఎం. కె' లోంచి కొందరు 'ఏ ఐ ఏ డి ఎం కె'లో చేరడానికీ హేతువు ఈమేనన్న ఘనతనూ దక్కించుకుంది.

"గ్రామరాజ్యం గురించి గాంధీగారు కన్న కలలు ఏమయ్యాయి? 37 ఏళ్ళ స్వాతంత్ర్యానంతరం ఢిల్లీ దర్బార్‌లోని నేతలుగాని, ఇతర రాష్ట్రాల మంత్రులుగాని మనదేశాన్ని ఏమాత్రం ఉద్ధరించారు? మనదేశ ప్రజల్లో 80 శాతానికి పైగా గ్రామాలలో నివసిస్తున్నారు. ఈ గ్రామాలు ఎక్కువగా ఉత్తర భారతంలోనే ఉన్నాయి. కాని, ఎలాంటి స్థితిలో ఉన్నాయి? మంచినీటి వసతి, విద్యుచ్ఛక్తి, రాకపోకల సౌకర్యాలు లేవు. అక్కడి ప్రభుత్వాలు అక్కడి గ్రామీణుల కనీస అవసరాల గురించి అసలు ఆలోచించినట్టే లేదు. ఎక్కడా ఏ పార్టీ చేయని ఎన్నో ప్రజోపయోగమైన కార్యక్రమాలను శ్రీ ఎం. జి. ఆర్. చేపట్టారు. స్వయం సమృద్ధి పథకంకింద తమిళనాడులో 50 గ్రామాల చొప్పున ఉన్న 378 పంచాయతీలలో మంచినీటి సరఫరా, రవాణా సౌకర్యాలు, శిశు సంరక్షణ శిబిరాలు, ప్రసూతి కేంద్రాలు, విద్యాలయాలు ఎన్నో నెలకొల్పబడ్డాయి. మధ్యాహ్న పౌష్టికాహార పథకంకింద 65 లక్షల బాలలకు, రెండు లక్షలకుపైగా వయోవృద్ధులకు పింఛను... ఇవికాక ఇటుపైన పేద ఎక్స్ సర్వీస్ మన్‌కూ, 10 నుంచి 16 ఏళ్ళలోపు బాలలకూ ఎన్నో సహాయ కార్యక్రమాలు విస్తరింపబడనున్నాయి. ఇందువల్ల ప్రభుత్వానికి ఇదివరకు 140 కోట్ల వ్యయమైతే, నూతన ప్రణాళిక మూలంగా 200 కోట్లకు పైగా వ్యయం పెరుగుతుంది. 36 లక్షలకుపైగా నిరుద్యోగులకు జీవనోపాధి కల్పించబడింది. ఇలాంటి బృహత్ప్రణాళికలెన్నో ఉన్నాయి. వీటిలో దేనికీ కేంద్ర ప్రభుత్వసాయం లభించలేదు. ఐనా, రాష్ట్ర ప్రజలమీద కొత్త పన్నుల భారం వేయకుండా ఇప్పటి తమిళనాడు ప్రభుత్వం దళిత జనోద్ధరణలో ఎంతోముందజవేస్తూ ఆదర్శప్రాయమైంది. అందుకే ఇతర రాష్ట్ర ప్రభుత్వాలు కొన్ని ఈ ప్రణాళికలను స్టడీ చేయడానికి కొందర్ని తమిళనాడుకు పంపించింది. రాష్ట్ర ప్రభుత్వాలనుంచి కేంద్రానికి రెవిన్యూ అధిక శాతంలో ముట్టుతోంది. కాని, రాష్ట్రాలకు స్వయం ప్రతిపత్తి లేదు. ఇలాంటి పరిస్థితిలో కూడా శ్రీ ఎం. జి. ఆర్. నాయకత్వంలో తమిళనాడు ప్రభుత్వం బలహీనవర్గాలకు ఎనలేని సేవ చేస్తోంది. ఇది గొప్ప విషయం కాదా?" రాజ్యసభలోకూడా ఇలాంటి విషయం గురించే ఉద్ఘాటించింది జయలలిత.

## ప్రముఖుల గురించి

"నా జీవితంలో నేను పాదాభివందనం చేసింది ఇద్దరికే. మొదట మా అమ్మకు, తర్వాత శ్రీ ఎం.జి ఆర్.కు... శ్రీమతి మార్గరెట్ థాచర్ అంటే నాకెంతో అభిమానం... ఇతర రాష్ట్ర ముఖ్యమంత్రుల్లో శ్రీ హెగ్డే అంటే నాకెంతో గౌరవం. ఆయన చిత్తశుద్ధితో సేవ చేస్తున్న మహనీయుడు అంతటి మహత్తరమైన వ్యక్తిని ముఖ్యమంత్రిగా పొందిన కర్నాటక ప్రజలు ఎంతో అదృష్టవంతులనే చెప్పాలి కాని, ఆయన ప్రభుత్వాన్ని కూలదోయడానికి ప్రయత్నాలు జరగడం శోచనీయమైన విషయం... అలాగే శ్రీ ఫరూఖ్ అబ్దుల్లా ప్రభుత్వం దేశ విద్రోహ చర్యలకు పూనుకోవడం మరో బాధాకరమైన విషయం సరిహద్దుల్లో ఉన్న జమ్ము కాశ్మీర్‌లకు ప్రత్యేక కాన్‌స్టిట్యూషన్ అనవసరం విజయవాడలోగాని, శ్రీనగర్‌లోగాని ప్రతిపక్ష పార్టీల ముఖ్యమంత్రుల సమావేశాలవల్ల జరిగిన ప్రయోజనమేమిటి? సమైక్యతకోసమా – అనుకుంటే అదికూడా ఈడేరలేదు కదా?"

జయలలిత చక్కని రచయిత్రి కూడా. "కుముదం, కల్కి, తుగ్లక్, తాయ్" వగైరా ప్రముఖ తమిళ పత్రికలలో ఈమె కథలు, వివిధ అంశాలపై వ్యాసాలు వెలువడ్డాయి.

"మార్గరెట్ థాచర్ – జయలలితలపై సాయుజ్య పరిశీలనను 15 పంక్తులలో వ్రాయుడు" అంటూ తిరుచ్చి భారతీదాసన్ యూనివర్సిటీ వారి 'మాస్టర్ ఆఫ్ ఫిలాసఫీ' చరిత్ర ప్రశ్నాపత్రంలో 15 మార్కుల ప్రశ్న ఒకటి ఇవ్వబడిందిటీవల

శ్రీ ఎం. జి. ఆర్. తర్వాత ముఖ్యమంత్రి పదవికి కుమారి జయలలిత వారసురాలవుతుందా? అని కొందరి ఊహాగానం

— జి. వి. జి.




## జె. డి. ఆర్. — ఆదోని

మనిషికి మనిషి ఎదురైనప్పుడు చిరునవ్వు నవ్వి మాట్లాడంలోని ఆంతర్యం ?

★ ఇది మరీ బాగుంది నవ్వుతూ పలకరించక ఏడుపు ముఖంతో పల్కరిస్తే — మీకేదో కష్టం వచ్చిందనుకుంటారు చూసేవాళ్లు, కదా మీకు నవ్వుముఖం పడదనుకునే ప్రమాదం వుంటుంది.

## కె. పి. — గుంటూరు

నేడు దేశంలో వివిధ ప్రాంతాలలో జరుగుతున్న మత కలహాలకు కారణం ఏమై వుంటుంది ?

★ ఓర్పులేక పోవడం. మత పరమైన కార్యకలాపాలని రాజకీయవేత్తలు స్వార్థానికి వాడుకోవడం. న్యాయానికి పండుగలు పబ్బాలు మనుషులని కలిపేవేగాని వేరు చేసేవి కావే !

## ఎస్.వి.ఆర్.ఆర్.— రూర్కెలా

లెట్ మీ నో, వై ది లైఫ్ ఈజ్ నథింగ్ బట్ సాంగ్ ఆఫ్ లవ్ ?

★ ఎవరికి బాబూ — ఈ జీవితమంతా ఒక ప్రేమపాట ! ఈ జీవితం అంతా— బ్రతుకు పోరాటానికే— బాట చాలా మందికి—తెలియదా ? రూర్కెలా వంటి కార్మిక నగరంలో వుంటూ కూడా !

## షణ్ముఖ — సువాబేడ

ఎంతో అవసరం అయితే తప్ప నిజానికి స్త్రీకి ఉద్యోగం అవసరం లేదనే నా అభిప్రాయం?

★ అవసరమే తప్ప మానసిక చైతన్యం సంగతి మరిచిపోతే—మాటలు యిలాగే వుంటాయి. గాలి రాని కొట్లో పడేసి — గాలి అవసరమైతే కాస్త పైకి వదుల్తాంలే అన్నట్టు.

మీ పేరు ముందు శ్రీమతి అని వుండదు. కారణం ?

★ ఈ శీర్షికకి అనవసరం—నేను శ్రీమతినో కన్యాకుమారినో— ఏది పడితే అది అడిగే అధికారం, ఏలా పడితే అలాగ బదులిచ్చే ధైర్యం— ఈ శీర్షిక లక్ష్యం. అంతే.

మీరు మాంసాహారులా ? శాఖాహారులా ?

★ శాఖాహారినే. కాని సరదాకి అప్పుడప్పుడు మనుషులని కాల్చుకు తింటానంటారు— వి.ఏ.కె. [ఎవరో అనుకునేరు— సరాగమాల విఏకే !]

డాక్టరు లేని తెలుగు సినిమా వుండదు కారణం ?

★ రోగం రాని మనిషి వుండక పోవడమే !

ద్వేషం నుంచి వచ్చిన ప్రేమ తియ్యగా వుంటుందని యిప్పుడే తెలిసింది.

★ శుభం. దాన్లోపడి — కాస్త యీ కార్డుల జోరు తగ్గించు నాయనా !

## పి. హెచ్. — కరీంనగరు

మానవుడు బ్రతకడం కోసం తింటున్నాడా? తినడం కోసం బ్రతుకుతున్నాడా ?

★ ఈ మాట చాలా పాతమాట. ఇప్పుడు మానవుడు దొరికినప్పుడు తింటున్నాడు!

సాధారణంగా స్త్రీలను సున్నితమైన పుష్పాలతో ఉదహరిస్తుంటారెందుకు?

★ తెలియక !!

## పి. ఎస్ — అనన్తపురం

ప్రేమకు వయసు లేదంటారు. ఇది ఎంత వరకు నిజం?

★ నిజమే. కామానికి వయసు కాని ప్రేమకి కాదు.

## పి. హెచ్. జి. — బెట్లఘర్

జీవితంలో అనుకున్నది ఒకటి. జరిగేది ఒకటి అయ్యేటప్పుడు జరిగే దానితో తృప్తి పడాలా? అనుకున్నది అవకాశం వుంటే సాధించాలా?

★ అవకాశం వుంటే సాధించాలి. లేనప్పుడు 'సాదిస్తూ' జీవితం నరకం చేసుకోకూడదు.

## పి.ఎస్.పి. — కార్వార్

ఒక తల్లిగా కులాంతర వివాహాలను హర్షిస్తారా ?

★ ఇద్దరూ యిష్టపడితే — హర్షించడానికి అభ్యంతరం ఏముంటుంది ?

## టి. బి. ఎస్. పి. — కాతేరు

ప్రతి న్యాయస్థానంలోనూ కళ్లకు గుడ్డ కట్టిన ఆడబొమ్మ వుంటుంది. మగబొమ్మ ఎందుకు ఉండకూడదు ?

★ మగవాడు చూడకుండా వుండలేడని కాబోలు తమ్ముడూ—న్యాయదేవతని ఆడదాన్ని చేశారు. ఆమెకి చూసికాక—విని న్యాయం చెప్పడం అలవాటు చేశారు !! అంతే.

## ఎమ్. ఏ. — ఢిల్లీ

మీరింత పేరు ఎలా సంపాదించారండీ ?

★ అదే నాకూ అర్థం కావడం లేదు!!

## డి.బి.పి. — తిరుచ్చి

అక్కా, యీ లోకంలో మంచికి స్థానం లేదని అంటాను. నేను ఎవరికేనా ఎంత మంచి చేసినా అది చెడుగా మారుతోంది. దీనిమీద మీ అభిప్రాయం ?

★ నీ అభిప్రాయం అలా వుంటే — యింక నేనేం చెప్పి ప్రయోజనం తమ్ముడూ, మంచికి స్థానం — ఎప్పుడూ వుంటుంది... మంచేనా, చెడేనా చేసినది చెప్పి చెప్పి ప్రాణాలు తోడితే — అంతే అవుతుంది.

## ఎ.ఎస్.ఆర్. — కొమ్మగూడెం

ఆదర్శ వివాహం తప్పు అని, ప్రేమించి పెళ్లి చేసుకోవడం మరీ తప్పు అని అంటున్నారు. దేవుడిచ్చిన అమూల్యమైన కానుకని,ఎందులోనూ తృప్తిపరచలేని మనిషికి ప్రేమ తృప్తినిస్తుందని అంటాను.

★ ప్రేమకానుక కాదు—బాధ్యత. ప్రేమకి తృప్తేలేదు. అది దిన దినగండం, దీర్ఘాయువుగా పెరుగుతుంది !

## పి. ఎస్. ఆర్. — హైదరాబాదు

కల నిజమైతే ?

★ 'అరె, కాస్త మంచికల కనివుండేవాడివే' అని బాధ పడిపోతారు ! ★



ముంధా వెంకట రమణశాస్త్రి సీరియల్

# ఉదయసంధ్య

( గత సంచిక తరువాయి )

కాళిదాసు కళ్లజోడు ఒక్కసారి సవరించుకొని అన్నాడు... "రామం... మన కుటుంబ పరిస్థితే నీతో మాట్లాడదలచుకున్నాను. నువ్వు ఇంటికి పెద్దవాడివి. లోకాన్ని చూస్తున్నావ్... చదువు పూర్తికావస్తోంది. నీకు... మంచీ చెడ్డా తెలుసుకోదగ్గ వయసొచ్చింది..." అని ఊరుకున్నాడు.

"చెప్పు నాన్నా..." రామం తండ్రిని ప్రోత్సాహించేడు

"రెండు సంగతులు మనం ముందు తేల్చుకోవాలి. చదువయిపోయేక ఏం చేస్తావ్. ఎస్. ఎస్. యల్. సి. అయిపోతే అక్కడితో, ఆపడమా, పై చదువులకి వెళ్లడమా ? ఆపుతే నీకు భావిఏమిటి. చదవదలచుకుంటే ఆ డబ్బూ, ఏర్పాట్లూ ఎలా జరుగుతాయి ? ఈ వారాలు చేసుకోడం నాకిష్టంలేదు. చిన్న వయసులో బాధలేదుకాని, పదిహేను దాటాక మంచి పని కాదు. నీకు ఉండవలసిన చొరవ, ఆత్మ విశ్వాసం వృద్ధికావు. అది మొదటి పాయింటు. రెండో పాయింటు నీ చెల్లెలి పెళ్లి సంగతి. దానికి పధ్నాలుగు వస్తాయి. పెళ్లికి వయసు చిన్నదే. కాని కొన్నివిధాల ఈ వయసులో పెళ్లిచేస్తే కొన్ని ఎడ్వాంటేజెస్ ఉన్నాయి. పిల్లవాళ్ల సంసారంలో కలిసిపోతుంది. దాని మనస్తత్వం ఆ పరిస్థితులకి సులభంగా సర్దుకుంటుంది. నీ అభిప్రాయం ఏమిటి ?" అని మధ్యాంతరంగా ప్రశ్న వేసేరు.

"నన్ను అడుగుతే నాన్నా... శారదని మెట్రిక్ కట్టించి మినిమమ్ ఎడ్యుకేషన్ ఇవ్వాలని ఉంది."

కాళిదాసు నవ్వేడు... "ఒప్పుకుంటానం బాబూ... నాకూ అలానే అనిపిస్తుంది. నేను దానికి చదువు చెప్పగలను. కాని తరవాత ఏవౌతుంది ? దానికి కనీసం మెట్రిక్ పాసయిన సంబంధం చూడాలి... ఎక్కడని వెతకడం... అప్పటికి పిల్లకి పదిహేడు దాటుతుంది. ఎన్నో ప్రోబ్లమ్సు ఉన్నాయి. నీకు ఆ ప్రోబ్లమ్సు అంటకట్టడం నాకిష్టంలేదు. మన కళ్ల ఎదురుగా ఉన్న మంచి సంబంధాన్ని వదులుకోడం మంచిదికాదనిపిస్తోంది."

"కామయ్యా ?"

"ఔను. కుర్రాడు ఎంత బుద్ధిమంతుడూ, మంచి మనసున్నవాడూ అయినదీ మనకి తెలుసు. భూములు చూసుకుంటాడు. దానిలో వాటా తక్కిన వాళ్లకీ వెళ్తుందనుకో... కాని పల్లెటూరుని నమ్ముకొని ఉండవలసినవాడు కామయ్య. పట్నంలో జీవనోపాధి వెతుక్కోవలసిన వాళ్లు తక్కినవాళ్లు. వాళ్ళు నాగలి పట్టలేరు. కామయ్య పట్టగలడు. కూలీలతో భుజానికి భుజం కలిపి పనిచెయ్యగలడు. పైగా మనం అంటే అభిమానం పెడతాడు. శారద అంటే వాడికి వల్లమాలిన అపేక్ష. దానికీ వాడంటే ఇష్టమే. కాబట్టి ఇందులో ఎంచవల్సిందేమీ లేదు. ఇంక అత్తామామలు దాన్ని స్వంత కూతురులా చూసుకుంటారు."

"కొండయ్యతో మాట్లాడేవా ?"

"సూచాయగా తెలుసువాళ్లకి. వాళ్ళ పిల్లని నీకిద్దామా అన్న ఆలోచన కొండయ్యకుంది. కాని అది ఇప్పుడు తేలేదికాదు. అంతవరకూ ఈ సంగతి తేల్చకుండా ఉంచమాలేను. అందుకు వచ్చేవారం కొండయ్యని అడుగుదామనుకుంటున్నాను... ఆనవాయితీ ప్రకారం ... పిల్లని ఇస్తాం అని చెప్తాం. కుర్రాడి జాతకం బాగుంది. ఇద్దరి జాతకాలూ మ్యాచ్ అవుతున్నాయి."

"కట్నం?"రామం అడిగేడు సందేహిస్తూ.

"అదే ఎటూ తేల్చడు. నేను కొండయ్యకి రెండువేలవరకూ బాకీ ఉన్నాను. మన భూమి మీద వచ్చేదమ్మి బాకీ కొంతయినా చెల్లుకొడదామనుకుంటే వచ్చిన డబ్బు ఈ ఖర్చుకీ, ఆ ఖర్చుకీ అయిపోతోంది... మనకున్న భూమిని పదిహేనువేలకి కొండయ్యకమ్మి, బాకీ తీర్చి, ఐదు వేలు కట్నం ఇచ్చి, రెండువేల ఖర్చుపెట్టి పెళ్ళి చేసి, వెయ్యి రూపాయలు పిల్లకి చీరా సారెకీ పెడితే ఇంకా ఐదువేలు చేతిలో ఉంటాయి. ఆ డబ్బుతో నువ్వు స్థిరపడే ఉపాయం ఆలోచించాలి..."

"ఎకరానికి మూడు వేలు తక్కువ. కృష్ణంరాజుగారికి అమ్మితే ఎకరానికి కనీసం ఐదువేలిస్తారు..." రామం అన్నాడు... "కనీసం నాలుగు వేలన్నా కొండయ్య ఇవ్వడా ?"

"నాలుగువేలు అడుగుతాను...కాని ఇవ్వడు, ఇచ్చినా కట్నం ఎక్కువ చేస్తాడు. ఒక చేతితోఇచ్చి, రెండో చేతితో తీసుకుంటాడు. మరో సంగతి ఆలోచించు. కొండయ్యకి భూమి వెళ్తే అది మన సంసారంలో ఉన్నట్టేకదా? దాని వ్యవసాయం కూడా కామయ్యే చూసుకుంటాడు. కాబట్టి ముందు ముందు దానివల్ల ఫలితం దొరికేది మన పిల్లకే. ఇద్దరి భూములూ పక్క పక్కనే ఉన్నాయి..."

రామానికి దిగులు పట్టుకుంది..."అయితే నాన్నా...మనకి గడిచేదెలాగ. మనకి ధాన్యం, అపరాలూ, మానె అన్నీ సంవత్సరానికి సరిపడా ఆ భూమి వల్లే వస్తున్నాయి కదా? ఇవుడు భూమిపోతే నీ జీతం సరిపోతుందంటావా?"

**జరిగిన కథ — 7 :** రామం వారాలు చేసుకుంటూ చదువుకుంటుంటాడు. దుర్గమ్మ కూతురు మీనాక్షి రామాన్ని ఆదరిస్తుంది. పూర్ణమ్మ ఇంటిలోని వీధి కొట్టులో రామం నివాసం. ప్లీడరు సీతారామయ్యగారి మేనకోడలు నిర్మలకు రామం అంటే ఇష్టం. శాంతమ్మగారి నడిగి వాళ్లింట్లో గదిలో ఉండడానికి నిశ్చయించుకుంటాడు రామం. వెంకటేశ్వరులు రాసిన ప్రేమ పద్యాలు చదివి లత రామంమీద విరుచుకుపడి అతనిని అవమానిస్తుంది. శాంతమ్మ రామంను తమ ఇంటికి వచ్చి ఉండమని చెపుతుంది. రామం మాటలను పెడచెవిన పెడతాడు వెంకటేశ్వరులు. నిర్మలంటె విశాలకి పడదు. వరలక్ష్మి రామాన్ని రత్నాన్ని ఒక దారిలో పెట్టమని కోరుతుంది. రామం సెలక్షన్సులో మొదటివాడుగా సెలక్టయ్యాడు. వెంకటేశ్వర్లు రాసిన పద్యాలు 'భారతి'లో ప్రచురింపబడ్డాయి. రామం తండ్రి నుంచి మనియార్డరు, ఉత్తరం అందుకొంటాడు. లత మీద పద్యాలు రాసింది రామమేనని అతని చెంపలు ఛెల్లుమనిపిస్తాడు చంద్రం. రామం కళ్లు తిరిగి పడిపోతాడు. సీతారామయ్య చంద్రంచేత రామంకు క్షమాపణలు చెప్పిస్తారు. రామం పుట్టిపెరిగిన అగ్రహారం వెళుతాడు. రామం కుటుంబ సభ్యులు రామం రాకకు సంతోషిస్తారు. చెల్లెలు శారదను కొండయ్య కొడుకు కామయ్య కియ్యాలని తన పెద్దల అభిప్రాయం అని తెలుసుకొంటాడు రామం. ఈ పెళ్లికన్నా చెల్లెలికి చదువు చెప్పిస్తే మంచిదని తల్లికి చెపుతాడు. రామం తండ్రి కాళిదాసు రామాన్ని కొన్ని సంగతులు మాట్లాడను పిలుస్తాడు.

కాళిదాసు రామంకేసి ఆలోచిస్తూ చూసేడు...''అదే బాబూ నిన్ను ఆడగదలుచుకున్నది. నువ్వేం చెయ్యదలచుకున్నావ్? ఇంకా చదువుతావా? ఇంతటితో ఆపి ఏదో ఉద్యోగం చూసుకొని ఆర్థికంగా నాకు సహాయ పడతావా? నువ్వు ఆలోచించి నాకు చెప్పు...దాని బట్టే నా నిర్ణయం ఉంటుంది...''

రామానికి ఆ నిర్ణయం బరువు చాలా ఎక్కువ అనిపించింది...''నాన్నా! నీకేది మంచిదని తోస్తే అదే చెయ్యి. నువ్వు నన్ను ఏం చెయ్యమంటె అదే చేస్తాను...నీ మాటే నా మాట నాకు ఏదిమంచో, ఏది చెడ్డో తెలీదు...నిర్ణయించవలసినవాడివి నువ్వూ, అమ్మా... కొండయ్యతో మాట్లాడు—కాని ముందు కామయ్య చెవిని వెయ్యి పిలిచి. వాడు మన పక్షం నిలుస్తాడు. కట్నమన్నా తగ్గుతుంది ...'' అన్నాడు రామం...

పకపకానవ్వి, రామం భుజం తట్టేడు కాళిదాసు... ''బాగా అన్నావురా నాన్నా...అందుకే నీ సలహా అడిగినది...''

* * *

ఒక రోజున కామయ్యతో మాట్లాడింది రామం తల్లి కాంతమ్మ. సూచాయగా చెప్పింది. ''మావయ్య తొందర పెడుతున్నారు బాబా నన్ను. పిల్ల పెద్దదౌతోంది. ఇప్పుడే ఏమాటన్నా అనేసుకుంటే మా మనసు కుదుట పడుతుంది. ఇంక మాకున్న ఆస్తిపాస్తుల విషయం తెలుసును కదా. డబ్బుతో ఏముంది బాబూ! ముఖ్యం అయినది వంశం, సాంప్రదాయం, పిల్ల గుణగణాలూ. వాటి గురించి నీకు చెప్పవల్సింది ఏమీ లేదు. డబ్బు ఇంతకి పదిరెట్లు నువ్వార్జిస్తావ్.'' అంటూ అలా చెప్పుకుంటూ వెళ్ళి ఆఖరికి అంది— ''రామం పట్నం వెళ్ళే లోపున మనం మాట అనేసుకుంటే, వేసంగిలో ఈ కార్యం జరిపించ వచ్చు. తరవాత మా మనసు తేలిక పడుతుంది. మీ వాళ్లతో వచ్చేవారం మంచిరోజు చూసుకొని మాటాడదాం అనుకొంటున్నాం...కట్నం పట్టిం పొస్తే నువ్వు మాటసర్దాలి... పొలం అంతా అమ్మేస్తే రామం చదువుకి ఏమీ మిగలదు... మాకూ దినం గడవాలి...ఎకరం నాలుగువేలుంది.. రెండెకరాలు మీ పేర రాయించుకొని, రెండువేలు మీకివ్వలిసింది మినహాయించుకుంటే, ఆరువేలుతో ఈ కార్యం గట్టెక్కుతుంది. వెయ్యి మాట పదహార్లూ, వెండి చెంబూ, పట్టుబట్టలూ, లాంఛనాలూ ఉన్నంతలో వేడుకలు జరిపించి పెళ్లి చేస్తాం. అంతకన్నా తూగే తాహతు మాకులేదు...ఇదీ బాబూ సంగతి...''

కామయ్య ముఖం సంతోష పూరితమయినది. ''నాకసలు ఈ కట్నం కానుకలూ ఏమీ పట్టింపు లేదత్తా...ఎందుకివన్నీ...మీరు ముందు నాన్నతో

మాట్లాడండి ... తక్కినది నేను చూసుకుంటాను.'' అన్నమాట ఇచ్చేడు కామయ్య. అతడి కళ్లు శారదకోసం వెతికేయి...శారద ఎక్కడో లీలగా కనిపించినట్టయింది వెనకని... ఆమె కళ్లొక్కసారి కృతజ్ఞతతో, సంతోషంతో మెరిసినట్టయింది.

* * *

రామం ఇంక గట్టిగా చదువుదాం అనుకుంటు ఉంటే ఒకనాడు పొద్దున్న వెంకటేశ్వరులు ఊడిపడ్డాడు. పదిగంటలయింది. ''ఎవరో బాబు పట్టంనించొచ్చినారు'' అని పాలేరు తీసుకొచ్చేడు. వెంకటేశ్వరులు చావిడిలోకొచ్చి అడిగేడు ... ''కాళిదాసుగారి ఇల్లు ఇదేనండీ?'' అని. ఇంట్లో రామం కాని, కాళిదాసు కాని లేరు. రామం ప్రక్కవాళ్ల ఇంటికి వెళ్లేడు. కాళిదాసు పని మీద పొలానికి వెళ్లేడు.

శారద బయటికొచ్చి, పంచీలో నిల్చున్న వెంకటేశ్వరులుని చూసి ఆశ్చర్యపోయింది. ఎవరీ అబ్బాయి... తెల్లగా పొడుగ్గా ? '' ఎవరు కావాలండీ ?'' అని అడిగింది ...

తను ఒక ఇంటికి బదులు మరొక ఇంటికి వచ్చేననుకున్నాడు వెంకటేశ్వరులు. శారదని చూసి నోరు తెరుచుకొని ఉండిపోయేడు. రామం కొక చెల్లెలుందని విన్నాడు. కాని ఈ పల్లెటూరిలో, తన ఇంట ఉంటూ వారాలు చేసుకుంటున్న రామం ఇంట్లో, ఇటువంటి సలక్షణమైన, అతి సుకుమారమూ, సుందరమూ అయిన కన్నెపిల్ల ఉందంటే, ఇది రామం ఇల్లు అయి ఉండదనుకున్నాడు. ఇల్లు పెద్దది... మరి రామం పరిస్థితులు అందుకు భిన్నంగా ఉన్నాయి.

అతను మాట్లాడకపోయేసరికి.. ''మీకెవరు కావాలి ?'' అని మరొకసారి అడిగింది శారద.

''కాళిదాసుగారి ఇల్లు ఇదేనా ?''

ఇటీవల బొబ్బిలిలో జరిగిన శ్రీ రావుగోపాలరావు సన్మాన సభలో సన్మానితునితోపాటు ఫిలిం సెన్సార్ బోర్డు సభ్యుడు శ్రీ టి. సుబ్బరామిరెడ్డి, విశాఖ డైరీ ఛైర్మన్ శ్రీ శంబంగి వెంకట చిన అప్పల నాయుడు గార్లని చిత్రంలో చూడవచ్చు.



# ఉదయ సంధ్య

''ఇదే ..''

''రామం ఉన్నాడా ?''

''ఉన్నాడు... పక్క ఇంటికి వెళ్లేడు ... వస్తాడు కూర్చోండి... అమ్మా ! అన్నయ్యకోసం ఎవరో ఒచ్చేరు చూడు...'' అంటూ చూస్తూ నిల్చుంది, కాంతమ్మ వచ్చింది ... ''ఎవరు బాబూ !'' అంటూ ...

''నా పేరు వెంకటేశ్వరులండీ ... పట్నం నించి వస్తున్నాను .. బులుసు వాళ్ల అబ్బాయిని. రామం మా ఇంట్లోనే ...''

''నువ్వా! రా... రా... అలా నిలబడి పోయేవేం... ఇంట్లోకిరా... శారదా... ఆ సంచీ అందుకో... రా బాబూ ... అమ్మా నాన్నా కులాసాయేనా ?'' అంటూ ఆనందంగా ఆహ్వానించింది కాంతమ్మ.

అప్పటి వరకూ లేని సిగ్గు ఒక్కసారిగా ముంచుకొచ్చింది శారదకి... తలదించుకొని సంచీ అందుకోబోయింది ... ''ఎందుకులెండి మీకు శ్రమ...'' అన్నాడు వెంకటేశ్వరులు.

శారద ప్రక్కఇంటికి వెళ్లి అన్నని పిలుచుక వచ్చింది. వెంకటేశ్వరుని చూసి ఆశ్చర్యపోయేడు రామం... ''ఏంరా వెంకూ... ఏమయింది ?''

వెంకటేశ్వరులు నవ్వి అన్నాడు ... ''ఏమీ అవలేదురా... పండుగలయిపోగానే వస్తానన్నావ్.. రాలేదు. నీ కోసం ఆదినారాయణ కలవరిస్తున్నాడు... నేను కలువరిస్తున్నాను...సీతారామయ్య గారు అడుగుతున్నారు...మీనాక్షి రెండు మూడు సార్లు మా ఇంటికొచ్చి అడిగింది...నిన్ను వెంటనే తీసుకరమ్మని నన్ను పంపించేరు అందరూ ...''

''ముందు స్నానం చెయ్యి ... తరవాత మాట్లాడదాం ... శారూ, వెంకూకి నీళ్లు పెట్టించు... రారా... నా గదిలోకి ...'' తన గదిలోకి తీసుకవెళ్లి కుర్చీ చూపించేడు.

కాళ్లు కడుక్కొని లోపలికి వచ్చేడు వెంకటేశ్వరులు... శారద నీళ్లతోనూ, తువ్వాలు తోనూ అడ్డుపడగా, కాంతమ్మ ఎన్నో ప్రశ్నలు వేసింది. ఇంతలో టిఫినూ, కాఫీ తెచ్చి ఇచ్చింది శారద... ఆకలి విపరీతంగా ఉండడాన, మారు మాట్లాడకుండా తెచ్చిన ప్లేటు, గ్లాసూ కాళీ చేసేడు వెంకటేశ్వరులు.

తరవాత స్నానం పూర్తిచేసుకొని వచ్చి కూర్చున్నాడు. స్నేహితులిద్దరూ కబుర్లలో పడ్డారు. శారద మరి కనిపించలేదు... ఎక్కడో వంటింట్లో ఉంది. వెంకటేశ్వరులు దృష్టి మాటిమాటికీ ద్వారంవేపు వెళ్లేది సది అయ్యేసరికి... లత, సావిత్రి ఈ శారద ముందు దిగదుడుపే, ఆడది ఇంత అందంగా ఉంటుందా... తన కళ్లు తనకి భ్రమ కలిగించలేదుకద ? మరొక్కసారి చూడాలి... ఈసారి నిశితంగా ముఖాన్ని చూసి ఒక నిర్ణయానికి రావాలి... రావడం ఎంత అదృష్టం. తనే రాకపోయి ఉంటే రామం చెల్లెలు ఇంత అందంగా ఉంటుందని తనకి తెలిసిపోను... ఛీ! లతమీద కవిత్వం రాసేడు తను... గర్వంతో మత్తెక్కిన ఆడదానిమీద... ఈ 'స్వీట్ ఇన్నోసెన్స్' ఏదీ లతలో ?

''ఇక్కడే ఉండి చదువుకుందాం అనుకుంటూ ఉండగా నువ్వొచ్చేవ్... నువ్వూ ఉండిపోరాదూ? ఇద్దరం కలిసి చదువుకుందాం... అక్కడికి వెళ్తే మనకి చదువు సాగదు...'' రామం అన్నాడు.

ఆ మాట అనడమేమిటి వెంకటేశ్వరులుకి చాలా బాగుందనిపించింది. ''అదీ మంచి ఐడియాలే... నేనొకసారి ఊరెళ్లి బట్టలు తెచ్చుకోవాలంతే...'' అన్నాడు.

భోజనానికి లెమ్మంది కాంతమ్మ. ''నాన్న రానీ అమ్మా !'' అన్నాడు రామం.

''అతనెప్పుడొస్తారో తెలీదు ... మీరు కానీండి...''

వడ్డన జరిగింది. కాళ్లు మరోసారి కడుక్కున్నప్పుడు తువ్వాలందించింది శారద వెంకటేశ్వరులుకి. అప్పుడు వెంకటేశ్వరులు శారదకేసి చూసి అడిగేడు... ''నీ పేరు శారద కదూ ?''

''మీకెలా తెలుసు ?'' అని శారద అడిగింది.

''అక్కడ రామం రోజూ చెల్లెలిని తలచుకోవడమేగా ? మరి నువ్వు రామం చెల్లెలివి కావా ?''

''ఔను !'' తువ్వాలందుకుంది.

మరింకేం మాట్లాడాలో తెలియలేదు వెంకటేశ్వరులుకి. రామం అక్కడే ఉన్నాడు. ''తెలివైన పిల్లరా వెంకూ. మంచి మార్కులు తెచ్చుకొనేది. అదే విశాఖపట్నంలో ఉంటే చదువు కంటిన్యూ అయేది... పోనీ ప్రయివేట్‌గా చదివిద్దాం అంటే నేనిక్కడ ఉండందే జరగదు...''

ఇంతలో కాళిదాసు రాగా, ముగ్గురికీ వడ్డన జరిగింది. కాళిదాసు వెంకటేశ్వరులుని తరచు చూస్తూనే ఉన్నాడు, మూడు నాలుగు నెలల కొకసారి పట్నం వెళ్లినప్పుడల్లా. అందరి గురించీ కుశలప్రశ్నలు వేసి, వచ్చిన కారణం తెలుసుకొని, ఇక్కడే చదువుకుంటే బాగుంటుందని సలహా ఇచ్చేడు.

భోజనాలయిపోయేక వెంకటేశ్వరులు విశ్రాంతి తీసుకున్నాడు. రామం, తండ్రి కచేరీ గదిలో వున్నకాలు వేసుక చదువుకుంటున్నాడు. కాళిదాసు మళ్లా పనిమీద వెళ్లిపోయేడు. వెంకటేశ్వరులు కళ్లు మూసుకున్నాడేకాని నిద్ర పట్టలేదు. శారద మువ్వలపట్టీల చప్పుడు వినిపిస్తూనే ఉంది. తల్లీ కూతుళ్ల మాటలు చిన్న గొంతులో అప్పుడప్పుడు వినిపిస్తున్నాయి. శారద ఒకసారి తన గదిలోకి తొంగిచూసి, తను పడుకోడం గమనించి, గదిలోకి వచ్చి, బీరువా

తెరిచి అందులోనుంచి ఏవో బట్టలు తీసుకుంది. మరికొంతసేపు పోయేక మరొకసారి వచ్చింది. ఈసారి మంచం కాళ్లవేపున్న కావిడిపెట్టె తెరవబోయి, కొంచం తూలి మంచం పట్టుకుంది. ఆమె చెయ్యి వెంకటేశ్వర్లు కాలుమీద పడింది... వెంకటేశ్వర్లు లేచి కూర్చున్నాడు ... ''ఏమయింది...'' అంటూ...

శారద కాస్త కంగారుపడింది... ముఖం సిగ్గుతో ఎర్రబడింది. ''కావిడిపెట్టెలో గిన్నె కావాలి... మంచంకోడు తగిలింది.''

''ఉండు...నేను తీస్తాను...'' అంటూ మంచం దిగివచ్చి పెట్టె మూత తెరిచేడు ... తనకి కావలసిన ఇత్తడి గిన్నె తీసుకుంది శారద.

గిన్నె తీసుక తుర్రుమని వెళ్లిపోయింది. ఆమె ప్రక్కని నిల్చున్నప్పుడు కావాలని చేతులు తగిల్చేడు ... గిన్నె ఇస్తున్నప్పుడు ... భుజం తగిలింది ఆ ఇరుకులోంచి వస్తున్నప్పుడు ... శారదలో ఏ రిఏక్షనూ లేదు ... కాని తనలో విద్యుత్తు ప్రవహించింది. తను చేస్తున్నది మంచి పనా ? అని ఒక్కక్షణం అనుకున్నాడు ... తనేమీ తప్పుపని చేస్తున్నట్టు అనిపించలేదు ... అతడిలోని కవితా స్రవంతి పొంగి పారసాగింది. ఒక కాగితం తీసుకొని రెండు పద్యాలు రాసేడు శారద మీద.

ఇంతలో మళ్లా శారద వచ్చింది... ''మీరు కాఫీ తాగుతారా 'టీ' తాగుతారా ?'' అని అడిగింది. ఆమె వెంకటేశ్వర్లుని ముఖంలోకి నిర్మలంగా చూస్తోంది. అన్నయ్య దగ్గర స్నేహితుడు, అన్నయ్య వీళ్ల ఇంట్లోనే ఉండి చదువుకుంటున్నాడు, అన్నభావం వచ్చినప్పుడు, ఈ మనిషి ఇంట్లో అందరికీ దగ్గరవాడే అన్న భావంతో వ్యవహారిస్తున్నారందరూ.

''నీ చేత్తో ఏదిచ్చినా తాగుతాను ...'' ఆమెకే వినిపించేలా అన్నాడు.

శారదకి అందులోని అంతరార్థం అర్థం కాలేదు కామోసు, మామూలుగా ప్రవర్తించింది. వంటింటిలోకి వెళ్లి 'టీ' తెచ్చి ఇచ్చింది టిఫినుతో సహా జంతికలు, లడ్డుండలు.

''నేనిన్ని తినలేను'' అన్నాడు.

'' తినండి ఏమున్నాయికనుక '' శారద దూరంగా నిల్చుంది.

''నువ్వు కొంచెం సాయంపట్టు'' అన్నాడు.

''నావొంతు నాకుంది. ఇప్పుడు తినలేకపోతే ఉంచుకోండి. తరవాత తినండి. అన్నని పిలుస్తాను ఇద్దరూ ఇట్టే ఎగరకొట్టేవచ్చు'' చిరునవ్వు నవ్వుతూ అంది శారద.

''పోనీ కూర్చో, కబుర్లుచెప్పు. చూడు నీ మీద రెండు పద్యాలు రాసేను'' కాగితం ఇచ్చేడు. ఆ పద్యాలు చదివింది ''మీరు కవిత్వం రాస్తారా ?''

''రాస్తాను. '' భారతి '' లో నా పద్యాలు అచ్చయేయి. మీ అన్న వాటిని దిద్దేడు.''

''నామీదెందుకు రాసేరు పద్యాలు ?'' అమాయకంగా అడిగింది.

వెంకటేశ్వరలు గొంతు తగ్గించేడు. ''నీవంటి అందమైన దానిని నేనింతవరకూ ఎక్కడా చూడలేదు. నీమీద రాయక, రాయిమీద రాయమంటావా ?''

శారద ముఖంలో సంతోషరేఖలు. కళ్లు మిళ మిళలాడేయి. ''అన్నకి చూపించేదా ?''

''వెంటనే మీ అన్న నన్ను ఈ ఇంట్లోంచి పొమ్మంటాడు.''

''ఎందుకు ? ఏంతప్పు చేసేరని ? పద్యాలు రాయడం తప్పా ?''

''తప్పుకాదు.' కాని నీ మీద రాసేనని తెలుస్తే వాడికి కోపం ఒస్తుంది.''

''అయితే ఎందుకు రాసేరు ?''

''నీ అందం చూసేక కవిత్వం పుట్టి.''

''కవిత్వం రాస్తూ కూర్చుంటే చదువెలాగవుతుంది ?'' శారద అక్కడ కుర్చీలో కూర్చుంది.

వెంకటేశ్వరులు ఆమె కళ్లలోకి సూటిగా చూసేడు. శారద తెలివైన ప్రశ్నే వేసింది.

''కవిత్వం అస్తమానం పుట్టుకొస్తుందా? నీలాటి ఆడది కనిపించినప్పుడే.''

శారదకీ కబుర్లు బాగున్నాయి. తనొక వ్యక్తిననీ, తనలో ఒక గొప్పతనం ఉందనీ, వెంకటేశ్వరులు మొదటిసారిగా చెప్తున్నాడు. తను అందమైనది అని కూడా అంటున్నాడు. అనడమే కాదు, పద్యాలుకూడా రాసేడు.

''మరి ఇక్కడ ఉండి చదువుతానంటున్నారు...పద్యాలురాస్తూ కూర్చుంటారు... చదువుతారా?'' ఆ మాటలని 'మీ ఆటకట్టు' అన్నట్టు చూసింది...పెదవులు నవ్వుతున్నాయి.. కళ్ళు నవ్వుతున్నాయి.

ఇంతలో కామయ్యవచ్చి రామంకోసం కేక పెట్టేడు. కామయ్యగొంతు వినగానే, ఉలిక్కిపడి లేచి, సిగ్గుపడుతూ ఇంట్లోకి పరుగుతీసింది శారద. పద్యాల కాగితం ఆమె చేతిలో ఉండిపోయింది...అది తీసుకువెళ్ళి తన పుస్తకాల పెట్టెలో పడేసింది.

''రామం వీధి గదిలో చదువుకుంటున్నాడు'' అని శారద తలుపు సందునించి జవాబిచ్చింది...

రామం వచ్చేడు. కామయ్యని పలకరించి శారదకి కేకవేసేడు ''శారదా . వెంకటి లేచేడేమో చూడూ...''

''అతను లేచేరన్నయ్యా ... టీ తాగుతున్నారు...''

ఇంతలో ఎక్కడెక్కడో చక్కర్లుకొట్టి వచ్చిన సూర్యం, సాంబా ఇల్లొక బజారులా మార్చేరు వాళ్లగోలతో. ఇద్దరూ వచ్చి వెంకటేశ్వర్లు మీద సముద్రకెరటాల్లా విరుచుకు పడ్డారు ప్రశ్నలతో. రామం, కామయ్యని పరిచయం చేసేడు వెంకటేశ్వరులుకి. కామయ్య మర్యాద సూచకంగా కొన్ని ప్రశ్నలు వేసేడు. ఇంతలో తలుపుచాటునించి శారద గొంతు వినిపించింది...''అన్నయ్యా...కాఫీ!'' టిఫినూ, కాఫీ కామయ్య కోసం తెచ్చింది. శారద ఎందుకింత సిగ్గు పడుతోందో అర్థం కాలేదు వెంకటేశ్వరులుకి...రామం లేచివెళ్లి అవి అందుకొని తెచ్చేడు...

''మా ఇంటికి రండి...'' కామయ్య అన్నాడు.

కొంతసేపు ఈ కబుర్లూ ఆ కబుర్లూ నడిచేయి. ''అత్త ఇంట్లో ఉందా?'' అని కామయ్య అడిగేడు...''ఉంది...లోపలికి వెళ్ళు.'' అని రామం అన్నాడు...

కామయ్య, కాఫీ, పలహారం అయ్యేక ఇంట్లోకి వెళ్లేడు. అతడి మనస్సులో ఆందోళన. అప్పుడే వారం రోజులయింది అత్త తనతో మాట్లాడి. వీళ్లెవరూ అడగడానికింతవరకూ రాలేదు...ఇంతలో ఈ వెంకటేశ్వరులు ఎందుకొచ్చినట్టు! ఇతడు రాగానే కబురు తెలిసింది... చెల్లి వచ్చి చెప్పింది...''పొడుగ్గా ఒక అబ్బాయి ఒచ్చేడు అన్నయ్యా శారద ఇంటికి...రామం



# ఇవేమన పద్యాలు




పట్టి విడువరాదు పదిలక్షలకునైన
పెట్టి చెప్పరాదు పేదకైన
వెట్టి గొలువరాదు విభుడెంత ఘనుడైన
విశ్వదాభిరామ వినుర వేమ.

క్లాస్‌మేట్ట...'' అని...ఎవడో చూద్దాం అని వచ్చేడు...మనిషి తనకన్న పొడుగ్గా ఉన్నాడు... తనకన్న ఎక్కువ చదువుతున్నాడు.

కామయ్య తిన్నగా కాంతమ్మ దగ్గరికి వెళ్ళి అడిగేడు...''ఏం అత్తా...మా ఇంటికి నువ్వూ, మామ రాలేదింత వరకూ?''

ఆ ప్రశ్నవిని కాంతమ్మ నిర్ఘాంతపోయింది. ఏం మాట్లాడుతున్నాడో కొంత వరకూ అర్థం కాలేదు. అర్థం అయేక నవ్వుతూ అంది... ''మంచి రోజు చూసి వద్దాం అనుకుంటున్నాం.''

* * *

## ఉ ద య సం ధ్య

రెండు రోజులు గడిచిపోయేయి వెంకటేశ్వరులుకి రెండు నిముషాల్లా. మర్నాడే వచ్చేస్తానని చెప్పి వచ్చేడు. ఇక్కడనించి కదలాలని పించలేదు. ఈ రెండు రోజులలోనూ శారదతో చనువు ఎక్కువయింది. ఒక్కడూ మాట్లాడడానికి అవకాశాలు తక్కువ దొరికినా, తమ్ముళ్ళు ఉన్నప్పుడు శారద కూడా వచ్చి కబుర్లూ, కథలూ చెప్పేది, వినేది. తెలియని సంగతులు తెలుసుకుందుకు ఎన్నో ప్రశ్నలు వేసేది. శారదతో ఏకాంతంగా మాట్లాడేందుకు సమయం దొరకడం బహు కొద్ది. అది మధ్యాహ్నం పడుకొని లేచేక... శారద తొంగి చూసేది లేచేడో లేదో... ఆ అదునుకోసమే కాచుకుని ఉన్న తను ఆమెను పిలిచేవాడు ... ''మీకు కాఫీ తెస్తానుండండి...'' అని వెళ్ళి కాఫీ తెచ్చేది... కాఫీ ఇచ్చినప్పుడు వేళ్ళు తగిల్చేడు. ఎంత సున్నితంగా ఉన్నాయి శారద చేతివేళ్ళు ! శారద ఇది గమనించనట్టే ఉండేది ... రెండో రోజున అన్నాడు... ''ఏదీ నీ చెయ్యి ఒకసారిలా ఇయ్యి...'' అని... శారద అర్థంకాక ఎందుకని అడిగింది. ''నీ జాతకం చెపుతాను...'' శారద సరదాగా చెయ్యి అందించి, ''చెప్పండి'' అంది.. కుర్చీలో కూర్చుంది. చేతిని మృదువుగా రాసేడు.. కుంకుమ రంగులో ఉంది చెయ్యి. చిన్న గోళ్ళు ఆలుచిప్పల్లా... చెయ్యికిందా మీదా తిరగవేసి అన్నాడు. ''మంచి అదృష్టవంతురాలివి ...'' ''ఇంకా ?'' ''నీకు చదువు బాగా ఒస్తుంది ... ఎం. ఏ పాసవుతావు ...'' ''ఇంకా ?'' ''నీకు మంచి డబ్బున్న మొగుడొస్తాడు ...'' శారద చిరునవ్వు నవ్వింది...''ఇంకా?'' ''నీకు ముగ్గురు మగ... ఒక ఆడ పిల్లలు...'' శారద మరి అడగ లేదు. అంతకన్న ఏముంటుంది ఆడదాని జీవితం? చెయ్యి తీసేసుకోపోయింది. కాని వెంకటేశ్వరులు చెయ్యి వదల్లేదు. నీ చెయ్యి మల్లెపువ్వులా మృదువుగా ఉంది అంటూ తన చెక్కిలికి రాసుకొని కళ్ళు మూసుకున్నాడు... శారద చెయ్యి లాగేసుకొని అంది ... ''మళ్ళా కవిత్వమా ? ఇవాళేమన్నా పద్యాలు రాసేరా ?''... ''నువ్వు నా ఎదురుగా కూర్చుంటే రాస్తాను...'' అంతే ఇంతలో ఎవరో ఒకరు తయారు.

మూడోరోజున కామయ్య ఇంటికి వెళ్లేడు రామంతో. కొండయ్య ఎన్నో ప్రశ్నలు వేసేడు. పుట్టు పూర్వోత్తరాలడిగి తెలుసుకున్నాడు. ఫలహారాలూ కాఫీలూ అయ్యేయి. కామయ్యకి వెంకటేశ్వరులుని చూడగానే అసూయ కలిగింది. మనసులో ఎందుకో కోపం వస్తోంది. శారద, వెంకటేశ్వరుడితో ఎక్కువగా మాట్లాడుతోందని వార్తలు చెల్లెలు తీసుకవచ్చింది. ఎందుకంటే ఆమె కూడా వెంకటేశ్వరుడి భక్తులలో ఒకర్తయింది. సూర్యం, సాంబ, శారద, తన చెల్లెలు లక్ష్మి—చాలా హాస్యంగా మాట్లాడతాడుట. ఎన్నో హాస్యం కబుర్లు, సినీమా జోకులు చెప్తాడుట. చెయ్యి చూసి జాతకాలు చెప్తాడని కూడా తెలిసింది. ''ఇంకా ఎన్నాళ్ళుంటారు ?'' అని అడిగేడు. వీడి పీడ వేగం వదిలిపోవాలి ... ''ఏమో తెలీదు...'' ''ఇక్కడ మీకేం తోచదు.. సినీమాలు లేవు ... కాఫీ హోటళ్ళు లేవు ... స్నేహితులు లేరు ...'' ''ఇక్కడి వాతావరణం, అందం, పట్నంలో ఎక్కడ దొరుకుతాయి ?'' అలా సాగిపోయింది సంభాషణ. వీడీ ఊరినించి కదిలేటట్టు లేదు. ఒక వేళ వెళ్లినా, మళ్ళా వచ్చి ఇక్కడ తిష్టవేసి చదువుతాడని వదంతి.

[ఇంకా వుంది]

# సుమ సుకుమారం రోజంతా

- విస్కోజ్ మడతలు ఆధారంగా ఉంచి చేయబడినవి
- అతి మృదువైనవి
- అధికంగా చెమ్మ పీల్చుకొనేవి
- శరీరంలో ఒంటికి అంటివుండి సౌకర్యంగా వుంటాయి
- విజ్ఞాన శాస్త్రయుక్తమైన విశిష్టతతో తయారుచేయబడినవి
- సరసమైన ధరలకు లభిస్తాయి

బెల్టు ఉచితం




# హెలనా

## శానిటరీ న్యాప్‌కిన్స్

సర్‌కాట్ ఇండస్ట్రీస్ ప. లి.

23 పరశువాకం, మెయిన్ రోడ్డు, మద్రాసు-600 007

ఫోను: 661982 & 662004

APRC

# ఫైనల్ డయాగ్నోసిస్

రాజ్యలక్ష్మి కొలాస్కర్

వీధి తలుపు దబదబ చప్పుడయింది. "వచ్చేశారు రాక్షసులు. అప్పుడే నాలుగయిపోయిందా" విసుక్కుంటూ చేతిలో నవల పక్కకి పడేసి బద్ధకంగా ఒళ్ళు విరుచుకుంది మాలతి. కప్పుకున్న దుప్పటి పక్కకితోసి మంచం దిగేలోగా మరోసారి ఉరుములు పడుతున్నట్లు తలుపులు బాదేశారు.

"ఏమిటంత ఖంగారు? ఏవో కొంపలంటుకు పోతున్నట్లు తలుపులు పగలగొడ్తారెందుకు?" గుమ్మంలోనే గదమాయించింది పిల్లల్ని.

"మరి నువ్వెందుకంత ఆలస్యం చేస్తావు? తొందరగా తలుపు తియ్యలేవా?" ఇంకా గట్టిగా అరిచింది చిన్ని సుధ. స్కూల్ బ్యాగులు ఒక మూలకి షూస్ ఇంకో మూలకి ఎగురుకుంటూ వెళ్ళి పడ్డాయి. స్కూల్ డ్రెస్సులు కుర్చీలమీదకి.

"మమ్మీ ఆకలేస్తోంది. ఏమన్నా పెట్టవా?" తల్లిని చుట్టుకుంది సుధ.

ముందు బాగ్ షూస్ అన్నీ తీసి సరిగా పెట్టు. అలాగేనా పారేసేది?

"ఊహు ముందు తినటానికేమైనా పెట్టు. తరువాత సర్దుతాను."

"(ఫ్రి)జ్‌లో బ్రెడ్ వుంది. తినేసి పాలు తాగండి ఇద్దరూ!"

సుధ చేతులు వదిలించుకుని మళ్ళీ బెడ్ రూమ్ వైపుకి దారితీసింది మాలతి.

"మళ్ళీ బ్రెడ్డేనా! లంచ్ బాక్సులోకూడా బ్రెడ్ జామ్ పెట్టావు. నాకొద్దు. ఇంకేదైనా పెట్టు." మారాం చేసింది సుధ.

"కావాలంటే తిను లేకపోతే నోరు మూసుకుని కూర్చో. ఒకవైపున రోగంతో నేను చస్తుంటే మీకు చిరుతిళ్ళు. మరీ జ్ఞానం లేకుండాపోతోంది మీకు" తలగడ కానుక్కూర్చుని నడుంవరకు దుప్పటి కప్పుకుని సగంలో ఆపేసిన నవల అందుకుంది.

పెద్దవాడు సంజయ్ పాలు తను తాగేసి చెల్లెలి కివ్వబోయాడు. "నాకొద్దు ఫో" అన్న చెయ్యి తోసేసి ఒక మూల మూతి ముడుచుకుని కూర్చుంది. అలసటతో ఆకలితో అలాగే నిద్రలోకి జారుకుంది. కొంచెంసేపు ఆడుకుని వచ్చి సంజయ్ హోమ్‌వర్క్ పుస్తకాలు ముందేసుక్కూర్చున్నాడు.

"అరే! సంజూ! చెల్లాయెందుకలా కూర్చుని నిద్రపోతుంది?" తండ్రి గొంతువిని కళ్ళు తెరిచింది సుధ. దగ్గరగావెళ్ళి ప్రేమగా కూతురును నిమిరాడు. "మంచంమీద పడుకోమ్మా!" తండ్రి లాలనతో సుధ కళ్ళలో చేరుకున్న ముత్యాలు చెంపలమీదకి జారాయి.

"ఎందుకమ్మా ఏడుపు? ఏమయింది? నాకు చెప్పు" కూతుర్ని ఎత్తుకుని మాలతి దగ్గర కెళ్ళాడు.

"నాకు చాలా ఆకలేస్తోంది డాడీ! మమ్మీ బ్రెడ్ తినమంది. మధ్యాహ్నం లంచ్ బాక్సులో కూడా అదే! నా కిష్టంలేదు. మమ్మీ ఏమీ ఇవ్వలేదు."

"లేనివాళ్ళు లేక ఏడుస్తుంటే ఉన్నవి తిన టానికి మీకు ఇష్టాలు అయిష్టాలు. రెండు రోజులు కడుపు మాడిస్తే తిన్నగా దారిలోకి వచ్చి ఏది పెడితే అది తింటావు." కోపంగా అరిచింది మాలతి. "ఇవాళంతా ఒకటే తల నెప్పి అన్నం కూడా తినాలనిపించలేదు" కణతలు నొక్కుకుంది.

నీరసంతో వాడిపోయిన సుధ ముఖం చూస్తుంటే శ్రీధర్‌కి గుండెలు పిండినట్టయింది. కళ్ళలో నీళ్ళు తిరిగాయి. మాలతితో అన్నాడు. "తలనెప్పయితే ఆ పుస్తకం ఎందుకు చదవటం కళ్ళు మూసుకుని పడుకో! సుధా! అమ్మకి ఒంట్లో బాగాలేదు కదా! అమ్మని విసిగించకు నేను హోటల్‌కి వెళ్ళి నీకు టిఫిన్ తెస్తాను. సరేనా? ఏం కావాలి?"

మాలతి ఉత్సాహంగా దుప్పటితీసి పక్కకి పారేసింది.

"ఎలాగూ ఏడు గంటలవుతోంది కదా! అందరం వెళ్ళి ఏకంగా భోంచేసి వచ్చేద్దాం. మీరు వెళ్ళటం మోసుకురావటం ఇదంతా ఎందుకు? ఏమంటారు?"

శ్రీధర్ నిట్టూర్చాడు "అనడానికేముంది? తయారవు?"

మాలతి చకచకా ముస్తాబు ప్రారంభించింది.

శ్రీధర్ తనేం తింటున్నాడో కూడా తెలియనంతగా ఆలోచన్లలో మునిగి తేలుతున్నాడు. "పెళ్ళయి ఇన్నేళ్ళయింది. ఇద్దరు పిల్లలు పుట్టారు. వాళ్ళు పెద్దవాళ్ళవుతున్నారు. అయినా మాలతి మాత్రం ఎదగటంలేదు. పెళ్ళయిననాడు ఎంత బాధ్యతా రహితంగా వుండేదో ఇన్నేళ్ళ తరువాత ఈ రోజూ అలాగే వుంది. ఇంట్లో పరిస్థితి చూస్తుంటే తనకి రోజు రోజుకీ మనశ్శాంతి కరువైపోతుంది." క్రిందటి శనివారం జరిగిన సంఘటన కళ్ళముందు మెదిలింది.

ఆ రోజు వినాయక చవితి. ఊరంతా కళకళ లాడుతోంది. మార్కెట్‌నిండా పూలు, పళ్ళు, పత్రి, వినాయకుడి బొమ్మలు. ప్రతి జంక్షను లోనూ పెద్ద వినాయకుడి విగ్రహం. కొబ్బరాకుల పందిరిక్రింద రికార్డులు. పిల్లలకి ఎక్సైటింగ్‌గా వుంది. మాలతి మాత్రం రోజూలాగే ఏడు గంటలకి నిద్రలేచింది. పూజ ప్రయత్నాలేమీ చెయ్యటం లేదు. సంజయ్‌కి విషయం అర్థం చేసుకొనే శక్తి వచ్చింది. నోరు తెరిచి ఇది కావాలని అడగడు. సుధ ఇంకా చిన్నది. ప్రతి దానికీ మారాం చేస్తుంది. అసహనంగా అరవటం ప్రారంభించింది. "మమ్మీ! నాకు తలస్నానం చేయించు. నేనూ డాడీ మార్కెటుకెళ్ళి ఆకులు అవన్నీ తెస్తాం. మన పూజ అందరి పూజకన్నా ముందైపోవాలి."

"సుధా! నువ్వూరికే అరవకు. అన్నయ్య నువ్వు చక్కగా స్నానంచేసి దేవుడి దగ్గర దీపం పెట్టుకోండి. పూజ గీజ అని నా ప్రాణం తియ్యకండి. నాకు జ్వరమొచ్చినట్టుంది"

"మమ్మీ! మా టీచరేం చెప్పారో తెలుసా! తలంటుకొని కొత్త బట్టలేసుకొని పాలవెల్లి కింద దేవుణ్ణి పెట్టి పెద్దపుస్తకాలు కూడా పెట్టి పూజ చేసుకుంటే చదువు చక్కగా వస్తుందట. అలాగే చేద్దాం మమ్మీ! పోనీ కొంచెం పాయసం చెయ్యి. అది చాలు. ఉండ్రాళ్ళు అవీ వద్దులే!" బతిమాలింది సుధ.

"అవునమ్మా!" ఆశగా చెల్లెలికి వంత పాడాడు సంజయ్.

మాలతికి మాత్రం పాలవెల్లిని అలంకరించటం, పూజ ఏర్పాట్లు, పిండివంటలు చెయ్యటం ఇవన్నీ ఊహించుకొనేసరికి మామూలు జ్వరం కాస్తా చలిజ్వరమయిపోయింది.

"వెధవ పండగలు ఎందుకొస్తాయో నా ప్రాణం తియ్యడానికి. అయినా వున్నవాళ్ళకే లక్షా తొంభై పండగలు. ప్రతిదానికీ ఆర్భాటం" చిన్నతనంలో తనెంత ఆనందంగా పండగలు గడిపేసిందో మర్చిపోయి హిందూ మతాన్ని కాసేపు మనసులో తిట్టుకుంది.

"చూడమ్మా సుధా! నువ్వు చిన్నపిల్లలా మారాం చెయ్యకూడదు. నాకు ఒళ్ళంతా నెప్పిగా వుంది. లేస్తే పడిపోతానేమో అన్నంత నీరసంగా వుంది. ఇవన్నీ ఎలా చెయ్యగలను చెప్పు? దీపావళి పండగ బాగా చేసుకుందాం. ఏం?"

సుధకి నిరాశ కోపం ముంచుకొచ్చాయి. గట్టిగా అరుస్తూ ఏడవటం ప్రారంభించింది. "నువ్వెప్పుడూ ఇంతే. అస్తమానం జ్వరం, నెప్పి అంటావు. అంతా వుట్టిదే!"

ఇంతలో ఎదురింటి సుభద్ర వచ్చింది.

''మాలతీ ! మీ ఇంట్లో గంధంచెక్క వుంటే ఇస్తావూ ? ఏమయింది సుధా ! ఎందుకూ ఏడుస్తున్నావూ ?''

''చూడు సుభద్రా ! ఇది వయసుకెదుగు తోందికానీ బుద్ధి మాత్రం పెరగట్లేదు. పూజ ఆర్భాటంగా చెయ్యమని నా ప్రాణం తినేస్తోంది. నాకేమో విపరీతమైన తలనెప్పి. జ్వరం కూడ తగినట్లుంది. దీనికి చెప్తే వినటంలేదు.''

''అయ్యో పాపం ! అయినా ఎప్పుడూ తలనెప్పి అంటావుమరి డాక్టరుకి చూపించు కోరాదూ !''

వినడానికి ఎవరు దొరికినా మాలతి తనకున్న రోగాలన్నిటినీ ఏకబిగిని ఏ కరువు పెట్టేస్తుంది. అందుకే ఆ కాలనీ వాళ్ళంతా మాలతితో ఆరోగ్యం విషయం ఎత్తకుండా జాగ్రత్త పడతారు. సుభద్రవాళ్ళొచ్చి కొద్ది కాలమే అయింది.

''అన్నీ అయ్యాయి సుభద్రా! కళ్ళు పరీక్ష చేయించుకున్నాను. ఎక్స్‌రే తీయించు కున్నాను. ఏం లేదంటారు డాక్టర్లు. నాకు మాత్రం సైనుసైటిస్ అని అనుమానం. పోనీ అదొక్కటే అయితే ఎలాగో నెట్టుకొచ్చేదాన్ని. ''స్పాన్డిలైటిస్'' మూలంగా మెడ ఒకటే నెప్పి. ఈ మధ్య కాళ్ళు సలపటం మొదలెట్టాయి. ''సయాటికా'' అని భయమేస్తోంది. రేపో ఎల్లుండో డాక్టరు దగ్గరకెళ్ళాలి.''

''ఒక పనిచెయ్యి మాలతీ ! పిల్లల్నిద్దర్నీ మా ఇంటికి పంపించు. పూజ చేసుకుని భోంచేసి వస్తారు. వాళ్ళ ముచ్చటా తీరుతుంది నీకు విశ్రాంతి.''



మాలతి రిలీఫ్‌గా నిట్టూర్చింది. సుభద్ర వెళ్ళగానే శ్రీధర్‌కోసం తనకోసం స్టవ్‌మీద కుక్కర్ పడేసి పేషెన్స్ ఆడుకోవటం మొదలెట్టింది. పండుగ పూట పాచి ఇల్లు ఊడ్చు కుందామన్న జ్ఞానంకూడా లేకపోయింది. పని మనిషి పండగమూలాన రాలేదు.

మధ్యాహ్నం రెండు గంటల ప్రాంతంలో సుభద్ర పిల్లల్ని తీసుకొచ్చింది.

''మాలతీ ! ఎలావుందిప్పుడు ?''

''అదే వుండటంలే సుభద్రా ! ఒళ్ళంతా రోగాలపుట్టై పోయింది. నా సంగతికేమొచ్చె గాని వీళ్లు విన్నేమైనా విసిగించారా ?''

''ఛ ! ఛ ! ముత్యాల్లాంటి పిల్లలు విసిగించటమా ఏమన్నానా ? అన్నట్టు నీకు చెప్పటం మరిచిపోయాను. ఇవాళ మన ఆడిటోరియంలో మురళీకృష్ణ సినిమా వేస్తున్నారట. నీకు పాత సినిమాలంటే ఇష్టం కదూ ! తీరా వచ్చేసరికి...''

''ఆ సినిమా చాలా బాగుంటుంది సుభద్రా! ఎన్నాళ్ళనుంచో చూడాలనుకుంటుంటే కుదరనే లేదు. నానెప్పులు ఎప్పుడూ వుండేవేకదా! రెండు టాబ్లెట్లు మింగి వస్తాను. ఎన్నింటికి సినిమా?''

పది నిమిషాల్లో తయారైపోయి ఇల్లు పిల్లల్ని భర్తకప్పగించేసి సినిమాకి వెళ్ళిపోయింది మాలతి.

* * *

''సార్!'' గట్టిగా పిలిచాడు సర్వర్. ఉలిక్కిపడ్డాడు శ్రీధర్. ''ఏమిటండీ ఆ పరధ్యానం ! రెండుసార్లు వచ్చాడతను అడగటానికి. ఏ లోకంలో వున్నారు?'' మాలతి కోప్పడింది.

భోజనాలు ముగించి ఇంటికి చేరుకున్నారు.

* * *

ఓ రోజు శ్రీధర్ ఇంటికి వచ్చేసరికి సుధ ఓ మూల ఏడుస్తూ కూర్చుంది. అసలు చూడగానే సుధ అని గుర్తుపట్టలేదు. ''డాడీ!'' అంటూ వచ్చి చుట్టుకోగానే ఆశ్చర్యంగా చూశాడు కూతురివంక. సుధకి చక్కటి జుట్టుండేది. ఒత్తుగా నల్లగా పొడవుగా వున్న జుట్టుని రెండు జడలేసుకుని స్కూల్‌రూల్ ప్రకారం తెల్లటి రిబ్బన్లేసుకొంటే చూడ ముచ్చటగా వుండేది. అలాటిది ఇవాళ పొట్టిగా అటు బాబ్ కాకుండా, ఇటు క్రాఫ్ కాకుండా కత్తిరించేసి వుంది. సుధకి చాలా యావగా వుంది. అందులోనూ సుధ కొంచెం కాలుబారు పిల్ల కావటంతో మరీ వికారంగా వుంది. కోపంగా అడిగాడు ''ఎందుకు కట్ చేసుకున్నావిలా?''

సుధ వెక్కుతూ చెప్పింది. ''ప్రొద్దున్న మమ్మీ కట్ చేసింది నేను వద్దన్నా సరే! స్కూల్లో అందరూ నన్ను చూసి నవ్వుతున్నారు. ''ఈకలు పీకిన కోడి'' అని వెక్కిరిస్తున్నారు. రేపట్నుంచి నేను స్కూలుకి పోను.''

# ఫైనల్ డయాగ్నొసిస్

'మాలతీ !' గర్జించాడు.

బాల్కనీలోంచి క్రింద ఇంటి వాళ్ళతో కబుర్లాడుతున్న మాలతి గబ గబ వచ్చింది. ఏడుస్తున్న సుధనీ కోపంగా వున్న శ్రీధర్‌నీ చూడగానే విషయం అర్థమైపోయింది.

"ఎందుకండీ అలా అరుస్తారు ? ఇంట్లో అడుగు పెట్టగానే ముద్దుల కూతురు చాడీలు చెప్పటం మీరు వినటం. ఇంకేంపనిలేదు."

"అరవక ముద్దు పెట్టుకోమంటావా ? దాని జుట్టెందుకలా కట్‌చేశావు ? "

"శీతాకాలం వస్తోంది కదా ! నాకు "ర్యుమాటిజం" మూలాన కీళ్ళనొప్పి రోజు రోజుకీ ఎక్కువవుతోంది. జడ వెయ్యటాన్కి వేళ్ళు వంగట్లేదు. వారం వారం తల రుద్దేసరికి నడుం విరిగినంత పనవుతోంది. ఇప్పుడు దానికే మాత్రం వయసయిపోయిందని, రెండు మూడేళ్ళలో అదే పెరుగుతుంది. ఎందుకంత రాద్ధాంతం ? "

"ఆడదానివయ్యుండీ అంత అందమైన జుట్టు కత్తిరించటానికి నీకు చేతు లెలా వచ్చాయి ? నీకంత బాధగా వుంటే, నాతో చెప్పాల్సింది నేను చేసేవాణ్ణి. చేసే పనులన్నిటిలో ఇదీ ఒకటయ్యేది. ప్రతి చిన్నపనికీ ఆరవై ఆరు రాగాల లిస్టు చదవటం నీకు బాగా అలవాటై పోయింది."

"అనుభవించే వాళ్ళకి తెలుస్తుందండీ ! నా బాధ మీకెలా అర్థమవుతుంది ? ఎన్ని మాటలైనా అంటారు. అనండి. ఏంచేస్తాను ? నా ఖర్మ" ముక్కు చీదింది మాలతి.

వెంటనే తగ్గిపోయాడు శ్రీధర్. సుధ వైపుకి తిరిగి బుజ్జగింపుగా అన్నాడు "సుధా ! బంగారు తల్లివి కదూ ! పేచీ మానెయ్యి. నీకు అందమైన పిన్నులు, హెయిర్ బాండ్స్ కొంటాను. అవి పెట్టుకుంటే ఎంచక్కా ముద్దొస్తావు. అప్పుడు ఎవళ్ళు నవ్వరు" సుధ అయిష్టంగానే నీళ్ళు తుడుచుకుంది.

శ్రీధర్ ఆలోచిస్తూ కూర్చుండిపోయాడు. వర్రీ పడుతున్నట్లు నుదుటిమీద చర్మం ముడుతలుపడింది. ఒక పావుగంట తరువాత ఏదో నిర్ణయాని కొచ్చినట్లు తల పంకించి లేచాడు.

"మాలతీ ! నేను బయిటికెళ్తున్నాను. రావడానికి లేట్ కావచ్చు. నాకోసం చూడకు."

ప్రాణస్నేహితుడైన చక్రపాణి క్లినిక్‌కి వెళ్ళాడు. చక్రపాణి పట్టణంలో మంచి పేరున్న డాక్టరు. తను వచ్చానని బయట వెయిట్ చేస్తున్నానని – నర్స్‌తో నోట్ పంపించగానే చక్రపాణి బయటికి వచ్చేశాడు. శ్రీధర్‌ని ఆప్యాయంగా భుజమ్మీద చరిచాడు. "ఇడియెట్ !

సరాసరి లోనికి రాక స్ట్రైల్‌గా నోట్ పంపిస్తావా ?''

''పేషెంట్స్‌ని చూస్తుంటే డిస్టర్బ్ చెయ్యటం ఇష్టముండదురా! నీవు ఆ పని పూర్తి చేసుకో! నీతో కొంచెం మాట్లాడాలి.''

''అయితే నువు నా రెస్ట్ రూమ్‌లో కూర్చో. వీళ్ళందర్నీ త్వరత్వరగా పంపేస్తాను. ఈ మేగజైన్స్ చూస్తుండు.''

అరగంటలో వచ్చాడు. ''ఇప్పుడు చెప్పు.''

''నీతో ముఖ్యమైన విషయం మాట్లాడాలి చక్రీ! అర్జెంటు ఏమీ లేదుకదా!''

''నీకంటే అర్జెంటేమీ కాదుకానీ చెప్పు.''

''మాలతి గురించి...''

''ఏమయింది మాలతికి ? ఒంట్లో బాగా లేదా ? మరెందుకు తీసుకురాలేదు ?'' ఆత్రంగా అడిగాడు.

''మాలతిని చూస్తుంటే నాకు మతి పోతుందిరా ! తను వాళ్ళింట్లో చాలా గారాబంగా పెరిగింది. దాంతో విపరీతమైన బద్ధకం. పెళ్ళయి సంసారం ఏర్పడినా ఆ బద్ధకం ఒదుల్చుకోలేకపోతోంది. పిల్లలు పుట్టేవరకూ ఏదో గడిచిపోయింది. ఆ తరువాత రోజు రోజుకీ నరకమయిపోతోంది. పనిమనిషి ఎలాగూ వుంది. వంటమనిషి కూడా కావాలంది. నానా అవస్థలూపడి పెట్టుకుంటే వాళ్ళు రెండు మూడు నెలలుండటం చేతికందింది పట్టుకుని పారిపోవటం. రెండేళ్ళు ఇలా గడిచాక ఏమైనా వంటమనిషి ఉండటానికి వీల్లేదన్నాను. కొన్నాళ్ళు సాధించింది. నేను పట్టించుకోలేదు. క్రమక్రమంగా ఈ జబ్బుని ఆ జబ్బుని వడ కెయ్యటం ప్రారంభించింది. అప్పట్లో నాకు అనుమానం రాలేదు. రోగాల పేర్లన్నీ ఎలా తెలుసుకుందో సైనుసైటిస్ అంటుంది. ర్యుమాటిజం అంటుంది. ఎనీమియా మైగ్రైన్ ఇంకా ఏమిటేమిటో! డాక్టర్ల చుట్టూ తిరిగి విసుగొచ్చేస్తోంది. అన్ని టెస్ట్‌లు అయ్యాయి. ఏం తేలక చివరికి ఏదో ఇన్ఫెక్షన్ అని యాంటి బయాటిక్స్ విటమిన్స్ ఇచ్చేవారు. ఇల్లు ఒళ్ళు గుల్లయిపోతోంది. కాని తనకి మాత్రం రిలీఫ్ లేదు. ఇవాళేం చేసిందో తెలుసా ? కీళ్ళనొప్పు లొస్తున్నాయి. జడ వెయ్యలేకపోతున్నానని సుధ జుట్టు కత్తిరించేసింది. అది ఏడుస్తూ కూర్చుంది. నాకేమీ పాలుపోవట్లేదు. గట్టిగా కేకలేద్దామంటే నిజంగానే ఒంట్లో బాగా లేదేమోనని మనసు పీకుతుంది. మరో చెంప ఇందరు డాక్టర్లకి ఇన్ని టెస్ట్‌లకి అందని రోగ మేముంటుందా అన్పిస్తుంది. సుధ హోమ్ వర్క్‌లో హెల్ప్ చెయ్యమ్మా అంటే చచ్చి పోతున్నాను బాబోయ్ అని మొత్తుకుంటుంది. అంతలోనే ఎవరైనావస్తే గంటల తరబడి కబుర్లు చెప్తుంది. సినిమాలకెళ్తుంది. డాక్టరు దగ్గరకనే మిషతో అట్నుంచటు హోటల్స్ కెళ్దామంటుంది. ఏం చెయ్యాలో తోచక నీ సలహాకోసం వచ్చానురా!'' ఇన్నేళ్ళు ఎవరితో చెప్పుకోలేని ఆవేదనని వెళ్ళబోసుకున్నాడు.

''ఏరా! ఇన్నేళ్ళుగా బాధపడుతూ ఇప్పుడా నా దగ్గరకి రావటం? నేను చచ్చిపోయాననుకున్నావా ?''

''ఛ! ఛ! అవేం మాటలురా! స్నేహాన్ని స్వార్థానికి వాడుకున్నట్టువుతుందని రాలేదురా! అంతేకాని మరేంకాదు.''

చక్రపాణి ఆలోచనలో పడ్డాడు. బరువు దించుకొన్న రిలీఫ్‌తో కుర్చీలో వెనక్కు వాలి కళ్ళు మూసుకున్నాడు శ్రీధర్.

పావుగంట తరువాత అన్నాడు. నువు రేపు సాయంత్రం మాలతిని ఇక్కడికి తీసుకురా! నేను కూడా ఒకసారి చెక్‌చేసి చూస్తాను. ఏదైనా సుస్తీవుంటే మంచి ట్రీట్‌మెంట్ ఇద్దాం. నీ అనుమానం నిజమయితే మాలతిని ఒక్క నెల రోజుల్లో నార్మల్‌గా తయారు చేస్తాను, నువు మాత్రం మనసు గట్టి బరుచుకుని నాకు పూర్తిగా కోపరేట్ చెయ్యాలి.

''నువ్వెలా చెప్తే అలా చేస్తానురా! చెప్పు''

ఒక అరగంటసేపు చర్చించుకొన్నాక ఇంటి ముఖం పట్టాడు శ్రీధర్.

మర్నాడు మాలతిని తీసుకుని నర్సింగ్ హోమ్‌కి వచ్చాడు శ్రీధర్. మాలతిని పూర్తిగా చెక్ చేశాడు చక్రపాణి. అప్పటివరకు తీసిన ఎక్స్‌రేలు, చేసిన టెస్ట్ రిపోర్టులు, వాడిన మందుల వివరాలు అన్నీ జాగ్రత్తగా చూశాడు. చివరికి శ్రీధర్‌తో అన్నాడు ''ఒరేయ్! మాలతికి పెద్దగా భయ పడాల్సిన జబ్బేమీలేదు. అలా అని పూర్తిగా నిర్లక్ష్యం చెయ్యకూడదు. నేను మందులు వ్రాసి ఇస్తాను. అవి వాడినంత మాత్రాన సరిపోదు. తనకి పూర్తిగా విశ్రాంతి అవసరం. ఇంటి దగ్గరుంటే అది కుదరదు. నర్సింగ్ హోమ్‌లో అడ్మిట్‌చేస్తే బాగుంటుంది. ఒక ఇరవైరోజులు పిల్లల్ని మానేజ్ చెయ్య గలవా?''

''మానేజ్ చెయ్యడానికేముందిరా? పిల్లలు మరీ చిన్న వాళ్ళేమీ కాదు. అందులోనూ చెప్తే అర్థం చేసుకొనే శక్తి వుంది. నువ్వెలా చెప్తే అలా!''

''అయితే రేపొచ్చి అడ్మిట్ అయిపోమ్మా, ఓ. కే ?''

మాలతి కళ్ళు ఆనందంగా మెరిశాయి. చాకిరీ తప్పటమే కాకుండా మహారాణిలా అన్ని సపర్యలూ జరుగుతాయి. ఎంచక్కా పుస్తకాలు చదువుకుంటూ చూడవచ్చేవాళ్ళతో కబుర్లు చెప్తూ...

పంచరంగుల కల కళ్ళముందు నిలిచింది. అందరు డాక్టర్లకన్న చక్రపాణి బెస్ట్ డాక్టర్ అని తీర్మానించేసి ఆ విషయం శ్రీధర్ తో చెప్పింది.

* * *

రోజు రోజుకి మాలతి పంచవన్నెల కలల రంగులు మాసిపోతున్నాయి. మొదటి రోజు స్వర్గంలో వున్నట్లు ఫీలయింది. నర్స్ మూడు పూట్ల భోజనం, మందులు అన్నీ ఇచ్చేసి వెళ్తుంది. డాక్టర్ సాయంత్రం వచ్చి చూసి వెళ్ళాడు. రెండోరోజు ముగిసేసరికి కొంచెం విసుగు కోపం బాధ అన్నీ కలిగాయి. ఇదేమిటి ? అంతా తను అనుకున్నదానికి విరుద్ధంగా జరుగుతోంది ? ఎవళ్ళు చూడటానికి రారు. స్నేహితులు పిల్లలు శ్రీధర్ ఎవ్వరూ! ఆ సాయంత్రం చక్రపాణిని అడిగింది. ''అన్నయ్యగారూ! ఆయన చూడ టానికైనా రావట్లేదు. హాస్పిటల్లో అడ్మిట్ చెయ్యగానే పీడ వదిలిపోయినట్టుందేమో ఆయనకి! మీరు కొంచెం ఫోన్‌చేసి చెప్పండి'' గొంతులో నిండుగా నిష్ఠూరం!

''నేనే రావద్దని చెప్పానమ్మా! నువు శారీరకంగానేకాక మానసికంగాకూడా విశ్రాంతి



తీసుకోవాలి. మనశ్శాంతి లేనప్పుడు ఎన్నిమందులు వాడీ ప్రయోజనంలేదు. శ్రీధర్‌గాని పిల్లలుగాని వచ్చినప్పట్నుంచీ ఏదో ఒక విషయం గురించి వర్రీ అయిపోతావు. అందుకే ఎవర్నీ రావద్దన్నాను. మనసు ప్రశాంతంగా వుంచుకున్నావంటే త్వరగా నయమయిపోతుంది.''

వారం రోజులయ్యేసరికి పిచ్చెక్కినట్టయిపోయింది. న్యూస్ పేపరు తప్ప ఒక్క పుస్తకం దొరకదు. పనీపాట లేక పగలూ రాత్రీ నిద్రపోదామన్నా రావట్లేదు.

ఒకసారి నర్స్‌ని పట్టుకుని కబుర్లలోకి దించాలని చూసింది. మర్యాదగా తప్పించుకుంది నర్స్. ఆలోచనలే తోడయ్యాయి. మెల్లమెల్లగా ఏదో అర్థం అయి అవనట్టుంటోంది మాలతికి.

పన్నెండు రోజులయ్యేసరికి మరి నిగ్రహించుకోలేకపోయింది. సాయంత్రం చక్రపాణి రాగానే నిలదీసింది. ''అన్నయ్యాగారూ! నిజం చెప్పండి. నాకున్న రోగమేమిటో ? కాస్త కూస్త చదువుకున్నదాన్ని. మీరు చెప్తే అర్థం అవకపోదు ''

చక్రపాణి మౌనంగా వుండిపోవటంతో మళ్ళీ అంది – ''నాకేదో అనుమానంగా వుంది. మీరు ఆయన కలిసి ఏదో నాటకమాడుతున్నట్లనిపిస్తోంది. నా బద్ధకం కప్పిపుచ్చుకోవటానికి రోగం వంక పెడుతున్నానని ఆయన మీకు ముందే చెప్పారు అవునా ?''

''శ్రీధర్ అలా చెప్పాడనే అనుకుందాం. ఆత్మవంచన చేసుకోకుండా చెప్పు అతని అనుమానం నిజమేనా ?''

మౌనంగా ఉండిపోవటం ఈసారి మాలతి వంతయింది. ఆఖరికి అంది ... ''చెకప్ చేసిన రోజే ఈ విషయం నాతో ఎందుకు చెప్పలేదు?''

చక్రపాణి సీరియస్‌గా అన్నాడు ''మాలతీ! శ్రీధర్ నాతో మాట్లాడినప్పుడే నాకు ఈ అభిప్రాయం కలిగింది. అది డైరెక్టుగా చెప్పానంటే నీకు నచ్చదు. ఈయనకేం తెలియదు. ఇంకో మంచి డాక్టరు దగ్గరకెళ్దామంటావు. అసలు ఈ రోజుల్లో డాక్టర్లకొచ్చే సగం కేసులు నీలాటివే ! ఏ డాక్టరైనా నిజం చెప్తే ప్రాక్టీసు పోవటం తప్ప ప్రయోజనముండదు. ఎందుకంటే నీలాంటివాళ్ళు వెంటనే ఇంకో డాక్టరు దగ్గరకెళ్తారు. అందుకే ఏదో ఒక పేరు చెప్పి రకరకాల పాథలాజికల్ టెస్ట్‌లు అవసరం ఉన్నా లేకపోయినా చేయించి నాలుగు రకాల మందులు ఇస్తేకాని పేషెంట్లని చెప్పుకునే మీకు తృప్తి వుండదు. నువు ఒక మామూలు పేషెంట్‌వయితే నేను అదే చేసేవాణ్ణి. కాని శ్రీధర్ భార్యవి. నాకు చెల్లెలుతో సమానం. నేను చెప్పేకంటే నీకై నువు తెలుసుకోవాలని ఇలా చేశాము. ఇలాగైతే ఇవాళ కాకపోతే రేపు

# స్వయం ఉపాధి పథకం చేపట్టిన మహిళా మెకానిక్ - కుమారి జ్యోతిర్మయి

ఈనాడు మన సమాజంలో మహిళలు అన్ని రంగాలలోనూ ముందడుగు వేయడం, సమాజంలో పురుషుడితో పాటు సమానంగా స్త్రీ కూడా అన్ని హక్కులను పొందడమేకాకుండా అలనాటి నుండి కూడా కొందరు మహిళలు నాయకత్వం వహిస్తున్నారు. కొన్ని పనులు చేయడం, కొన్ని పదవులు కేవలం పురుషులే నిర్వహించగలరు, చేయగలరు అన్నది ఆనాటిమాట. నేడు చాలామంది మహిళలు కూడా పురుషులకు తీసిపోని విధంగా అన్నిరంగాలలోకి ప్రవేశించి కృతకృత్యులవుతున్నారు.

## మరో ముందడుగు !

ఇందుకొక మచ్చుకగా మెకానిజమ్ వృత్తి చేపట్టి ఆత్మస్థయిర్యంతో సాటి పురుషులతో పాటు పోటీకి తట్టుకొని జీవనం సాగిస్తున్న కుమారి జ్యోతిర్మయి మరో అడుగు ముందు కేసిందని చెప్పుకోవచ్చు.

కుమారి సయింపు జ్యోతిర్మయి ఒక పేద కుటుంబంలో పుట్టింది. తల్లి లైబ్రేరియన్, తండ్రి ఒక పొగాకు కంపెనీలో చిన్న ఉద్యోగి. జ్యోతిర్మయి తన తల్లితండ్రులు ఇచ్చిన ప్రోత్సాహం, ఉత్సాహము, కృషి వలన యస్. యస్.సి. ప్రథమశ్రేణిలో పాసయింది. పై చదువులు చదివినా ఉద్యోగం వస్తుందనే ఆశలేక హైదరాబాదులోని దుర్గాబాయి దేశ్‌ముఖ్ ఇన్‌స్టిట్యూట్‌లో చేరి రేడియో మరియు టెలివిజన్‌లో డిప్లమా పొందింది.

అనంతరం ఆమె ఉద్యోగం కోసమై ఆ కంపెనీకి, ఈ కంపెనీకి దరకాస్తులు పెట్టి, పెట్టి విసిగి వేసారిపోయి, స్వతంత్రంగానే జీవించాలనే సంకల్పంతో సొంతంగానే షాపు పెట్టుకోవాలని నిశ్చయించుకొన్నది. అదృష్టవశాత్తు స్టేట్ బ్యాంకు ఆఫ్ ఇండియా కంచికచర్ల,



ఉమెన్స్ వెల్‌ఫేర్‌వారు ఆర్థికసహాయం చేయగా ఆమె కృష్ణాజిల్లా కంచికచర్లలో రేడియో, టి. వి. సర్వీసింగ్ షాపుని ప్రారంభించింది.

## స్త్రీకి ఆత్మస్థయిర్యం ముఖ్యం

ఈ వ్యాస రచయిత అడిగిన కొన్ని ప్రశ్నలకు ఆమె సమాధానం చెబుతూ స్త్రీకి ఆత్మస్థైర్యం, పట్టుదల ముఖ్యమని ఆమె అన్నది. ముందు, ముందు సాటి స్త్రీలకు ఈ విద్యను నేర్పుతారా అన్నప్రశ్నకు సమాధానంగా ఎవరైనా సరే వచ్చి శ్రద్ధగా నేర్చుకుంటూనంటే నాకు ఎలాంటి అభ్యంతరము లేదని, అనుభవముగడించి ఆర్థికంగా బలపడిన తరువాత రేడియో, టి. వి. ఇన్‌స్టిట్యూట్‌ని భవిష్యత్తులో ప్రారంభించనున్నట్లుగా ఆమె అన్నది. ఆడవాళ్ళు "సర్వీసింగ్ షాపులు" ప్రారంభించడం చాలా అరుదుకదా? అలాంటప్పుడు ఇలాంటి ఆలోచన ఎలా వచ్చింది? అన్నప్రశ్నకు మా తల్లితండ్రులు ఇచ్చిన ప్రోత్సాహం, స్వతహాగా నాకున్న ప్రీతి, ప్రముఖ వ్యాపారస్తులు అయినటువంటి శ్రీ దమ్మాలపాటి అప్పారావుగారి చేయూత వలన ప్రారంభించినట్లుగా ఆమె అన్నది. మరి కొన్ని ప్రశ్నలకు సమాధానంగా సాటి వృత్తుల వారయిన పురుషులనుండి ఎలాంటిప్రోత్సాహమూ లేదని, మహిళా మెకానిక్ అయినందువల్ల చాలా చులకనగా చూస్తున్నారని ఆమె బాధగా అన్నది. అయినా లెక్కచేయక సమాజంలో ఆటుపోట్లకు తట్టుకొని సాటి వ్యాపారములో సముచిత స్థానం సంపాదిస్తానని ఆమె దృఢంగా చెప్పింది. అందుకు కారణం తోటిమెకానిక్‌లకి తీసిపోకుండా పాడయిన ఎటువంటి రేడియో, టి. వి.లయినా రిపేయర్ చేయగిలనని ఎంతో కార్యదీక్షతో చెప్పింది.

## వరకట్నం అనాగరికం

ప్రస్తుత వివాహవ్యవస్థ గురించి అడిగిన ప్రశ్నకు సమాజంలో అన్ని రంగాలలో పురుషుడితో పాటు స్త్రీ కూడా అభివృద్ధి చెందినప్పటికి ఇంకా పురుష ఆధిక్యత వ్యక్తపరుస్తూ వరకట్నం తీసుకోవడం చాలా అనాగరికమని ఆమె అన్నది.

కుమారి జ్యోతిర్మయిని విద్యావంతులయిన ప్రతి యువతీ, యువకులు ఆదర్శంగా తీసికొని తమ, తమ కాళ్ళమీద తాము నిలబడ గలిగినప్పుడే ప్రస్తుతం సమాజంలో కారుమబ్బుల్లా అలుముకొని వున్న నిరుద్యోగ సమస్య సగమయినా పరిష్కారం కాగలదని వేరే చెప్పనవసరము లేదు.

-యస్. మనోహర్

---

ఆలోచన్నలో పడక తప్పదు. అప్పుడు నిన్ను నువ్వు మభ్యపెట్టుకొని బాధ్యతలనుంచి ఎలా పారిపోతున్నావో గ్రహింపుకి తప్పనిసరిగా వస్తుంది. శ్రీధర్ పిల్లల సంగతి అలా వుంచు. ఈ విధంగా నాటకం ఆడటంవల్ల నీకు నువ్వు ఎంత హాని చేసుకుంటున్నావో తెలుసా ! ఈ రోజుల్లో వచ్చే మందు లన్నిటికి సివియర్ సైడ్ ఎఫెక్ట్స్ వుంటున్నాయి. అవసరంలేని మందులు మింగటం శరీరానికి ఎంత హానికరమో మాటల్లో చెప్పలేం. ఇలాగే ఇంకో రెండు మూడేళ్ళు కంటిన్యూ చేశావంటే హైపో కాండ్రియక్‌గా తయారవుతావు. ఆ అలవాటు మాన్పించటానికి సైకియాట్రిక్ ట్రీట్‌మెంటు అవసరమవుతుంది.

మాలతి కళ్ళు భయంతో పెద్దవయ్యాయి. "అన్నయ్యగారూ! ఈ విషయాలన్నీ ఆలోచించలేక పోయాను. మిడిమిడి జ్ఞానం అనర్థదాయకమని నాలాంటివాళ్ళని చూసే అని వుంటారు. దయచేసి ఇంటికి పంపించెయ్యండన్నయ్యా ! ఎంత అవస్థపడుతున్నారో పాపం ! ఆయన ముఖం ముఖ్యంగా పిల్లల ముఖం చూడాలంటే సిగ్గుగా వుంది. అయినా తప్పదుకదా !"

చక్రపాణి సంతృప్తిగా చిరునవ్వు నవ్వాడు. ఇదంతా గుర్తుపెట్టుకుని "అతివృష్టి అనావృష్టి" సామెతగా చెయ్యకు సుమా ! నిజంగా ఏదైనా అనారోగ్యం వుంటే మాత్రం వెంటనే వచ్చెయ్యి. ఇప్పుడే శ్రీధర్‌కి ఫోన్ చేస్తాను.

తేలికయిన మనసుతో రూమ్‌లో వున్న తన వస్తువులన్నీ సర్దుకుని శ్రీధర్ కోసం, పిల్లల కోసం ఎదురుచూడసాగింది మాలతి. ★

# అక్షర మకరందాలను చిందించే రచయిత(త్రు)లెవరో..



సాహితీ ప్రక్రియలన్నిటా 'నవల' ప్రథమ స్థానాన్ని అలంకరిస్తోంది. నవలను నేటితరం విశేషంగా ఆదరిస్తోంది. అందుకే— పాఠకుల అభిమానానికి నిర్వచనంగా —

## నవలల పోటీ

మా సంస్థ నిర్వహిస్తోంది. ఉత్తమ మయిన ఏకైక నవలకి —

## రూ.10,000 బహుమతిని అందజేస్తాం!

* నవలలోని ఇతివృత్తం తెలుగువారి జీవన విధానానికి సంబంధించి ఉండాలి.
* ప్రేమ, సస్పెన్స్, థ్రిల్లింగ్ నవలలకి ప్రాధాన్యత ఉంటుంది.
* అనువాదాలు, అనుసరణలు స్వీకరించం.
* అరఠావు సైజులో సుమారుగా 250 పేజీలు ఉండాలి.
* రచన స్వంతమని హామీ పత్రాన్ని జత చేయాలి.
* పోటీలో గెలుపొందని నవలలను సాధారణ ప్రచురణకు స్వీకరించే వీలుంది.
* ప్రకటించిన బహుమతికి తగిన నవల రాకపోతే బహుమతి మొత్తాన్ని మాకు నచ్చిన రెండు లేదా మూడు నవలలకు పంచి ఇస్తాం.
* విషయాలన్నిటా తుది నిర్ణయం మాదే! ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.
* నవలలను త్రిప్పి పంపగోరేవారు తగినంత పోస్టేజీగల స్టాంపులున్న కవరును జత చేయాలి.

**గడువు తేదీ:**
**జూలై 30, 1984**

**Prisma Process Pvt. Ltd.**
**Publications Division**
Plot 6/A, Phase 1, I.D.A.
Jeedimetla, Hyderabad - 500 856

# హైదరాబాదు నోట్‌బుక్

## తొలి తెలుగు వైస్ చాన్సలర్ డాక్టర్ జి. ఎన్. రెడ్డి.

పూర్వం తెలుగుశాఖలో అసిస్టెంట్ లెక్చరర్ కావడమే గగనం. తెలుగుకు మంచికాలం వస్తుంది. తెలుగు ఎం. ఎ. చదవండయ్యా. తెలుగుకు కూడ తక్కిన భాషలతో సమానస్థాయి వస్తుంది విశ్వ విద్యాలయాలలో—అని డాక్టర్ చిలుకూరి నారాయణరావు ఆనాడు విద్యార్థులను ప్రోత్సహించేవారు. ఆయన సలహాను పాటించి పలువురు తెలుగు ఎం. ఎ. లయ్యారు. వారు లెక్చరర్లు, ప్రొఫెసర్లు, ప్రిన్సిపాళ్లు అయ్యారు



ఒక తెలుగు అధ్యాపకుడు తొలిసారిగా ఒక విశ్వ విద్యాలయానికి వైస్‌చాన్సలర్ కావడం డాక్టర్ జి. నారాయణస్వామిరెడ్డితోనే. డాక్టర్ నారాయణస్వామి రెడ్డి వైస్ చాన్సలర్ల నియామకంలో చరిత్రనే సృష్టించారు. సాధారణంగా రాష్ట్ర ప్రభుత్వం సూచించిన వ్యక్తినే గవర్నర్ వైస్ చాన్సలర్‌గా నియమించడం సంప్రదాయం. డాక్టర్ రెడ్డి నియామకం తద్భిన్నంగా జరిగింది. ఇది గూడ అసాధారణ విషయం. దీనిపై విధానమండలిలో దుమారం రేగింది. అధికార పక్షంవారు దీనిని అవమానంగా భావించి వుండరాదు. అర్హుని నియామకం జరిగిందని అని వుంటే, రాజనీతిజ్ఞత అయి వుండేది. ఏమైతేనేం ఒక తెలుగు పంతులు వైస్ చాన్సలర్ కావడం మనరాష్ట్రంలో ఇదే ప్రథమం. మిత్రులు డాక్టర్ రెడ్డిని మనసారా అభినందిస్తున్నాను. డాక్టర్. రెడ్డితో నాకు పరిచయం నేను నడుపుతున్న పరిశోధన పత్రికలో "సుశీల పిందు" అనే వ్యాసం వ్రాయడంతో ప్రారంభమయింది. అప్పటినుంచి దాదాపు మూడు దశాబ్దాలుగా ఆయన అభివృద్ధిని చూస్తూనే వున్నాను. డాక్టర్ రెడ్డి చిత్తూరు జిల్లా మహాసముద్రంలో 1928 జులై 1వ తేదీన జన్మించారు. మద్రాసు విశ్వ విద్యాలయం తెలుగు ఎం. ఎ.లో ప్రప్రథములుగా ఉత్తీర్ణులై బంగారు పతకం పొందారు. వెంటనే మద్రాసు ప్రెసిడెన్సీ కాలేజీలో తెలుగు ట్యూటరుగా అధ్యాపక వృత్తిలో ప్రవేశించారు 1949. ప్రెసిడెన్సీ కాలేజీలో 1957 వరకు అసిస్టెంట్ ప్రొఫెసర్‌గా వుండి, 1959లో శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయంలో తెలుగు లెక్చరర్‌గా ప్రవేశించి క్రమంగా రీడరుగా, ప్రొఫెసర్‌గా, ప్రిన్సిపాలుగా వివిధ పదవులు సమర్థతతో నిర్వహించారు. అప్పటి నుంచి రెండు దశాబ్దాల కాలంలో ఎం. లిట్., పి. హెచ్. డి. మొదలైన పెక్కు అర్హతలు సంపాదించుకొన్నారు. అమెరికాలోని విస్కాన్సిన్ విశ్వవిద్యాలయంలో విజిటింగ్ లెక్చరర్‌గా రెండేళ్లున్నారు. భారత ప్రభుత్వం సాంస్కృతిక వినిమయ కార్యక్రమంలో బల్గేరియాకు, ద్వితీయ ప్రపంచ మహాసభలలో పాల్గొనడానికి మలేషియాకు, కామన్ వెల్త్ విశ్వవిద్యాలయాల కాంగ్రెస్‌లో ప్రసంగించడానికి బర్మింగ్‌హామ్‌కు వెళ్లివచ్చారు. బ్రౌన్ లేఖలు, ఇంగ్లీషు—తెలుగు డిక్షనరీ, మున్నగు గ్రంథాలను పరిష్కరించారు. వృత్తిపదకోశాలను కూర్చారు. 24 ఉత్తమ పరిశోధన వ్యాసాలను రచించారు. ప్రాచ్యపండిత పరిషత్తులలోను, ద్రవిడియన్ లింగ్విస్టిక్స్ సభలకు అధ్యక్షతవహించారు. ఆధునిక రచనలకు పెక్కింటికి పీఠికలు వెలయించారు. సి.పి.బ్రౌన్ ప్రాజెక్టు మున్నగు పరిశోధన పథకాలను నిర్వహించారు. 1981లో ఉత్తమ విశ్వవిద్యాలయాచార్య అవార్డు పొందారు. డాక్టర్ రెడ్డి పర్యవేక్షణలో 12 మంది డాక్టరేట్ పట్టాలు, తొమ్మండుగురు ఎం. ఫిల్ పట్టాలు పొందారు. మూడు దశాబ్దాలకుపైగా స్నాతకోత్తరణ శిక్షణలో అనుభవం గలవారు. డాక్టర్ రెడ్డి సన్మిత్రులు, సరసులు, సహృదయులు,సమర్థులు, సత్యదృష్టిగలవారు, సత్యాన్వేషకులు. తనదే సిద్ధాంతమనే మొండిపట్టులేదు. సకారణంగా ఎవ్వరు చెప్పినా భేషజాలు లేక అంగీకరించే సరసతకలవారు. ఒక్క అన్యభాషా పదమూ, ముఖ్యంగా ఒక్క ఆంగ్ల పదమూ లేని సరళమైన, స్వచ్ఛమైన తెలుగులో ప్రసంగించగల దిట్టలు. తెలుగు భాషకు తెలుగు రాష్ట్రంలో ప్రథమ స్థానం వుండాలనే సిద్ధాంతంవారు. అన్నిటినీ మించి ఆదర్శ ఉపాధ్యాయులు. ఇలాంటి అర్హతలు గల డాక్టర్ రెడ్డి వైస్ చాన్సలర్ కావడం ఎంతో సముచితం. అందునా, శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయంలో తెలుగుశాఖ రజతోత్సవం జరుపుకొంటున్న ఈ సమయంలో డాక్టర్ రెడ్డి వైస్ చాన్సలర్ కావడం ఎంతైనా ప్రమోదదాయకం.

**ఉపశ్రుతి :**

ఏంసార్ ఇంత ప్రయత్నించినా మీ అభ్యర్థి నెగ్గకపోయాడే ? — అనడిగాను ఒక రాజకీయ నాయకుణ్ని. ప్రత్యర్థికూడ అంత ప్రయత్నమూ చేస్తాడుగదా ! — అన్నారు ఆయన సరసతతో.

**— తిరుమల రామచంద్ర★**

ఆంధ్ర మహాసభ, పాండిచ్చేరి వారి ఉగాది వేడుకల సందర్భంగా జరిగిన సభలో ప్రసంగిస్తున్న లెప్టినెంట్ గవర్నర్ శ్రీ కోన ప్రభాకరరావు, సంస్థ అధ్యక్షులు డా. నలం, పాండిచ్చేరి మాజీ ముఖ్యమంత్రి శ్రీ డి. రామచంద్రన్, పార్లమెంట్ సభ్యులు శ్రీ పి. షణ్ముగంగార్లని చిత్రంలో చూడవచ్చు.



# ఉత్తరాలు

[4వ పేజీ తరువాయి]

## జనాభా – దారిద్ర్యం

11–5–84, ఆంధ్ర సచిత్ర వారపత్రికలో బి. నరేంద్రశేఖ్ ప్రచురించిన "పశ్చిమ దేశాలవారిని నిందించడమెందుకు ?" (ఇది శీర్షికా లేక ప్రకటనా ? తెలియకున్నది) బాగున్నది ! మన దేశ దారిద్ర్య కారణాలను ఆయన అమెరికాలో సర్వే చేయడం – దూడ గడ్డి కోసం తాటిచెట్టు ఎక్కినట్టు – ఇంకా బాగున్నది. ఒక చిన్న కార్టూన్‌ను కూడా అర్థం చేసుకోలేని మిస్టర్ నరేంద్రని చూస్తే పశ్చిమ దేశాల్లో తిండికి లేనివాళ్ళు మాత్రమేకాదు ఆలోచన లేనివాళ్ళుకూడా వుంటారని తెలుస్తున్నది.

మా దేశం నుండి ఏటా ఎన్ని కోట్ల విలువ చేసే ముడిసరుకులు పశ్చిమానికి ఎగుమతి అవుతున్నవో, ఎన్నికల్లో ఎన్ని కోట్ల నల్లడబ్బు పారుతుందో, యుద్ధ భయంతో ఎన్ని కోట్ల మారణాయుధాలు పుడుతున్నవో, విప్లవకారుల్ని అణచివేయడానికి ఎన్ని కోట్లు ఖర్చు అవుతున్నదో, ఎన్ని కోట్లు బంజరు భూములు సాగులేక బీటలిస్తున్నవో మీకు తెలుసా నరేంద్రజీ ! ఇదంతా ఎవరు చేస్తున్నారు ? టాటా, బిర్లా, ముంగలాల్, మఫత్‌లాల్ లాంటి ఓ పాతిక కుటుంబాలు. అవును పార్లమెంటు వున్నది మా దేశంలోని పేద ప్రజలకొరకు, మధ్యతరగతి ప్రజలకొరకు కాదు. దేశమంతా విస్తరించబడిన (ఎన్నికల్లో గెలిపించి అధికారాన్ని ప్రసాదించే) ఈ పాతిక కుటుంబాల పరిశ్రమల ప్రయోజనార్థం. దేశ జనాభాకి ముప్పాతిక రెట్లు నిరుపయోగంగా పడివున్న భూముల్ని ఎందుకు యాంత్రీకరణచేసి సాగుచేయడంలేదు ?

ముందు యావత్ భారద్దేశాన్ని విద్యుదీకరించాలి, యాంత్రీకరించాలి. అంత నిస్వార్థులు ఎవరు ? ఎవరూ లేరుకాబట్టే ఈ దేశమిలా పడివుంటున్నది. ఇవన్నీ పక్కనపెట్టి మా దేశ దరిద్రానికి 'జనాభా' ఒకటే కారణమంటారా ? ఇదే నిజమైతే ప్రపంచంలోకల్లా అత్యధిక జనాభా కల్గివుండీ మాకంటే సంపన్నంగా వున్న 'చైనా' మాటేమిటి ? 'అధిక జనాభా' అనే కారణం పాలకవర్గాలు, ప్రజల ఆలోచనల్ని పక్కదారికి మళ్ళించి తప్పించుకోవడానికి తరతరాలుగా ఆడుతున్న పెద్ద అబద్ధం మాత్రమే!!!

పి. కరుణానిధి, తిరుపతి.

* [శ్రీ నరేంద్రశేఖ్ రచన· ప్రకటన కాదు. — సం.]


Printed and Published by S. Nageswara Rao at The Andhra Patrika Press, Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada-3.

Editor : S. Radhakrishna.


## తెలుగు పుస్తక ప్రదర్శన

జూలై 1వ తేదీనుండి వారం రోజుల వరకు కౌలాలంపూరులో తెలుగు పుస్తక ప్రదర్శన నిర్వహించబడుతుంది. దీనికోసమై రచయితలు, ప్రకాశకులు, పుస్తక వ్యాపారస్తులు, తెలుగు అభిమానులువారి పేరు,చిరునామాతోపాటు ఈ జూన్ 20తేదీలోగా పుస్తకములు పంపుకోవాలని మనవి.

పుస్తకములు పంపించేవారి పేరు, విలాసములు ప్రచురించెదము. పంపించే వారందరికీ నా ధన్యవాదములు.

**M. RAMA NAIDU,**
**CDL, University Hospital,**
**Kualalumpur, Malaysia.**

* * *

భారతీయ పదాతిదళములో నాయక్ సుబేదారుగా పనిచేసి రిటైరయినాను. నా కుమార్తు చి॥ శాంతిభూషణ్, 23 సం॥రాల ప్రాయము బి.ఇ. (సివిల్) 3వ సం॥రం చదువుచున్నాడు. ఇతనికి కిడ్నీ కేన్సరు వ్యాధి వలన (బైలేటరల్ రీనల్ ఫైల్యూర్) రెండు మూత్ర పిండములు చెడిపోయి బాధపడుచున్నాడు. అడయారు కేన్సరు హాస్పటల్‌లో చికిత్స పొందుచూ వారానికొకసారి జరిపే హీమో – డయాలిసిస్ ప్రక్రియ వలన జీవించుచున్నాడు. పాడైపోయిన రెండు మూత్రపిండములను శస్త్ర చికిత్సద్వారా తొలగించి ఒక ఆరోగ్యవంతుని దేహమునుండి గ్రహింపబడిన మూత్రపిండమును రోగికి ట్రాన్స్‌ప్లాంట్ చేసినచో జీవించగలడని వైద్యులు నిర్ధారించిరి. రోగి బ్లడ్ గ్రూపు సి–కి చెందిన మూత్రపిండ దాతలెవరు లభించలేదు. ఈ పరిస్థితిలో రోగి యొక్క మొత్తం కేసు రికార్డు నంతయూ అమెరికా, న్యూయార్క్‌లోని మెమోరియల్‌స్లోన్ కెట్టరింగ్ ఇన్‌స్టిట్యూట్‌నకు కెడావరు డోనరు కిడ్నీ ట్రాన్స్‌ప్లాంట్ ఆపరేషన్ చేయు నిమిత్తం పంపిరి. న్యూయార్క్ ఆస్పత్రి డాక్టర్లు కేసు పరిశీలించి శీఘ్రమే రోగిని తమ హాస్పటల్‌లో చేర్పిన తగు వైద్యము, ట్రాన్స్‌ప్లాంట్ ఆపరేషన్ చేసెదమని తమ అంగీకారమును తెలిపిరి. సదరు న్యూయార్క్ హాస్పటల్‌లో కెడావరు డోనరు కిడ్నీ ట్రాన్స్‌ప్లాంట్ నిమిత్తం రు. 1,50,000/–లు ఖర్చు అగునని తెలిపిరి. ఇంత ఖర్చు భరించే శక్తి నాకు లేదు. కొంతమంది హితుల, రక్షణ శాఖవారు మొత్తం రు 75,000/–లు సహాయం చేసిరి. ఇంకనూ మరి కొంత సహాయం అత్యవసరము.

దయామయులైన పాఠకులు ఉచిత రీతిని ఆర్థిక సహాయం అందించి నా కుమారునికి ఆరోగ్యవంతమైన జీవితమును ప్రసాదించగలందులకు ప్రార్థిస్తూ ఈ విజ్ఞప్తిని మీ ముందుంచుచున్నాను.

బి. ప్రభాకర్ రిటైర్డ్ నాయక్ సుబేదారు,
యానాం : పోస్టు, పాండిచేరి రాష్ట్రము ★




# క్రొత్త ఎక్కువ శక్తివంతమైన సూపర్ 777 డిటర్జెంట్ బార్

## నాణ్యతను గురించిన పొగడ్తలు కేవలం పొగడ్తలే కావనీ, నిజమని నిరూపించే హామీ కూడా ఇస్తుంది.

ఇప్పుడు క్రొత్త సూపర్ 777 డిటర్జెంట్ బార్‌తో నాకు లభిస్తుంది అన్నిటికంటే ఎక్కువ తెలుపు. దీని డిటర్జెంట్ ఫార్ములా మునుపు కంటే ఎక్కువ మేలైనది. అందుకే ఇది మునుపు కంటే ఎక్కువ నురుగ ఇస్తుంది, ఎక్కువ బట్టలు ఉతుకుతుంది, ఎక్కువ మన్నిక వస్తుంది. అంచేతే ఇది ఇతర అన్ని డిటర్జెంట్ బారులు మరియు సబ్బుల కంటే ఉత్తమమైనది!

వాడి చూడండి...మీరూ విస్తుపోయి చూస్తారు, మరి-మరి దీన్నే కొంటారు.

Shilpi DM 2/83 Tel.